# అపరాధ పరిశోధన

రు.3 | జులై '75

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—19

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఎడారి రేచులు!
రచన: శ్యాంబాబు

## నీతి లేనివాళ్ళు
రచన: ఏ. వీ. మోహన్రావ్

## మాయమైన మహల్
రచన: సుజనశ్రీ

## హత్య చేసి చూడు?
రచన: కంచర్ల రమణ

"ఖైదీ" సీరియల్ - 14 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—19
జూలై, 1975
వెల: రు. 3–00
ఏడాది చందా 39 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. ఏ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు–29
ఫోన్—36959

# ఎడారి రేచులు!

శ్యాంబాబు

'పార్‌మర్' రాజస్థాన్ సరిహద్దులో వున్న చిన్నగ్రామం. భారత పాకిస్తాన్ సరిహద్దు ఆవూరికి సరిగ్గా యాభై మైళ్ళ దూరం వుంటుంది. ప్రభుత్వం ప్రజలు మరిచిపోయిన అతిచిన్న ప్రదేశం అది. చుట్టూ మైళ్ళకొలది ఎడారి, అంత తెగని ఇసుక కుప్పలు, రాళ్ళు ఇసుక కలిసి గట్టిపడిపోయిన సారం లేని నేల, చిన్న చిన్న చెట్లు మొలవని కొండలు— ఆవూరుఅక్కడ ఎలా వెలసిందో, ఎందుకో, ఆవూళ్ళో ఇంకా ప్రజలు ఎందుకుంటున్నారో, నాగరికతా ప్రపంచాన్నిచూసిన మనుషులకు అర్థంకాదు.

శతాబ్దాలనుండి ప్రజలు ఆవూళ్ళో మిగతా ప్రపంచంతో

సంబంధం లేకుండా అలా బ్రతుకుతోనే వున్నారు. వూరి మొత్తానికి మూడు ఇళ్ళుకన్నా ఎక్కువవుండవు. అన్నీ రాతితో కట్టిన పురాతనపుఇళ్ళు, కప్పుగా ఖర్జూరపుమానులు, 'సీసా బొంగులు, ఖర్జూరవు ఆకులు వుపయోగిస్తారు. ఊరు మధ్యలో చిన్న మంచినీటిబావి— తియ్యటి, చల్లటి నీరు, బావిచుట్టూ గుంపులుగా పెరిగిన ఖర్జూరపు వృక్షాలు... అదే లేకపోతే ఆ వూరు వుండేదికాదను కొంటాను.

కానీ:1965లో పాకిస్థాన్‌తో యుద్ధంతోబాటు, పార్మర్ ప్రాముఖ్యత కొద్దిగా పెరిగింది. 'బికనీర్'నుండి 'చరక్ వాలా', మొహన్‌ఘర్' మీదుగా 'జైసిల్మార్'కు ఓరోడ్డును సైనిక అవసరాలకోసం వేయడం జరిగింది. అలాగే ఈరోడ్డును కలుపుతూ మరోసరిహద్దు పట్టణమైన 'బిర్‌సిల్‌పూర్'కు మరో రోడ్డు వేయడం జరిగింది. చిత్రంగా ఈ రెండు రోడ్లు 'పార్‌మర్' దగ్గర కలవడంతో 'పార్‌మర్'కు ప్రాముఖ్యత పెరిగింది.

యుద్ధం తరువాత ఈరోడ్డు సివిలియన్ ట్రాన్స్‌పోర్టుకు కూడా వుపయోగించడంతో 'పార్‌మర్‌లో' సంచలనం ప్రారంభమయింది. చిన్నటీస్టాలు, భోజన హోటలు వెలిసాయి, ట్రక్ రిపేరుషాపు, ఇతర అవసరాలకు పనికి వచ్చే కొట్లు తెరవబడ్డాయి. రాత్రనక, పగలనక ఈరోడ్లమీద కొన్నివందల మైళ్ళు ఎడారి ప్రయాణం చేసే ట్రక్ డ్రైవర్లకి, సైనికులకు 'పార్‌మర్' చలికేంద్రం అయింది.

ఆరోజు మధ్యాన్నం పదకొండు గంటలు కావొస్తుంది. వేసవి దాటిపోయినా సూర్యుడు ఇంకా తీవ్రంగా తనప్రతాపాన్ని చూపెడుతోనే వున్నాడు. ఇసుకనేల కావడంతో వేడిని త్వరగా పీల్చు కొంటుందినేల. ఉదయమే బికనీర్‌నుండి, మొహన్‌ఘర్

నుండి బయల్దేరిన ట్రక్కులు అంతకు ముందేవచ్చి ఆగాయి

మానాన్న ట్రక్ డ్రైవర్లకు టీకలపడానికి, అమ్మచపాతీల చెయ్యడంలోనూ మునిగిపోయారు. స్టాల్‌లో ఒకమూల నలుగుర ఆర్మీ జవాన్లుకూర్చొని సిగరెట్లు కాల్చుకొంటూ, ఖర్జూరాల తింటూ కబుర్లు చెప్పుకుంటున్నారు. నేను కాష్‌కౌంటర్ వెను కుర్చీలో కూర్చొని తీరగ్గా వచ్చేపోయే ట్రక్కుల్ని, సైనికవాహ నాల్ని చూస్తూ కూర్చున్నాను.

ఆకాశంలో చిత్రమైన ధ్వని వినిపించింది. దూరంగ పొడుగాటి హెలీకాప్టర్ పోతూ కనిపించింది. 'డిజర్ట్ వార్‌పెర్ లో సైనికులకు శిక్షణ ఇవ్వడానికి చరక్‌వాలా దగ్గర నెలకొల్పి ట్రయినింగ్ సెంటర్ తాలూకుది అయ్యుండాలి. క్రిందనుం చూడ్డానికే చాల పెద్దదిగా కనిపిస్తుంది. వారానికి రెండ మూడు సార్లు ఇటువైపు ఎగురుతూ వస్తుంది. సిగరెట కాల్చాలని పించింది. అమ్మా నాన్న ముందుకాల్చడం అలవాట లేదు నాకు. బయటకి నడిచి, ఖర్జూరచెట్టు నీడిలో నిలబడ సిగరెట్ వెలగించాను.

దూరంగా శ్రీమోహన్‌ఘర్ వైపునుండి ఏదో జీప వస్తుంది. సిగరెట్ పొగవదుల్తూ ఆశ్చర్యంగా దాని వైపు చూస్తూ నిలబడ్డాను. అలాంటి జీపులు ఈవైపువెప్పుడూరావు జీపు తిన్నగా వచ్చి టీస్టాలు ముందు ఆగింది. 'లాండ్‌లోవర్ అనే అక్షరాలు బోనెట్‌మీద మెరుస్తున్నాయి. బ్రిటీష్‌మేడ్ ఫోరువీల్ డ్రైవ్ జీపు. ఇలాంటి ఎడారి ప్రాంతంలో బాగా ప చేస్తుంది. లాండ్‌లోవర్ డోరు తెరచుకొని క్రిందకుదిగి వ్యక్తిని పరిశీలనగా చూస్తూవుండిపోయాను.

ఆరడుగుల భారీ శరీరం, డెనిమ్ జీన్స్, సమ్మర్ స్లాక్స్ ధరించాడు, కాళ్ళకు బాటావే స్పైండర్ బూట్లు, కళ్ళకు అత

క్కున్నట్లుగా వుండే 'విండ్‌బీటర్' కూలింగ్‌గ్లాసెస్, చేతికి కంపాస్ డయల్ వాచీ— లాండ్‌లోవర్‌లోనుండిదిగి మా టీస్టాల్‌వైపు పరీక్షగా చూస్తున్నాడతను. పట్నవాసానికి బాగా అలవాటుపడిన మనిషిలా వున్నాడు. నేను సిగరెట్ నలిపేసి అతని దగ్గరకు నడిచాను.

"వాట్ కెనె డూ ఫర్‌యు సర్!"—అన్నాను చిరునవ్వుతో. అతను నావైపు పరిశీలనగా చూశాడు. "ఇక్కడ ఇంగ్లీషు మాట్లాడే వాళ్ళు కూడా వున్నారన్నమాట"—అన్నాడు అదోలా.

"నేను బి.ఎ. చదివాను. ఈ టీస్టాలు మాదే. పరీక్షపాసయినా ఉద్యోగం దొరక్క ప్రస్తుతానికి ఇక్కడే వుంటున్నాను. లోపలికిరండి"— అన్నాను లోపలికిదారితీస్తూ.

"పరీక్షపాసయినా ఎడారిలో ఉద్యోగాలు దొరకవు... ఏ పట్టణంలోనో ట్రై చెయ్యాలి"— అన్నాడతను లోపలికొస్తూ.

అతను స్టాల్ లోపలికి రాగానే ఒక్కక్షణం లోపల నిశ్శబ్దం ఏర్పడింది. అందరూ మాటలు ఆపేసి అతనివైపు చిత్రంగా చూస్తూ వుండి పోయారు. నాన్న స్టౌ దగ్గరనుండి హడావిడిగా ముందుకొచ్చి భుజం మీద మాసిన తుండు గుడ్డతోనే ఓకుర్చీ దులిపి అతన్ని కూర్చోమన్నాడు. ట్రక్‌వాలాలు మళ్ళీ వాళ్ళ సంభాషణలో పడిపోయారు.

"షర్బత్ తెమ్మంటారా సాబ్!"—నాన్న వినయంగా అడుగుతోన్నాడు.

అతన్నవ్వుతూ తల అడ్డంగా త్రిప్పాడు. "ఇప్పుడేమీ అక్కరలేదు. నేను నాలుగైదు రోజులు ఇక్కడ వుండదలుచుకొన్నాను. వీలవుతుందా?" అన్నాడతను.

నాన్న ఇబ్బందిగా నావైపుచూశాడు. పార్వతీపూర్‌లో బయటివాళ్ళెప్పుడూ ఒక్కరాత్రికన్నా ఆగరు. అలాంటిది ఇతను నాలు

గైదు రోజులు వుండదలుచు కొన్నాడంటే ఇక్కడేదో పనిమీద వచ్చియుండాలి. పార్మర్ లాంటి అతిచిన్న పల్లెటూళ్లో ఇతనికేం పనివుందో ఊహించ లేక పోయాను.

"ఈ వూళ్ళో సాధారణంగా బయటి వాళ్ళెవరూ బస చేయరు సార్! మీరారు వుండడానికి హోటల్స్ లాంటివి కూడా లేవు" —అన్నాను లోలోపల ఆశ్చర్యపోతూ!

"నో...నో... నాకు హోటల్స్ ఏమీ అక్కరలేదు నాజీపు చూశావుగా? నిద్రపోదలుచుకుంటే లోపలే పడుకోగలను...నా దగ్గర టెంటుతో సహా కాంపింగ్ఎక్విప్మెంట్ అంతావుంది. నాకు కావలసింది భోజనం, వసతికాదు. ఈప్రాంతమంతా క్షుణ్ణంగా తెలిసిన ఒకమనిషి కావాలి"— అన్నాడతను సిగరెట్ వెలిగిస్తూ.

"నేను చిన్నతనంనుండీ ఇక్కడే పుట్టి పెరిగాను. చదువు కోసం పై వూళ్ళకు వెళ్ళినా, ఈప్రదేశమంతా నాకుబాగా తెలుసు. నేను మీకు సహాయం చెయ్యగలను. కాని మీరు చూడదగిన ప్రదేశం, చూసి ఆనందింపదగిన ప్రదేశాలు— ఈప్రాంతంలో లేవు"—అన్నాను అతని ప్రశ్నకు జవాబుగా.

అతను సిగరెట్ పొగసన్నగా ధారలా వదుల్తూ నవ్వాడు... "నేను ఈ చుట్టూ ప్రక్కల ప్రకృతి దృశ్యాలు, పురాతన స్థలాలు చూడ్డానికి రాలేదు. ఈప్రాంతపు ఎడారి కొండల్లో 'ఎడారి రేచులు' దొరుకుతాయని వినివచ్చాను"— అన్నాడు.

"ఎడారిరేచులా?"— అన్నాను ఒక్కక్షణం అర్థంకానట్టు.

ఎడారిరేచులు, తోడేలు జాతికి చెందిన జంతువు. పెద్ద సైజు కుక్కలా వుంటుంది. మెడమీద సింహంలా జూలు పెరిగిఉంటుంది, ముఖం, మూతి వెడల్పుగా ఉంటాయి. సన్నని నడుం, పూచలాంటి కాళ్ళు వుంటాయి. గంటకు

దాదాపు డెభ్భై మైళ్ళ వేగంతో పరుగెత్తగలదు. అతి చురకైన జంతువు. ఈ ఎడారి కొండల్లోనే దొరికే రాతిబల్లులను, తొండలనూ, కొండ గొర్రెలనీ వేటాడి తింటుంది. ఈ జాతికుక్కలు ఈ రాజస్థాన్ ఎడారి ప్రాంతంలోనేఉం టాయి. కాల క్రమేణా ఈ జాతి సహజమరణాల వల్లా, మనుష్యులవల్లా నశించిపోయి అపరూపమైపోయింది. మనుష్యులు ఎక్కువగాతిరగని ఈ ప్రాంతంలోని 'రేచు' లు మాత్రం ఇంకా కొద్దిగా దూరాన కనబడే కొండలో మిగిలి ఉన్నాయి.

"అవును! పూర్తిగా నశించిందని ప్రభుత్వంచేత ప్రకటింపబడిన ఈ రేచు ఇంకా ఈ ప్రాంతంలో బ్రతికిఉందని నాకీమధ్యనే తెలిసింది. నేను హంటర్ని. నైనటాల్లోనూ, గిర్ అడవులలోనూ, చంబల్లోయలోనూ, ఇదివరలో అనేక రకాలైన జంతువుల్ని వేటాడానుకాని, ఇంతవరకూ రేచును మాత్రం నేను వేటాడలేదు. ఈ అరుదైన మృగాన్ని వేటాడి, దానిచర్మంతో డమ్మీ తయారుచేయించి నా డ్రాయింగ్‌రూమ్‌లో పుంచాలనేది నాకు చాలా కాలంగా మిగిలిపోయిన కల"— అన్నాడు అతను.

"కాని ఎడారిరేచును వేటాడ్డం చాలా కష్టం. అది చాలా క్రూరమైన తెలివైన జంతువు. ఏ మాత్రం అవకాశం దొరికినా రంపాల్లాంటి పళ్ళతో ప్రత్యర్థిని చీల్చిచెండాడుతుంది. మెఱుపులా కదులుతుంది. గాలిలా పరిగెడుతుంది. ఈ ఎడారి కొండలో దాన్ని వేటాడ్డం చాలా కష్టం"— అన్నాను నేను.

"డోన్ట్ బాదర్! ఈ ఎడారిలో అవి తిరిగే ప్రాంతం నువ్వు నాకు చూపించగలిగితే చాలు"—

"కాని ఒకటి రెండ్రోజుల్లో అదిమనకు కనబడకపోవచ్చు"

—అన్నాను.

"అయినా ఫరవాలేదు. నాకు వారం రోజులు శెలవుంది. ఈ వారంరోజులు నీవు నావెంట వుండి నాకు సహాయంచేస్తే, నీకురోజుకు పాతిక రూపాయలచొప్పున ఇస్తాను"— అన్నాడతను విలాసంగా చివరి దమ్ము పీల్చి సిగరెట్ ఆర్పేస్తూ.

దాదాపు రెండువందల రూపాయలు ప్లస్ ఎడారిరేచును వేటాడే అనుభవం—పనీపాటాలేకుండా తిరిగేనాకు అంతకన్నా మంచి ప్రపోజల్ వుండదు, అనిపించడంలో ఆశ్చర్యంలేదు.

"ఓకె సర్! ఇట్స ఢీల్!"— అన్నాను నవ్వుతూ...

# 2

అతని పేరు విశ్వనాధ్ బండారి. అహమ్మదాబాద్‌లో ఓ పెద్దనూలుమిల్లుకు యజమాని అతను. వేట అంటే అతనికి చెప్పలేనంత సరదా. ఆ రోజు సాయంత్రం అతని ఆల్బమ్‌లో అతను చంపిన రకరకాల జంతువుల కళేబరాలతో తీయించు కొన్న ఫోటోలు చూసి ఆశ్చర్యపోయాను. నైనెటాల్ ప్రాంతం లో తిరిగే పెద్దపులి, చంబల్ ప్రాంతంలోని చీటా, భల్లూకాలు అతని తుపాకీ గుళ్ళకు లొంగిన కొన్ని మృగాలు.

అతని వించెస్టర్. 358 ఆటోమేటిక్ యాక్షన్ రైఫిల్ చూసి ఆశ్చర్యపోయానునేను. పది గుళ్ళుపట్టే మాగజైన్ ఫోర్ పవర్ టెలిస్కోపుతో అమర్చబడిన రైఫిల్ అది. దానికి వాడే నికేల్ జాకెట్ బుల్లెట్స్‌కు, ఏనుగు తలలోకి గురి చూసికొడితే, తోకదగ్గరనుండి బయటికొచ్చే శక్తి వుంది.

"నీకు రైఫిల్ పేల్చడం వచ్చునా?"— అడిగాడు బండారీ, ఆరోజు ఉదయం మేము బయలుదేరేముందు.

వచ్చునన్నట్లు తలవూపాను. కాలేజీ యన్. సి. సి. లో ఉన్నప్పుడు ఎరల్‌రాబెట్ షూటింగ్ కాంపిటీషన్‌లో

పెట్లోన్నాను''— అన్నాను.

''హండ్రెడ్ యార్డ్సులో నీ గ్రూపింగ్ ఎంత?''— అడిగాడు బండారీ.

''టు యించస్!''—అన్నాను గర్వంగా.

''ఏ రైఫిల్‌తో?''—

''.303 మార్క్ ఫోర్...స్టాండర్డ్ ఆర్మీ వెపన్'' — అన్నాను.

''వెరీగుడ్!''—అన్నాడు బండారీ చిత్రంగాచూస్తూ.

అవును. .303 రైఫిల్‌తో హండ్రెడ్ యార్డ్స్ ఫైరింగ్‌లో రెండంగుళాల గ్రూపింగ్ వచ్చిందంటే నేను మంచి గురికాడికిందే లెక్క. ఐదు బుల్లెట్లు వరసగా వంద గజాలదూరంనుండి పేలిస్తే అవి టార్గెట్‌మీద రెండంగుళాల వ్యాసంవున్న వృత్తం లోపల తగిలితే దాన్ని టూ ఇంచీ గ్రూపింగ్ అంటారు.

''నీదగ్గర రైఫిల్‌గాని, బోర్‌గన్ గాని వుందా ?'' — అడిగాడు బండారి.

లేదనట్లు తలవూపాను. బండారీ లాండ్‌లోవర్ డాష్ బోర్డ్ క్రిందవున్న గన్ రేక్‌లో నుండి మరోగన్‌బయటకుతీసి, చిన్న సూట్‌కేస్‌లో నుండి టెలిస్కోప్ లెన్స్ తీసి దానికి బిగించి నాకందించాడు.

నేను దాన్నందుకొని భుజానికి అదిమిపెట్టి దూరాన వున్న కొండలకేసి లెన్స్‌లో నుండి చూశాను. దగ్గరిగా వున్నట్లు కనిపిస్తోంది. రైఫిల్ దించి పరీక్షగా చూశాను. .22 హార్నెట్‌రైఫిల్. మాంచెస్టరంత పెద్ద రేంజ్ లేకపోయినా, మూడువందల గజాలవరకూ చాలా యాక్యురేట్ గా పనిచేస్తుంది. బోల్ట్‌యాక్షన్ రైఫిల్ చాలా తేలిగ్గా

వుంటుంది.

తృప్తిగా తలాడించి బండారీకి ఇచ్చేశాను. ఇద్దరం మా వూరికి పశ్చిమానవున్న కొండలకేసి బయలుదేరాం. ఫోర్‌విల్ డ్రైవ్ కావడంవలన, వదులుగాఉన్న ఇసకలోకూడా లాండ్ లోవర్ మెత్తగా ముందుకు కదిలింది. రాళ్ళగుట్టలవల్ల, ఇసకవల్ల పెద్దస్పీడుగా పోకపోయినా రెండు గంటల్లో దాదాపు నలభై మైళ్ళు కవర్ చేశాము. అదే కాలినడకనైతే రెండు రోజులు పట్టేది.

ఎటుచూసినా చిన్న చిన్న ఎత్తు పల్లాలతో, ఎక్కడా పచ్చదనం కనిపించని విశాలమైన ఎడారి. ఒంటరిగా, సరైన పరికరాలు, దుస్తులులేకుండా ఆ ఎడారిలో బ్రతకడం బహు దుర్లభం. అక్కడక్కడా దుబ్బులుగా పెరిగిన 'కాక్టస్' జాతి మొక్కలు తప్ప మరేరకమైన వృక్షసంతతి ఆ ప్రాంతంలో కనిపించదు. దూరానవున్న కొండలు క్షణక్షణానికి దగ్గరవుతున్నాయి. నేను లాండ్‌లోవర్‌లో బండారీ ప్రక్కనే ఫ్రంట్‌సీట్లోకూర్చొని ఎటువెళ్ళాలో డైరక్షన్ ఇస్తున్నాను. ఎడారిలో తిరగడం అలవాటులేకపోతే దారి తెలియడం చాలా కష్టం. ఎటుచూసినా ఓలాగానేఉంటుంది. చిన్న చిన్న రాలి గుట్టలను, కొండలను, గుర్తు పెట్టుకొని ప్రయాణంచేయాలి.

ఎడారి రేచులు ఆ ఎదురుగాఉన్న కొండ గుట్టల్లో తిరగడం అప్పుడప్పుడూ చూశాను. ఎప్పుడైనా సంవత్సరానికి నాలుగైదుసార్లు కురిసే వాననీళ్ళు కొండల్లో ప్రకృతి సహజంగా ఏర్పడ్డ రాతిగుంటల్లో నిలవుంటుంటాయి. ఆ నీరు త్రాగడానికి సూర్యోదయ సమయంలో వస్తూవుంటాయి రేచులు. అలాంటి నీటిగుంటలు వుండే కొండప్రాంతానికి వెడుతున్నామిప్పుడు. మేము ఈ రాత్రికి ఆదగ్గరలో కాంప్‌వేసి, వుదయమే

పట్టుకోవడంవేలని సాయంత్రమే బయలు దేరాము.

కొండలదగ్గరికి రాగానే జీపు ఆపి క్రిందకు దిగాము. సున్నగా ఏవరో పనిపెట్టుకొని చదును చేసినట్లువున్నాయి చాలావరకు. మనుషులు తిరగని ప్రాంతంకాబట్టి కొండల పైకి వెళ్ళడానికి దార్లంటూ ఏమీలేవు. నిజానికి అవి కొండలు కావు. పెద్ద పెద్ద రాళ్ళగుట్టలు. కొన్ని ఏకరాళ్ళు, కొన్ని రకరకాల రాళ్ళు ఒకదానిమీదఒకటి పడి ఏర్పడినవి. మా జీప్ఆగిన స్థలానికి ఎడంప్రక్కగా ఒక కొండ మీద కాస్త ఏక్కువగా కాక్టస్ మొక్కలు కనిపిస్తున్నాయి. దానిమీదే 'కాళీమాయీ' గుడి ఒకటివున్నట్టు గుర్తునాకు.

"ఆ కొండమీద ఏక్కువగా కాక్టస్ కనిపించడానికి కారణం ఏమిటి?—" అడిగాడు బండారీ.

"అంటే ఆకొండమీద ఎక్కువగా రాతిపగుళ్ళు ఉన్నాయన్నమాట. ఏప్పుడైనా వర్షం పడినప్పుడు ఆ రాతి పగుళ్ళ మధ్య వున్న ఇసుకలో నీరు నిలవవుండటం జరుగుతుంది. అలా ఏన్ని పగుళ్ళుఉంటే అన్నిచోట్ల దాంట్లో ఇసుకవుంటే నీరు నిలవవుండే అకాశం ఉంది. ఆలాంటిచోట్ల ఈ కాక్టస్ చెట్లు మొలుస్తాయి. పదండి ఆకొండే ఏక్కుదాము. దానిమీదవున్న కాళీమాయీ గుడిచుట్టు ప్రక్కల రాళ్ళక్రింద నీళ్ళు నిలవుండే గుంటలు చాలా వున్నాయి''— అన్నాను.

ఇద్దరం పావుగంటలో ఆగుట్ట ఏక్కాము. పైన ఒకదాని మీద ఒకటి పడిపోయినట్లుగావున్న రాళ్ళమధ్యవున్న ప్రదేశంలో ఒకచోట 'కాళీమాయీ' విగ్రహంఉంది. అదే గుడి కాళీమాయీది. ఏప్పుడు ఏవరు ఆ విగ్రహాన్ని అక్కడపెట్టారో తెలియదుకానీ, అదినాకు తెలిసినప్పటినుండీ అలానేఉంది. కాళీమాయీకి భక్తిగా దండంపెట్టుకొన్నాను.

కళ్ళు తెరిచేప్పటికి బండారీ నన్నుచూసి నవ్వుతున్నాడు. "నీలాంటి భక్తులెవరో ఈ మధ్యే కాళీమాయిని దర్శించు కొన్నట్టున్నారు"— అన్నాడు.

అప్పుడుచూశాను నేను కాళీవిగ్రహం నుదుటవున్న కుంకుమ బొట్టు, ఎప్పుడో ఎవరో పెట్టిన పొడికుంకుమ బొట్టు ఇంకా కాళీనొసటన అలానే వుండదు. ఈ రోజో, నిన్ననో పెట్టినట్లు అనిపిస్తోంది.

"ఏమో! మావూరినుండి ఎవరూ ఇక్కడికి వచ్చినట్లు నాకు తెలియదు. వచ్చినామనకు దార్లో ఎదురు పడేవాళ్ళు. బహుశా ఎప్పుడో ఎవరో పెట్టిందయ్యుంటుంది"— అన్నాను.

"కాళీమహత్యం అయ్యుంటుంది"— అన్నాడు బండారీ నవ్వుతూ.

కాళీ గుడికి క్రిందుగా రాళ్ళ క్రింద,బండల సందుల్లో నాలుగు నీటిగుంటలు కనిపించాయి. గుంటల చుట్టూ వున్న ఇసుకలో రేచుల కాలిముద్రలు స్పష్టంగా అవుపిస్తున్నాయి. ఆ ప్రదేశంనుండి ఏడారి ప్రదేశం గుర్తుపెట్టుకోమన్నాడు బండారేనన్ను.

"మనం దగ్గరలోవుండి దాన్ని కాల్చాలని ప్రయత్నిస్తే అది తప్పించుకొని పారిపోవచ్చు, మనల్ని పసిగట్టి. అంచేత ఈ ప్రాంతం ఏడారిలో ఎక్కడకు బాగాకనిపిస్తుందో అక్కడవుండి షూట్ చేస్తే బావుంటుంది"—అన్నాడు బండారీ.

"కానీ అక్కడినుండి రేంజ్ సరిపోతుందా?" అన్నాను అనుమానంగా.

"వించెస్టర్ రేంజ్ దాదాపు 1200 మీటర్లు. టెలి స్కోపిక్ సైట్‌లోంచి సరిగ్గాచూసి షూట్‌చేస్తే గురితప్పే అవకాశం లేదు"— అన్నాడు బండారీ కాన్ఫిడెంట్‌గా.

ఎంతో గురికాడైతేతప్ప ఆ రేంజ్‌నుండి మిస్ అవకుండా కాల్చుతాడు. బండారీ సామర్థ్యం నాకు తెలియదు. అందుచేత వాదన చెయ్యదల్చుకోలేదు.

కాసేపు ప్రాంతాన్ని బాగా ఆకళింపు చేసుకొన్నాక, ఇద్దరం కిందికి దిగివచ్చి టెంట్ వేసుకొని విశ్రాంతి కుపక్రమించాము.

# 3

తూర్పున తొలి వెలుగు రేఖలు అప్పుడే విచ్చుకొంటున్నాయి. రాత్రి చల్లదనం ఛాయలు ఇంకా పోలేదు. నేను బండారి ఇసుక మధ్యలో అమర్చి పెట్టినట్లు వున్న ఓ రాతి వెనక నిలబడి మా రైఫుల్స్‌కు అమర్చిన టెలిస్కోపిక్ లెన్స్‌లో నుండి 'కాళీమాయి' గుడివున్న ప్రాంతాలకేసి చూస్తున్నాం. లెన్స్‌లోనుండి చూడ్డం విసుగుపుట్టినప్పుడు బండారీ మెడలో తగిలించుకొన్న బైనాక్యులర్స్‌తో చుట్టూ చూస్తున్నాడు.

"చందన్! లుక్ అవి వస్తున్నట్లున్నాయి"— అన్నాడు బండారీ ఉన్నట్లుండి గుసగుసలుగా. నేను రైఫిల్ భుజానికి ఆనించి కాళిమాయి గుడికేసి లెన్స్‌లోనుండి చూశాను. యస్ హి యీజ్ రైట్! రెండు రేచులు ఎటునుండో వచ్చి అటూ ఇటూ చూస్తున్నాయి. ఆకోణంలోనుండి అది దాదాపు ఓ కిలోమీటరు దూరంలో వుండివుంటాయి. అంటే అది మమ్మల్ని వాసనతో పసిగట్టగల దూరంలో వున్నామన్నమాట. అందులోనూ గాలికూడా సన్నగా మామీదుగా అటువైపు వీస్తోంది.

లెన్స్‌లో అవి రెండూ కదలడం స్పష్టంగా కనిపిస్తున్నాయి. అందులో ఓ రేచు ఆగి రెండుకాళ్ళు బండమీద పెట్టి మేమున్న వైపుకు చూస్తోంది

"అవును! అవే!" అన్నాను నేను వాటిమీదనుండి దృష్టి త్రిప్పకుండా.

బండారీ నిశ్శబ్దంగా రైఫిల్ భుజానికి ఎత్తిపెట్టి, చేంబర్లోకి బుల్లెట్ లోడ్‌చేసి బోల్ట్ మూశాడు. నేను రేచులవంక చూస్తున్నాను. అది మావైపు చూస్తున్నదల్లా చటుక్కున బండదిగి రాళ్ళచాటున మాయమయింది.

"కనబడగానే షూట్ చెయ్యకండి! అవి నీటిగుంటదగ్గర నీరు త్రాగటానికి ఉపక్రమించేవరకూ ఆగండి"— అన్నాను అటువైపే పరీక్షగా చూస్తూ.

"ష్యూర్! ష్యూర్!"— అన్నాడు అసహనంగా.

మరో రెండు నిముషాల తర్వాత మాకు ఇందాక కనిపించిన చోటుకు ఓ యాభైగజాల అవతలగా మరోబండ క్రింద కనిపించాయి. అవిరెండూ మోరలెత్తి చుట్టూచూసి క్రింద దేన్నోవాసనచూస్తు న్నట్లు వంగాయి. ఆరాత్రిక్రిందేనిన్న సాయంత్రం ఓ నీటిగుంట చూశాను. అంటే అవి నీళ్ళు త్రాగుతున్నాయన్నమాట.

నేను రైఫిల్‌దించి బండారీవైపు చూశాను. అతని ముఖంవైపుచూసి ఉలిక్కిపడ్డాను. బండారీ ముఖంలో నరాలన్నీ బిగుసుకొని వున్నాయి. ఒక కన్నుమూసి మరోకంటితో టెలిస్కోపిక్ లెన్స్‌లోనుండి చూస్తున్న అతని ముఖాన్ని చూస్తుంటే నా మనస్సులో ఎందుకో తెలియని భయం కలిగింది.

మళ్ళీ రైఫిల్‌ఎత్తి రేచులకేసి చూశాను. ప్రశాంతంగా తమపని చేసుకుపోతున్నాయి. మరణం మరోక్షణంలో తమపై దూసుకువస్తున్నట్లూ వాటికి తెలియదు. నేను ఊపిరి బిగబట్టి అటే చూస్తున్నాను. ఉన్నట్లుండి అవి చటుక్కున గెంతి ఓ బండపైకి వెళ్ళాయి.

"డామిట్!"—అన్నాడు బండారీ కసిగా.

రేచులు బండలమీదనుండి దూరంగా పరిగెత్తాయి. నేను

లెన్స్‌లోనుండి వాటినే వెంబడిస్తున్నాను. బండలమీదనుండి మెరపుల్లా గెంతుతూ, వాటి చాటుకు పరిగెడుతూ అవి క్షణాలమీద మాయమయి పోయాయి.

"హియ రీజ్ ఎనెదర్ వన్! మరోటి" అన్నాడు బండారీ ఎక్సైయిట్‌మెంట్‌తో.

"ఎక్కడ?"— అన్నాను అతనివేపు చూసి.

అతని ముఖంమీద క్రూరమైన నవ్వు? కనబడుతోంది. "షటప్! ఇందాకటి చోటునే!"—

నేను రైఫుల్ ఎత్తి లెన్స్‌లోనుండి అటుకేసి చూశాను. బండలచాటునుండి ఏదో ఆకారం కదుల్తోంది, స్పష్టంగా తెలి యడంలేదు. ఆకారం బండల చాటునుండి కదలి లెన్స్ ఫ్యూలోకి వచ్చింది. ఉలిక్కిపడ్డాను నేను.

"స్టాపిట్! స్టాపిట్ మిష్టర్ బండారీ!"— అరిచాను అతనివైపు తిరిగి.

అప్పటికేఆలస్యమైపోయింది. 'థన్' మనీ పేలిన రైఫిల్ గుండు ఎడారి రాళ్ళలో ప్రతిధ్వనించింది. బండారీ ముఖంలో కనిపించే క్రూరమైన నవ్వుకు నాగుండెలు వణికాయి. చటు క్కున రైఫిల్‌ఎత్తి ఆ ఆకారం వున్నకేసి చూశాను. ఏమీ కనిపించలేదు.

"మైగాడ్! బండారీ! యుకిల్డ్ హిమ్! నువ్వతన్ని చంపావు" అరిచాను కోపంతో.

బండారీ విసుగుగా నావైపు తిరిగాడు. అతనికళ్ళు అగ్ని గోళాల్లా అనిపించాయి. ఆచూపు నేనిప్పటికి మరచిపోలేను. అది హంతకుడి చూపు.

"నో! చందన్! ఐ మస్ట్ హిమ్!"— అన్నాడు ఒక్కొక్క మాటే వత్తిపలుకుతూ.

లేదు! బండారీ గురి తప్పలేదని నామనసు ఘోషిస్తోంది. బండారీ కావాలనే అతన్ని చంపాడు.

# 4

సన్నగా గీసుకొన్న గుండు, నొసట ఎర్రని కుంకుమ బొట్టు, ఎండకు మాడిన నల్లటి ఒంటిరంగు, సగం తెరచీ తెరవనట్లున్న కనురెప్పలు, చప్పిడిముక్కు, గుండెప్రాంతంలో అరంగుళంమేర రంధ్రంలోనుండి మడుగులా కారి క్రింద రాతిమీద రక్తం అప్పుడే గడ్డకడుతోంది. ఆ ఎడారి మధ్యలో ఎక్కడినుండి వచ్చాయో, పెద్ద పెద్ద ఈగలు ఆ గుండెల మీద గాయంచుట్టూ చేరాయి. మొలచుట్టూ కాషాయవస్త్రం మాత్రం చుట్టివుంది. అతనిలో ప్రాణం లేదని చూడగానే తెలుస్తోంది.

ఎవరతను? అక్కడికెలా వచ్చాడు? ఆ ప్రశ్నలకు సమాధానం తెలియడం చాలా కష్టం. హఠాత్తుగా కాళీమాయీ నుదుట కుంకుమబొట్టు గుర్తొచ్చింది. బహుశా కాళీ మాయీ భక్తుడయివుంటాడు. మనుష్య ప్రపంచనికి దూరంగా, ఈ ఎడారిలో, కొండగుట్టపై ఒంటరిగావున్న ఈ మనిషి తనను మృత్యువింత హఠాత్తుగా కబళిస్తుందని ఊహించివుండడు.

"ఇటీజ్ యాన్ యాక్సిడెంట్!"—అన్నాడు బండారీ అతనివైపు పరీక్షగా చూస్తూ.

కాని అది యాక్సిడెంట్ కాదని, బండారీ అతను అక్కడ వున్నాడని తెలిసీ, స్పష్టంగా గుర్తించే రైఫిల్ పేల్చాడని నాకు తెలుసు. బహుశా అతని అలికిడి వినే రేచులు త్రాగడం మానేసి పరిగెత్తివుండాలి. ఆ క్షణంలో బండారీ ముఖంలో కనిపించిన క్రోధం, భావాలు నేనింకా మరచిపోలేదు.

"ఆ విషయం నిర్ణయించాల్సింది పోలీసులు! నా లెన్స్‌లో అతడు చాలా స్పష్టంగా కనబడుతోన్నాడు. మనిద్దరం ఒకే రకమైన టెలిస్కోపిక్ లెన్స్‌లోనుండి చూస్తున్నామని మరచి పోకు"— అన్నాను కోపంగా.

జరిగిన విషయం తలుచుకొంటూంటే రక్తం ఉడుకుతోందినాకు. అమూల్యమైన ఓ వేటగుర్తును ఆ సన్యాసి చెడగొట్టాడనే తాత్కాలిక క్రోధంలో బండారీ రైఫిల్ పేల్చాడు. సన్యాసి పూర్తిగా మాకు కనబడింతర్వాతే బండారీ రైఫిల్ పేల్చాడనే విషయం నాకుబాగా గుర్తు! ఇది ప్రమాద వశాత్తు జరిగిన సంఘటన కాదు! బండారీ అజాగ్రత్తవల్ల సంభవించిన మరణం. ఓ రకంగా ఇది హత్య బండారీ హంతకుడు!

"ఒ. కె. మిస్టర్ బండారీ! లెటజ్ గో!"— అన్నాను వెనక్కి తిరుగుతూ.

"చందన్!" బండారీ పిలుపులో విచిత్రమైన కఠినత్వం కనిపిస్తోంది. వెనక్కి తిరిగి అతని వైపు చూశాను.

"ఈ మనిషిని ఏం చేద్దాం?"—

"ఆ మనిషిని ఎవరూ ఏం చెయ్యరు. ఎక్కడఉన్నా వాణ్ణి అక్కడ వదిలివేయడం మంచిది. పోలీసులు వచ్చేవరకూ ఆ శవం అక్కడే వుంటుంది."— అన్నాను అతని కళ్ళలోకి సవాలుగా చూస్తూ.

బండారీ చలించకుండా నా చూపును త్రిప్పికొట్టాడు. 'పోలీసులకు ఈ విషయం రిపోర్ట్ చేయడం మంచిదంటావా?"

"ఏమో! నాకు తెలియదు! నాకు తెలిసిందల్లా హత్య జరిగినప్పుడు పోలీసులకు వెంటనే తెలియజేయాలని"—అన్నాను.

"ఇది హత్య కాదని నీకు తెలుసు. ఇది యాక్సిడెంట్ అని

నీకు తెలుసు. ఆరేచుకుక్క వెనుకాల అతను వున్నట్టు నేను గమనించలేదు. షాట్ ఫైర్ చేసినప్పుడు రేచు తప్పించుకొంది, ఆ గుండు ఇతనికి తగిలింది. ఇటీజ్ ఓన్లీ వాన్ యాక్సిడెంట్!'' బండారీ గొంతు చాలా మృదువుగా వుంది.

బంఢారీ గొప్ప అబద్ధాలకోరు అని ఆ క్షణంలో అర్థమయింది నాకు. మాకు కనిపించింది రెండు రేచులే. మూడవ రేచు అనేది బండారీ కల్పితం. దగ్గరలో మనిషి వస్తుండగా ఏ రేచూ నిలబడదు.

''ఆల్‌రైట్! యాక్సిడెంట్లను గుడా అవి జరిగిన వెంటనే పోలీసులకు తెలియజేయాలి''— అన్నాను.

''అవును! ఆ విషయం నాకు తెలుసు. ఇది యాక్సిడెంట్ అని వాళ్ళు నిర్ధారణ చెయ్యాలి. అది చెయ్యడానికి కొంత టైం పడుతుంది. ఎంక్వైరీ ఆఫీసరు సరైన వాడు కాకపోతే అనవసరమైన చిక్కులు. నేను నా లాయర్ని పిలిపించుకొని, డిఫెన్స్ ఏర్పాట్లు చేసికొని అనవసరమైన కష్టాలు పడాలి. అంతా అయితే చివరి ఫలితం ఏమిటి? అతనికి నాకు ఏ రకమైన సంబంధం లేదు కనుక సరైన డిఫెన్స్ లాయరు ఎవరైన ఇది యాక్సిడెంట్ అని ప్రూఫ్ చెయ్యగలడు.

కాబట్టి ఎందుకీ అనవసర శ్రమ. ఇతన్ని ఇక్కడే ఎక్కడో పాతిపెట్టి, ఈ సంఘటన గురించి మరచిపోదాం. నువ్వు నాకీ సహాయం ఊరికేచెయ్యొద్దు. నీకు తప్పకుండా బొంబేలోనో, అహమదాబాద్‌లోనో నాకు తెలిసి అమెరికన్ ఫరమ్స్‌లో ఉద్యోగం ఇప్పిస్తాను. ఆలోచించుకో— అన్నాడు బండారీ నా కళ్ళలోకి చూస్తూ.

''ఉద్యోగం చూసితీరాలనే పట్టింపేమీ లేదు నాకు. చిన్న చిన్న విషయాలకు కక్కుర్తిపడి మర్డర్‌కు 'అకాంప్లిస్' అవుతా

ననుకోకు''— అన్నాను దృఢంగా.

బండారీ చిన్నగా నవ్వాడు. ''పోనీ ఉద్యోగం అక్కర్లేక పోతే నీకేంకావాలో చెప్పు! డబ్బుకావాలా? పదివేలు ఇస్తాము. మీ నాన్న బిజినెస్‌ను డెవలప్ చెయ్యి''—

అప్పుడర్థమయింది నాకు. బండారీ నిజంగానే ఆ మనిషిని చూసే రైఫిల్ పేల్చాడని. వివరంగా నాకు అర్థంకాకపోయినా, ఈ విషయంలోకి పోలీసులు వస్తే తనకు తప్పకుండా శిక్ష పడే అవకాశం వుందని. అందుకనే బండారీ నాకు పదివేలు ఆశ చూపుతున్నాడు. పదివేలంటే తక్కువ మొత్తంకాదు.

నేనూ నవ్వాను. ''సారీ బండారీ! డబ్బుతో నన్ను కొనలేవు. ఈ విషయం కప్పిపుచ్చడానికి నీవు పదివేలు ఇవ్వడానికి సిద్ధపడుతున్నావంటే. నువ్వు కావాలనే అతణ్ణి చంపినట్లు అర్థమవుతుంది''—

''నో! యు ఆర్ రాంగ్ చందన్! అతన్ని చంపడం వలన నాకు ప్రయోజనం ఏమిటి? నేనెందుకు ఓ మనిషిని అనవసరంగా చంపుతాను? ఆలోచించు!''

''ఇందులో ఆలోచించడానికి ఏమీలేదు. నీ వేటకు అడ్డొచ్చాడనే తాత్కాలిక వుద్రేకంలో నువ్వుతన్ని చంపేశావు. నిజాన్ని ఒప్పుకొంటె నీకు పెద్దగా శిక్ష పడదు''—

''అయితే పోలీసుల దగ్గరకు వెళ్ళక తప్పదంటావా?''—

''తప్పదు!'' - అన్నాను పరిహాసంగా నవ్వుతూ.

''మరోసారి ఆలోచించుకో!''—

''ఆలోచించుకొనేందుకేమీ లేదు ఇందులో! నేను వెళుతున్నాను. పోలీసులు వచ్చేంత వరకూ నీవిక్కడే వుంటావంటే నాకు అభ్యంతరం లేదు,,—అన్నాను వెనక్కి తిరిగి కొండదిగడానికి సిద్ధపడుతూ.

రైఫిల్ బోల్ట్ తెరిచి తిరిగి మూసిన శబ్దం వినిపించింది. గ్రున వెనక్కి తిరిగాను. బండారీ రైఫిల్ నా గుండెలవైపు గురి పెట్టి వుంది. మా మధ్యన వున్న మూడు గజాల దూరంలో గుటీ తప్పే అవకాశంలేదు.

"సారీ చందన్! ఈ పరిస్థితుల్లో పెర్మర్ తిరిగివెళ్ళేది నేనొక్కన్నే!"-- అతని చూపులో లేడిని చంపబోయే బోయ వాడు కనిపిస్తున్నాడు.

# 5

సూర్యుడు అతివేగంగా ఆకాశంలోకి ఎగ్రబాకుతున్నాడు. ఇంకా ఎనిమిది గంటలైనా కాకముందే కాళ్ళక్రింద కొండ వేడెక్కుతోంది. చెమట వల్ల వేసుకొన్న దుస్తులు ఒంటికి అతుక్కుపోతున్నాయి. దూరంగా ఆకాశంలో బండారీ నిలబడిన వైపు ఓరాబందు చిన్నగా ఎగురుతుంది. నేను బండారీ కళ్ళ ల్లోకి చూస్తూ నిలబడిపోయాను.

"నన్ను కూడా చంపి తప్పించుకోలేవు!"— అన్నాను.

ఎందుకో చీకటిగా కనిపిస్తోన్న ఆరైఫిల్ బారెల్ వైపు చూస్తోంటేవెన్నులో నుండి వణుకుపుడుతోంది.

"చూద్దాం! ఈ ఎడారిలో నీకు దిక్కెవ్వరోచూద్దాం!"— అన్నాడు బండారీ పరిహాసంగా.

మనసులోనే శ్రద్ధగా కాళీమాయిని తలుచుకొన్నాను. "బండారీ! ఇప్పటికైనా నా మాట విను. మర్యాదగా టౌన్‌కు వచ్చి నువ్వీ విషయాన్ని గుటించి పోలీసులకు రిపోర్టుచెయ్యడం మంచిది. దాని వల్ల నిన్ను నువ్వు కోర్టులో డిఫెండ్ చేసుకోవ డానికి మంచి అవకాశం వుంది."— అన్నాను.

"సారీ చందన్! పోలీసులు ఈ విషయంలోకి వచ్చే ప్రసక్తి లేదు. ఆ పూజారిగాడితో పాటే నీవు ఈ ఎడారిలో

అంతం అయిపోతావు"— అన్నాడు బండారీ క్రూరంగానవ్వుతూ.

"నీతోపాటు నేను తిరిగి రాకపోతే మావాళ్ళు నా గురించి తెలుసు కుంటారు. మా శవాలు బయటపడినప్పుడు నీకు ఉరి తప్పదు"— అన్నాను.

బండారీ మళ్ళీ నవ్వాడు. "నేనంత తెలివి తక్కువ వాణ్ణనుకోకు చందన్! నా చేతుల్తో నేను చంపకుండానే నిన్ను మృత్యుముఖానికి పంపే మార్గం నాకు తెలుసు"—

ఎందుకో తెలియకుండానే నా ఒళ్ళు జలదరించింది. నేను అతని చేతిలో రైఫిల్ వైపు మంత్రించబడిన మనిషికి మల్లే చూస్తూవుండి పోయాను. ఆ రైఫిల్ అతని చేతుల్లో లేకుంటే ఈ సరికి ఈ ప్రాంతంనుండి పారిపోయేవాణ్ణి.

"నీ షర్టు పాంటు, బూట్లు తీసేయ్!"— అతని కళ్ళు చిత్రమైన ఆనందంతో నవ్వుతున్నాయి.

"వాట్ ది హెల్ యు మీన్..." అర్చాను కోపంగా.

"షటప్! చెప్పినట్లు చెయ్యి!"—

"నో. నో !"— అన్నాను అరుస్తున్నట్లు.

"ఆల్‌రైట్! ఎందుకో చెపుతావిను. నువ్వు నా రైఫిల్ గుండుకు చావకుండా తప్పించుకోనేందుకు నీకో చాన్సు ఇద్దామనుకొంటున్నాను. నీ ఒంటి మీద దుస్తులు, కాళ్ళకు బూట్స్, తల మీద కేప్ అన్నీ తీసేసుకొని నిన్ను పార్‌మర్ వెళ్ళి పోనిస్తాను. చాతనైతే వెళ్ళు!"—

"మైగాడ్! నువ్వు మనిషివి కాదు,మృగానివి!"— అర్చాను కోపంతో.

ఒంటి మీద నూలు పోగులేకండా, కాళ్ళకు ఇసుక వేడికి రక్షణ లేకుండా మధ్య దారిలో ఎక్కడా మంచి నీటి చుక్క లేకుండా, ఆ ఇసుక ఎడారిలో నలభై మైళ్ళు నడిచి 'పార్‌మర్'

కు వెళ్ళడం అసంభవం. మధ్య మార్గంలోనే ఎండదెబ్బకు, అల సటతో, దాహంతో నేను చావక తప్పదు.

"యస్ !చందన్! నువ్వేమీ ఆలోచిస్తున్నావో నాకు తెలుసు. ఎండ వేడికి, దాహానికి తట్టుకోలేక నీవు మధ్యలోనే మరణిస్తావు. మంచినీళ్ళుంటే ఎడారిలో బ్రతకడం తెలిసిన నీవు పార్మర్ చేరకోగలవేమో... కాని నీళ్ళులేకుండా నీవు పది మైళ్ళ కన్న ఎక్కువ వెళ్ళలేవు. ఆ తర్వాత నీ శవాన్ని ఏ రాతి గుట్టల మధ్యనో పడేసి, నువ్వు ఎడారిలో రేచుకు వెతుకుతూ వెళ్ళి తిరిగి రాలేదని, వెనక్కు తిరిగి వెళ్ళి చెపుతాను"—

"యు ఆరె ఫూల్!" ఆ పూజారి శవాన్నేంచేస్తావు. ఎండకు మాడిన నా ఒంటిని గురించి, బొబ్బలెక్కిన నా కాళ్ళను చూసి ఏదో జరిగిందనే అనుమానం జనానికీ కలగకమానదు. నేను రేచుల్ని వెతకడానికి వెళ్ళినా గుడ్డలూడ దీసుకొని వెళ్ళాల్సిన అవుసరం లేదని, దీంట్లో ఏదో మర్మం వుందని అర్థమవుతుంది...చిన్నచిన్న నేరాలు తప్పించుకోవడానికి పెద్దనేరాలు చేసి జీవితానికి ముప్పుతెచ్చుకోనేవాడిని విన్నే చూశాను. నా మాట విని ఇప్పటికైనా వెనక్కి తిరిగి వెళదాం పద"— అన్నాను ఒక అడుగు ముందుకు వేసి.

"ధన్" మని రైఫిల్ పేలింది. గుండు నా చెవిని రాచుకొంటూపోయింది. భాదగా చెవిని పట్టుకొన్నాను.

"డోన్ట్ ట్రై దట్ ఎగెయిన్! కదిలావంటే నిన్ను చంపడానికి వెనుకాడను"— అన్నాడు బండారీ మెఱుపులా రైఫిల్ రీలోడ్ చేసి నావైపుకు గురిపెడుతూ.

"యు డామ్ ఫూల్! నీకు మతిపోయింది"— అర్చాను బాధగా.

కాని బండారీ మూర్ఖుడు కాదు. అతనికి మతిపోలేదు.

నా వైపు క్రూరంగా చూస్తునిలబడ్డాడు.

"చందన్! నీవనుకొన్నంత బుద్ధిహీనుణ్ణి కాదు నేను. నిన్నేంచేయాలో ముందే నిశ్చయించుకొన్నాను. ఆ పూజారిగాడి శవాన్ని ఎక్కడో ఎవరికీ తెలియనిచోట పాతేస్తాను. తర్వాత నీ దస్తులు బూట్లు పీలికలు చేసి నీ శవం చుట్టు ప్రక్కల పారేస్తాను. 'హెల్యూసి నేషన్' గురించి నీకు తెలిసేయుంటుంది. ఎడారిలో వేడికి తట్టుకోలేక దాహంతో పరితపించే వ్యక్తులకు హెల్యూసి నేషన్ వస్తుంది. ప్రతి ఇసుక తెరా మంచినీటి సరస్సులా కనిపిస్తుంది. ఏదిక్కు చూసినా మంచి నీళ్ళు కనిపిస్తాయి. ఆ ఎండమావులు చూసి పరిగెత్తి నీళ్ళు లేవని నిరాశచెంది పిచ్చెక్కి పోతాడు మనిషి. మతిచెలిస్తూ ఆ స్థితిలో ఆ ఇసుకనే నీళ్ళనుకొని తాగడానికి ప్రయత్నిస్తాడు. లేదు! నీవీ ఎండకు వేడికి, దాహనికి తట్టుకొని మీా వూరికి చేరినా. నెల రోజుల వరకూ ఏమీా మాట్లాడే స్థితిలో వుండవు నీవు. ఆ తర్వాత మాట్లాడినా నిన్నెవరూ నమ్మరు. సో నవ్ టేకాఫ్ యు వర్ డ్రస్!"— అన్నాడు బండారీ విజయానంతంగా.

"భగవాన్"— అనుకొన్నాను మనసులోనే. బండారీ నిజంగా పిచ్చివాడు. తనకు పదేకొద్దిపాటి శిక్షను తప్పించుకోవడానికి ఎదుటిమనిషిని అతి క్రూరంగా చంపే మనిషి పిచ్చివాడు కాక మరేమవుతాడు..?

"యు ఆర్ మెడ్"— అరిచాను కోపంతో.

బండారీ పిచ్చాళ్ళ నవ్వాడు. "టే కాఫ్ యువర్ డ్రస్!"

అప్పుడుస్ఫురించింది నాకు ఈ పిచ్చివాడి చేతుల్లోంచి ఏదో ఒకరకంగా బయటపడ్డంతప్ప ఎదురు తిరిగి ప్రాణాలు పోగొట్టుకోవడం అవివేకం అని. ఎడారిలో అదృష్టం బావుంటే

ఏదైనా నీటి గుంట కనిపించవచ్చు. నా శక్తి సరిపోతే మళ్ళీ మా వూరు చేరుకోగలను. కాని వాడి చేతులో ఆ రైఫిల్ వున్నంతకాలం, ఏక్షణాన చంపుతాడో ఊహించలేక నరకయా తన పడాలి. బండారీ నా కిచ్చిన రైఫిల్ కూడా ఆ పూజా రిని పరీక్షించినప్పుడు బండారీ ప్రక్కనే వున్న రాతికి ఆనించి పెట్టాను. లాభంలేదు. వీడితో వాదనచేసి లాభంలేదు.

"ఆల్ రైట్! అన్నాను భుజాలెగరేసి.

కాళ్ళకున్న బూట్సులు, మేజోళ్ళు ఉడదీశాను. తరవాత షర్టు, పాంటు, తీసి వాటి ప్రక్కనే పెట్టాను. నా వంటి మీద బనియను, డ్రాయర్ తప్ప మరేమీలేవు.

"ఆ బనియన్ కూడా తీసేయ్!"— అన్నాడు బండారీ. అతని చూపులో ఏదో వెర్రి ఆనందం కనిపిస్తోంది.

మాట్లాడకుండా బనియను తీసేశాను. ఎండ వేడి చర్రున వీపుకు తగిలింది.

"నా! యు కెన్ గో!"— అన్నాడు బండారీ.

వెనుకకు తిరిగి నేను వెళ్ళాల్సిన దిక్కువైపు చూశాను. కనుచూపు మేర దూరం ఎత్తుపల్లాలు లేని ఎడారి, ఇసుక కని పిస్తోన్నయ్. ఆ చివర్న ఎక్కడో మా వూరు వుంది. ఈ ఎండ వేడిలో, దాహంతో నలభై మైళ్ళు ఈ ఇసుకలో నడ వాలి. నా ప్రతి అడుగు ఇక్కణ్ణుంచి చూస్తే బండారీకి కని పిస్తూనే వుంటుంది.

అప్పుడు తట్టింది నాకు. నేను సజీవంగా ఎడారి దాట గలిగినా బండారీ నన్ను దాటనివ్వడని. నేను ఎడారి దాటగలిగేలా వుంటే నిముషాల్లో నా దగ్గరికి చేరుకోగలడు, లాండ్ రోవర్‌లో. గుండెలోంచి దుఖం, భయం ఉప్పెనలా పొంగాయి.

మెల్లిగాకొండ దిగడం ప్రారంభించాను.

ఏ క్షణాన రైఫిల్ గుండు నా వీపులో దిగుతుందో అనే భయం క్షణక్షణానికి నాఒంటిని జలదరింపజేస్తుంది. ఆ ఎడారిలో వీడికి మించిన ఎడారి రేచులు వేరే లేవనిపించింది, ఆ క్షణంలో నాకు.

# 6

కొండ దిగడం మొదలు పెట్టగానే నా మొదటి ఆలోచన గబగబా ఆ లాండ్ లోవర్ చేరుకోవాలని. కొండ దిగువున తెల్లటి ఇసుకలో నీడలా కనిపిస్తోన్న ఆ జీప్‌ను చూడగానే పరిగెత్తి దాన్లో కూర్చొని స్టార్ట్ చెయ్యాలనిపించింది.

ఆ కొండ గుట్ట సగం దిగింతరవాత గుర్తొచింది నాకు, నేను లాండ్ లోవర్ స్వాధీనం చేసుకొన్నా ప్రయోజనం లేదని. బండారీ దగ్గరున్న వింబోస్టర్ చెల్ట్‌యాక్షన్ రైఫిల్, ఆ టెలిస్కోపిక్ లెన్స్ సహాయంతో నిముషాల్లో జీపును కదలకుండా చేయుగలడు. అలోగా నేను తప్పించుకొని రైఫిల్ రేంజీలో నుండి అవతలికి పోయే అవకాశంలేదు.

ఎండ వేడికి అప్పుడే ఒళ్ళంతా చెమట ధారాలు కారుతోంది. ఒంటిలో నీరు వున్నంతవరకూ రక్తప్రసరణ జరగడానికి ఎండరక్షణకు చెమట పనిచేస్తుంది. ఆ తర్వాత శరీరమంతా పేలి బీటలుపడుతుంది. నీరసం వచ్చి ఒక అడుగు కూడా ముందుకువేయలేను. మంచి నీరు లేక పోతే ఈ ఎడారిలో దాహంతో పిచ్చాడిలా పరిగెత్తి ప్రాణాలు విడవాల్సి వస్తుంది. తలుచుకొంటే ఒక క్షణం ఒళ్ళు జలదరించింది నాకు. తల త్రిప్పి వెనక్కు చూశాను.

కొండ ఏటవాలుగా వుండడంవలన, ఆ బండల వెనుక పైన ఎక్కడో వున్న బండారీ కనిపించడంలేదు. కాని ఒకసారి కొండదిగి ఎడారిలో ప్రవేశించిన తరువాత నేను వేసే

ప్రతి అడుగు అతనికి కనిపిస్తుంది. ఎందుకో ఆ క్షణంలో
నిశ్చయించుకొన్నను— నేను బండారీని ఓడించి బ్రతికి బయట
పడాలంటే ఆ అవకాశం నాకీ కొండ గుట్టల్లోనే వున్నదని
ఎంత ఎడారి జీవితానికి అలవాటు పడినా సాహసంతో నలభై
మైళ్ళు బండారీ దృష్టిలోంచి తప్పించుకొంటూ, ఈ వేడిలో
పోరాడుతూ మా వూరు చేరడం అసంభవం.

ఈ కొండ గుట్టల్లోనే వుంటే, ఈ రాళ్ళచాటున
కొండ చరియలో బండారీ రైఫిల్ గుళ్ళనుండి తప్పించుక
బయటపడే అవకాశంవుంది. ఎడారిలో కన్నా ఈ రాళ్ళ మధ్య
గుంటల్లో నాకు నీరు దొరికే అవకాశం ఎక్కువ. వీలయితే తిరి
వేటనయినా పట్టుకొని ఆహారంగా వుపయోగించవచ్చు.

ఈ కొండ గుట్టలన్నీ దాదాపు నాకు తెలుసు. ఒకప్పుడు
నేను తిరిగినవే. దాదాపు మూడుమైళ్ళ పొడవున వున్నాయి
ఆ ఎడారి మధ్యలో కొండలకు ఓ చివర అంచులో వున్నాము
మేము. రెండవ చివర, దాదాపు రెండుమైళ్ళ అవతల ఇంక
పెద్ద గుట్టలున్నాయి. ఆగుట్టలపైకి ఎక్కడానికికూడా చాల
కష్టం. ఆ ప్రాంతంలో చాలా నీటిగుంటలు కూడా వున్నాయి
అంచేతే ఆ వయిపుకు వెళ్ళాలని నిశ్చయించుకొన్నాను.

సమయం దాదాపు ఉదయం పది కావొస్తున్నది. మరో
రెండుమూడు గంటల్లో ఎడారి ఓ అగ్నిగుండంలా తయారవు
తుంది. ప్రతిబండా, ప్రతి ఇసుకరేణువు, ప్రతి అంగుళంనే
సూర్యుడి ప్రతాపానికి వేడెక్కి నిప్పులు కక్కుతాయి. కాళ్ళక
రక్షణ లేకుండా అడుగువేయడం అసంభవం. అప్పుడు గుర్తొ
చ్చింది. దూరానవున్న ఆకొండ ఎక్కాలన్నా కాళ్ళకేమీ లేకుండా
ఎక్కడం అసంభవం.

అప్పుడు గుర్తొచ్చింది నాకు. పూజారి కాళీమాయీని

ప్రాజిస్తూ ఈ కొండమీద వుంటుంటే ఈ కొండ గుట్ట మీదే ఎక్కడో అతని నివాసం వుంటుంది. కాళీమాయీ విగ్రహానికి దగ్గర్లోనే ఏ రాతిబండలమధ్యనో అతని ఆహారం, బట్టలుకూడా వుండివుంటాయి. ఎండలో ఈ ప్రాంతంలో తిరగడానికి కనీసం చెప్పులయినా వుండివుంటాయి. ఈ విషయం బండారీకి తట్టి వుండదని నాకెందుకో అనిపించింది.

దిగినదారినే పైకెళితే బండారీకి కనిపించక మానను. అసలు ఈసరికి నేనింకా క్రిందికి ఎందుకు దిగలేదా అని ఆశ్చర్య పోతూ వుంటాడు. అంచేత కొండ అవతలి ప్రక్కకు వెళ్ళి అటునుండి పైకి ఎక్కడం మంచిదని నిశ్చయిచుకొన్నాను.

గబగబ నా కుడివైపుకు వెళ్ళడం ప్రారంభించాను. అటు వైపునుండి కొండ వంపుతిరిగి అవతలి వైపుకు వెళ్ళడానికి నిశ్చ యిచుకొన్నాను. కొండ ఏటవాలుతనం ఆవైపు తక్కువుండడం వలన పైనుండి బండారీకి నేను కనిపించే అవకాశంలేదు.

కొండ అవతలివైపుకు చేరేప్పటికి దాదాపు అరగంట పట్టింది. అంతా చిత్రమైన శబ్దం ఆవరించుకొనివుంది. బండారీ ఏంచేస్తున్నాడో అంతుపట్టకుండా వుంది నాకు. చప్పుడు చెయ్యకుండా కొండదిగే 'టెక్నిక్' తెలియదతనికి. అతను కొండ దిగివుంటే అతని బూట్లకు తగిలి క్రిందకు దొర్లే రాళ్ళ చప్పుడు వినిపించేది నాకు. ఇంతసేపు ఆ శవందగ్గరే వున్నాడా? లేక నేను ఇలా వూహించి మళ్ళీ పైకే వస్తానని నాకోసం ఏదన్నా వలపన్ని వున్నాడా?

ఒక్కక్షణం పెద్ద బండచాటున ఆగి ఊపిరి పీల్చుకొ న్నాను. బండారీకి నేను కనిపించననే నమ్మకం నాకున్నది. ఇవ తలి వైపున వున్న నన్ను చూడాలంటే అతను కొండ చివరి కంటూ వచ్చి చూడాలి. అతని బూట్లశబ్దం నాకు వినిపించక

మానదు. నేనున్న బండచాటునుండి ఒకసారి జాగ్రత్తగా తొంగి చూశాను పైకి. ఎక్కడా పచ్చదనం లేకుండా విచిత్రమైన రంగులో మెరుస్తోంది కొండంతా.

జాగ్రత్తగా పైకి ఏరకంగా ఎక్కాల్సింది దారి నిర్ణయించు కొన్నాను. ఒకవేళ బండారీ పైనుండి నాకోసం చూస్తుంటే అర సెకనుకన్నా ఎక్కువ అతనికి కనిపించకుండా నేను పైకి వెళ్ళే మార్గమంతా నాకు బండలు అడ్డుగా వుండేట్లు ఎన్ను కొన్నాను. చకచకా ఒక బండచాటునుండి మరో బండచాటుకు లేడిలా గెంతసాగాను.

పదిపన్నెండు గజాల్లో పైకి చేరుకొంటాననగా ఓ బండ రాతివెనుక ఆగాను. ఎక్కడో రాళ్ళుకదిలిన చప్పుడు వినిపిస్తోంది. బండారీ నన్ను చూశాడా? నేనున్నవైపు మెల్లగా కదలి వస్తు న్నాడా? చెవులు రిక్కించి ఆ శబ్దాన్ని వినసాగాను. మళ్ళీ వినిపించలేదు. తలమీదనుండి చమట కళ్ళలోకి కారుతోంది. పెదిమలు అప్పుడే ఆరిపోతున్నట్లున్నాయి. నాలిక తడి చేసు కుందామని ఆగిపోయాను. ఆరకంగా చెయ్యడంవలన ఒంటిలో వున్న కొద్దిపాటి నీరును వృధాచెయ్యడం అవుతుంది. పెది మలు తడి చేసుకొన్న మరుక్షణం ఈ వేడికి అవి ఆరిపోతూ వుంటాయి. అంచేత పెదిమలు తడి చేసుకోవడంవలన ప్రయో జనం లేదు. శరీరంలోవున్న ప్రతి నీటి బొట్టూ దాచుకోవాలి.

అలసటగా బండను ఆనుకొన్నాను. వీపు చుర్రుమంది. మధ్యాహ్నమయ్యేప్పటికి ఈ కొండమీద చెప్పులు లేకుండా నిల బడడం కష్టమే. అప్పుడు విన్నాను ఆ శబ్దం మోటారు ఇంజను శబ్దం. అంటే బండారీ కిందకుదిగి వెళ్ళాడన్నమాట. నేను ఇందాకవిన్న రాళ్ళచప్పుడు బండారీ క్రిందకు దిగుతున్నప్పుడు అయిన శబ్దం అయివుండాలి.

ఒక్కసారి ఆనందంతో గెంతులు వేయాలనిపించింది. బండారీ ఇది నువ్వుచేసిన మొదటి పొరపాటు అనుకొన్నాను మనస్సులో. ఎంత పవర్ ఫుల్ రైఫిల్ చేతిలోవున్నా ఏటవాలు గావున్న కొండమీద వున్న శత్రువును పట్టుకోవడం సులభం కాదు. అతనికి క్రిందవుండే నన్ను చంపడానికి ప్రయత్నిం చాలికాని, పైకివచ్చే ప్రయత్నం చేయలేడు బండారీ. అంత బుద్ధిహీనుడు కాడు బండారీ. అతను పైకివచ్చే మార్గంలో ఏ రాతిని దొర్లించినా అతనా ప్రమాధంనుండి తప్పుకోవడం చాలా కష్టం. అదృష్టం ఇంకా నాపక్షాన్నే వుందనిపించింది.

గబగబా కొండ పైభాగాన్ని ఎక్కేశాను. ఓ బండచాటు నుండి కొండ అవతలి వైపుకు తొంగిచూశాను. బండారీ జీపుని కొండదగ్గర్నుండి ఓ పర్లాంగు వెనక్కి తీసుకొని పోయాడు. అక్కడ జీపు ఆపి, ముందుసీట్లో కూర్చొని బైనాక్యులర్స్‌తో కొండని పరీక్షగా చూస్తున్నాడు. నాలోనేను నవ్వుకొన్నాను.

మెల్లిగా బండలచాటునుండి పూజారీ శవంవున్న ప్రాంతం వైపు నడిచాను. ఒక్కక్షణం నాకళ్ళను నేను నమ్మలేకపోయా ను. కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. పుజారి శవం మాయమ యింది. దానికికాదు నా బాధ. అప్రక్కనేవున్న నీటిగుంటల్లో నీళ్ళన్నీ బయటికి తోడివేయబడినాయి. గుంటల చుట్టూ వున్న రాళ్ళమీద ఇంకా తడి కనిపిస్తోంది. గుంటల అడుగున ఒక్కచుక్క నీరుకూడా లేదు.

"మై గాడ్ బండారీ యుఆర్ఎ బాస్టర్డ్!" కసిగా తిట్టు కున్నాను. ఆ చుట్టుప్రక్కలవున్న నాలుగు గుంటల పరిస్థితి అలాగేవుంది. నేను మళ్ళీ ఎలాగో పైకి వచ్చినా నాకు నీళ్ళు దొరక్కుండా చెయ్యాలని ఈ పని చేశాడు బండారీ. ఆ పని

వల్ల నేనేకాదు ఆ గుంటలమీద ఆధారపడివున్న కొన్ని జంతు వులుకూడా నీళ్ళులేక చస్తాయి. ఒక్కక్షణం నిరాశ ఆవరిం చింది నాకు.

మెల్లిగా ఆ చుట్టుప్రక్కల గాలించసాగాను, పూజారీ నివాసంకోసం. మధ్యమధ్య రాళ్ళచాటునుండి బండారీ ఎటు వున్నాడో చూస్తూవున్నాను. ఒకసారి బండారీ లంచ్‌పాక్‌లో నుండి ఏదో తినడం కనిపించింది. చటుక్కున ఆకలి గుర్తొ చ్చిందినాకు. ఈ ఎండకుతోడు ఆహారం లేకపోతే రేప్రొద్దు నకు లేవడం కష్టం నేను.

దాదాపు గంటసేపు వెతికింతరువాత కనిపించిందది. నాలుగు పెద్ద బండరాళ్ళు ఒకదానిమీద ఒకటి పడి ఏర్పడిన చిన్న గుహలాంటిది. బయటికి చిన్న సందులాంటిది మాత్రం కనిపిస్తోంది. అంతే. లోపల మనిషివుండే అవకాశం వుందని తెలియడంలేదు. ఏందుకో దాన్ని కనుక్కొన్నాననే ఆనందం కలుగలేదు నాకు. నీరసంగా ఆ సందులోంచి ఆ రాళ్ళ మధ్యకు వెళ్ళాను.

## 7

పెద్దపెద్ద బండరాళ్ళు ఒకదానిమీద ఒకటిపడి ఏర్పడిన గుహ అది. లోపలచాలా పొడిగా వెచ్చగాఉంది. ఆరడుగుల పొడవు, నాలుగడుగుల వెడల్పు సమానంగా వుంటుంది. బయటి నుండి నేనువచ్చిన సందులోనుండితప్ప వెలుగు రాకపోవడంవలన చీకటిగావుంది. ఒక్కక్షణం అలానే నిలబడి ఆ వెలుగుకు నా కళ్ళు అలవాటు పడేవరకూ వున్నాను.

చెప్పుకోదగిన వస్తువులేమీ లేవు లోపల. నేలమీద ఓప్రక్కగా చిరిగిపోయిన ఖర్జూరు ఆకులతో నేసినచాప వుంది. ఒక మనిషి పడుకోవడానికికూడా సరిగాచాలదు. ఓమూల నలు

చదరంగావున్న బండమీద రెండు మట్టిపాత్రలున్నాయి. చాప మీద ఓ ప్రక్క మరో తుండుగుడ్డలాంటి మాసినబట్ట పడి ఉంది. బండ ప్రక్కనే చిన్న సూట్‌కేసులాంటి చెక్కపెట్టె వుంది.

రెండుమట్టిపాత్రలనూ పరీక్షగా చూశాను. చిన్నదానిలో సగానికి ఏదో తెల్లటి పదార్థం వుంది. చెయ్యిపెట్టి పైకితీసాను. చిన్నచిన్న రాళ్ళగడ్డల్లా ఉన్నాయి. నోటిలో పెట్టుకొని చూసాను. ఉప్పగాఉంది. రాతిఉప్పు! రెండవదాంట్లో ఏదో రొట్టెలులాంటి వున్నాయి. అన్నీ బయటకుతీసి చూశాను. ముదురాకుపచ్చ రంగులో దాదాపునల్లగా చిన్నసైజు పూరీల్లా వున్నాయి.

ముక్కు దగ్గరపెట్టి వాసనచూశాను. ఏదోచిత్రమైన వాసనవేస్తోంది. చిన్నముక్కత్రుంచి నోట్లోవేసుకొని చప్పరించాను. వగరుగావుంది. పంట్రకిందనములాలని ప్రయత్నించాను. తేలిగ్గా నలిగేలా అనిపించలేదు. దాదాపు పది రొట్టెలున్నాయి. భద్రంగావాటిని మళ్ళీకుండలో పెట్టేశాను.

ఆరాతిఉప్పుతప్ప నాకుపనికొచ్చేవి ఏమీలేవు అందులో. మెల్లిగా చెక్కపెట్టె దగ్గరకులాగి పరీక్షగాచూశాను. మంగలి పెట్టెకన్నా చిన్నగాఉంది. మూత తెరిచాను. లోపలఉన్న వస్తువులుచూసి ఆశ్చర్యపోయాను!

తాతలకాలంనాటి ఆయిదంగుళాలు పొడవున్న చిన్న కత్తి ఉందిలోపల. దాంతోపాటు చిన్న కుంకుమభరిణ, నల్లపూసల దండ, అణాఎత్తు కర్పూరం ముద్ద, ఎండిపోయిననిమ్మకాయ ఒకటివున్నాయి. వాటితోపాటువున్న మరో వస్తువు నాకు చాలా ఆనందం కలిగించింది.

కాటబాల్! పంగలకర్ర అంటారు! చిన్నప్పుడు పక్షులను కొట్టడానికి ఉపయోగించేవాణ్ణి. ‘V’ ఆకారంలోవున్న చిన్న

ఇనుప తీగెకు రెండుచివర్లన ఒక సన్న రబ్బరుగొట్టం రెండు చివర్ల్ని బిగించివున్నాయి. ఆ రబ్బరుగొట్టంకి సరిగ్గా మధ్య లో చిన్న తోలుముక్క కుట్టివుంది. ఆ తోలుముక్కలో చిన్నచిన్న గులకరాళ్ళుపెట్టి, ఒక చేత్తో ఆ ఇనుపతీగెను పట్టుకొని, రెండవచేత్తో రబ్బరు గొట్టాన్ని సాగదీసి వదిలి పెడితే గులకరాయి బుల్లెట్‌లా తగుల్తుంది, మనం గురిచూచిన వస్తువుని. చిన్నచిన్న పిట్టల్ని వేటాడడానికి బాగా ఉపయోగ పడుతుంది.

బహుశా ఆ పూజారి దీని సాయంతో ఇక్కడ ఎగిరే చిన్న చిన్నపిట్టల్ని వేటాడి ఆహారం సంపాదించుకొనేవాడనుకొంటాను. గుహలో అక్కడక్కడవున్న పక్షుల ఈకలు నా అనుమానాన్ని ధృవపరిచాయి. ఆఖరికి బండారీని ఎదిరించడానికి ఏదో ఒక రక మైన రెండు ఆయుధాలన్నా లభించాయి!

కాట్ బాల్‌ని మెడకు తగిలించుకొని, కత్తిని డ్రాయరు లో దోపుకొన్నాను. తినడానికి గుహలో ఏమీ లేకపోవడం విచా రం కలిగించిందినాకు. కాని, ఏరకమైన పిట్టలు దొరక నప్పుడు ఈ పూజారి ఏంతినేవాడో? ఆ రొట్టెలు తినేవాడా?

తినడానికి పనికొచ్చే రొట్టెల్లా లేవవి. తినడానికి కాక మరి దేనికవి? చెడిపోకుండా అందులో ఏదైనా కలపడం వలన ఆ రుచి వచ్చిందా వాటికి? హఠాత్తుగా తట్టిందినాకుఅప్పుడు. అవును అదే అయివుండాలి. ఇందాక నేను రుచిచూడ్డానికి నోట్లో వేసుకొన్న ఆ రొట్టెముక్కను నాకు తెలియకుండానే ఇంకా చప్పరిస్తూ వున్నాను. అప్పటినుండి ఎందుకో తెలియ కుండానే నాకు నీరసం తగ్గి, క్రొత్త ఉత్సాహం వచ్చినట్లు గమనించాను. అది ఆ రొట్టె ప్రభావమే అయివుండాలి.

చిన్నప్పుడు ఎప్పుడో 'మిన్నారోటీ' గురించి విన్నాను

కాని, దాన్నెప్పుడూ కళ్ళతో చూడ్డంగానీ, రుచిచూడ్డంగానీ జరగలేదు. ఇదివరలో దూర ప్రయాణాలు ఎడారిలో చేసే యాత్రికులూ వర్తకులూ, ఎప్పుడూ తమదగ్గర ఈ 'మిన్నా రోటీ' వుంచుకొనేవాళ్ళట. బియ్యపుపిండి, గంజాయిమొక్క ఆకులూ కలిపి తయారు చేస్తారు. ఆకలి తగ్గించడానికి, శరీరంలో వుండే నిల్వశక్తిని బయటకు తేవడానికి ఈ రొట్టెను చిన్న చిన్న ముక్కలుగా చేసి చప్పరిస్తారు. ఆహారం కొరత ఏర్పడినప్పుడు దీని సహాయంతో చాలాకాలం ప్రాణాలను దక్కించుకొనేవాళ్ళట. బహుశా ఈ పూజారికూడా ఈ ఎడారిలో తిండి లేనప్పుడు ఈ రొట్టె చప్పరించి ప్రాణాలను నిలబెట్టుకొనేవాడనుకొంటాను. మనసులోనే కాళీమయికి కృతజ్ఞతలు చెప్పుకొన్నాను.

వీటి సహాయంతో నేను జాగ్రత్తగా సంచరిస్తూ, కాస్త నీరుదొరికే ప్రదేశాన్ని కనుక్కో గలిగితే బండారీనుండి తప్పించుకొని ప్రాణాల్తో బయటపడగలననే నమ్మకం ఏర్పడింది. చావ మీదవున్న ఆ మురికి తుండుగుడ్డలో ఆ రాతి వుప్పును, రొట్టెల్నీ మూటగట్టాను.

బండారీ ఏంచేస్తున్నాడో చూద్దామని మళ్ళా బయటకు వచ్చాను. ఎండకు రాళ్ళు వేడెక్కి అరికాళ్ళు మండుతున్నాయి. బండల చాటునుండి లాండ్‌లోవర్ వున్నవైపుకు చూశాను. బండారీ ఫ్రంట్ సీట్లో కూర్చొని సిగరెట్ పీలుస్తూ కొండ వైపు చూస్తున్నాడు. బహుశా నన్ను ఈ కొండరాళ్ళ చాటునుండి బయటకు ఏలా రప్పించాలా అని ఆలోచిస్తున్నాడనుకొంటాను.

ప్రస్తుతానికి బండారీనుండి నాకు ప్రమాదం లేదని నిశ్చయించుకొన్నాను. ఈ కొండమీద నేను వున్నంతసేపూ, నాకు

కాళ్ళు చేతుల్లో శక్తి వున్నంతవరకూ బండారీ నాదగ్గరకు రాలేడు. అతని రైఫిల్ గుళ్ళ బారీనుండి తప్పించుకోవడానికి నాకీ కొండరాళ్ళ అండ చాలు. కానీ నేనీ కొండపైన ఎక్కువ కాలం నీళ్ళులేకుండా వుండిపోతే రెండ్రోజుల తరవాతైనా దాహం వలన నాశక్తి క్షీణించక తప్పదు.

రాతివుప్పు వున్నా ఒంటిలోవున్న నీటిని బాగా వుపయోగించుకోవడానికి తప్ప ఎక్కువ దాహాన్ని తీర్చడానికి పనిచేయదు. ఆకలి సమస్య లేకపోయినా, నీటి సమస్యవల్ల నా ప్రాణానికి ముప్పు తప్పదు. త్వరగా నీరుదొరికే మరో ప్రదేశానికి నేను చేరుకోకపోతే ఈ బండారీ భూతానికి ఎదురొడ్డి నిలబడ్డం అసంభవం.

నేనున్న కొండకి ఎడమవైపున చివరగావున్న కొండ పై భాగాన పెద్ద నీటిగుంటలు వుంటాయని విన్నాను. కాని దాని పైకి నేనెప్పుడూ వెళ్ళలేదు. ఈ మధ్యలోవుండే కొండల్లో అక్కడక్కడా నీళ్ళు దొరికినా, బండారీ రైఫిల్ గుళ్ళను తప్పించుకొనేందుకు వీలైన పెద్దపెద్ద బండలు మాత్రంలేవు.

దూరంగా ఆ కొండకు దగ్గరగా ఎగురుతోన్న రెండు రాబంధువులు నేను విన్నవిషయాన్ని నిజమనిపించాయి. ఆ రాబంధువులు ఎగిరే ప్రదేశానికి దగ్గర్లోనే ఎక్కడో నీరువుంటుందన్నమాట. ఏలాగైనా ఆ కొండపైకి చేరుకోగలిగితే ప్రస్తుతానికి ప్రమాదం తప్పినట్లే. ఇలా మరో వారంరోజులు బండారీ బారీనుండి తప్పుకోగలిగితే ఆతర్వాత మావాళ్ళు తప్పకుండా మా ఇద్దర్నీ వెతుక్కొంటూ ఈ ప్రాంతాలకు వస్తారు.

కాని చీకటి పడేవరకూ నేను అటు వెళ్లే ప్రయత్నం చేయగూడదు. రాత్రిపూట చీకటి చాటున ఈ కొండలు దాటే ప్రయత్నం చేయాలని నిశ్చయించుకొన్నాను.

ఏందుకో ఒక్కక్షణం వెన్ను వణికినట్లనిపించింది. బండారీ నావైపే చూస్తున్నాడనే ఆలోచన చటుక్కున నాకు స్ఫురించింది. అసంకల్పితంగా దగ్గర్లోవున్న బండరాయి వెనక్కి చటుక్కున నక్కాను.

సుయ్ మని నా వెనక బండరాతికి ఏదో కొట్టుకొన్న చప్పుడూ, దానివెనకనే ఢాం! మనే శబ్దం వినిపించాయి. రైఫిల్ పేల్చిన చప్పుడు. పేల్చిన ధ్వనికన్నా బుల్లెట్ త్వరగా గమ్యాన్ని చేరుకొంటుంది. నా ఆలోచనలోపడి బండారీని గమనించడం మరిచిపోయాను నేను. ఒక్కక్షణం ఆలస్యం అయి వుంటే బుల్లెట్ నా తలలోంచి దూసుకుపోయి వుండేది.

# 8

చీకటి పడేవరకూ ఆ బండలవెనుక బండారీని జాగ్రత్తగా గమనిస్తూ వుండిపోయాను. సాయంత్రం ఆరయేప్పటికల్లా బండారీ లాండ్ లోవర్ని ఇంకాస్త వెనక్కి తీసుకెళ్ళి ఆపాడు.

మెల్లిగా జీప్లోనుండీ కాంపింగ్ ఎక్విప్మెంట్ అంతా అన్లోడ్ చేసి చిన్న టెంట్ వేశాడు. టెంట్ ముందు చిన్న గొయ్యి తీసి అక్కడ మంట వెలిగించాడు. మంట మీద టీకెటిల్ పెట్టి టీ కాచడం మొదలుపెట్టాడు.

టీ కెటిల్ చూసి ఒక్కసారి మెల్లగా పెదిమలు తడుపుకొన్నాను. పెదిమలు ఎండిపోయి బాగా పొడిగా తగిలాయి నాలికకు. బాగాదాహంగా వుంది. తలంతా బరువుగా ఎవరో లోపల సుత్తులతో బాదుతున్నట్లు వుంది. పొద్దున్న బ్రెక్ఫాస్ట్లో త్రాగిన నీరు, టీ తప్ప ఆ తర్వాత మళ్ళీ ద్రవ పదార్థం అనేది ముట్టలేదు.

మామూలుగా మనిషి నీరు లేకుండా ఇరవైనాలుగు గంటలకన్నా ఎక్కువ వుండలేడు అంటారు. ఈ ఎడారి వేడిలో

మహా అయితే పద్దెనిమిది గంటలు వుండగలడేమో. ఆ తర్వాత దాహానికి పిడచకట్టుకుపోయి, పెదిమలకు నాలుకకు పై పొరలు రావడం తప్పదు. కళ్ళు విపరీతంగా మండు తొన్నాయి. ఎందుకో తెలియకుండానే ఏడుపొచ్చింది నాకు. కళ్ళవమ్మట నీళ్ళురాకపోయినా, దుఃఖం లోపలినుండి పొంగి వచ్చి ఒక నిముషం పాటు శరీరాన్ని వణికించింది.

కళ్ళముందే బండారీ టీ త్రాగుతూ, రాత్రి భోజనం తయారుచేసుకొంటుంటే నా నిస్సహాయత మీద నాకే జాలే సింది. ఇంకా కనీసం నాలుగు గంటలు ఆగితేకాని పూర్తిగా చీకటిపడదు. అమావాస్య వెళ్ళి ఇం కా రెండ్రోజులే కావడం నిజంగా నా అదృష్టం. లేకపోతే చెట్లుచేమలు లేని ఈ కొండల మీద చంద్రుడి వెలుగు ప్రతిఫలించి ప్రతీ వస్తువూ చాలా స్పష్టంగా కనిపిస్తుంది. నేను రాత్రుళ్ళు కదలడానికి కూడా వీలుండేది కాదు.

చీకటిపడింది, కాంప్ఫైర్ వెలుగులోనూ, టెంట్‌లోపలి గాస్‌లైట్ కాంతిలోనూ బండారీ అటూ ఇటూ తిరగడం స్పష్టంగా కనిపిస్తోంది. ఏ పని చేస్తున్నా రైఫిల్ మాత్రం అతని చేతులోనే ఎప్పుడూ వుండడం గమనించాను నేను. దాదాపు పది గంటల ప్రాంతంలో బండారీ టెంట్‌లో పెట్రో మాక్స్ లైట్ ఆరిపోయింది.

రోజంతా ఈ ఎడారి ఎండలో వుండడం వలన, ఎండ వేడికి మనుషులు చాలా త్వరగా అలిసిపోతారు. అంచేత బండారీ కూడా త్వరగా నిద్రపోతాడని నాకు తెలుసు. రాత్రిళ్ళుఅతన్ని తప్పించుకొని నేను పారిపోతాననే భయం అతనికి లేదు. తెల్లవారేలోపు పద్దెనిమిది గంటల్లోనూ నేను మహా వెళ్ళ గలితే ఓ పదిమైళ్ళు వెళ్ళగలనేమో ఈ స్థితిలో. రోజంతా ఈ

కొండగుట్ట మీదే ఆహారం, నీరు లేకుండా వున్న నేను అంతకంటే ఎక్కువ వెళ్ళలేనని బండారీకి తెలుసు.

అదీకాక ప్రొద్దునే లేచి కొండ చుట్టు ఓసారి తిరిగితే సన్నని గాలికూడా వీయని ఈ సెప్టెంబర్ రోజుల్లో నా అడుగు జాడలు చాలా స్పష్టంగా ఇసుకలో కనిపించక మానవు. ఒక్కసారి కొండగుట్టెక్కి నా అడుగుజాడలు వెళ్ళినవైపు చూస్తే నేను తప్పకుండా బండారీకి కనిపించి తీర్తాను. ఆ తర్వాత అతను నన్ను చేరుకోవడం నిముషాలమీద పని.

ఒక వేళ అతను నన్ను వెంబడించకపోయినా, మర్నాటి ఎండ నన్ను ఎడారి దాటనివ్వదనే విషయం చాలా స్పష్టం. అంచేతా నేను ఎడారిలో నడిచే ప్రయత్నం చెయ్యనని. ఈ కొండలోనే నాకు బ్రతకడానికి ఎక్కువ అవకాశం వుందని బండారీ ఊహించలేని మూర్ఖుడు కాడు. అంచేత బండారీ సుఖంగా నిద్రపోతాడని నాకు తెలుసు.

బండారీ లైటు ఆర్పేసిన తరువాత ఓ అరగంట వరకూ టెంట్‌వైపే కళ్ళు చిట్లించుకొని చూస్తూ వుండిపోయాను. ఎడారిలో తిరగడం అలవాటులేని బండారీ రాత్రి పూట ఈ కొండ ఎక్కే ప్రయత్నంచెయ్యడని తెలుసు. అయినా నా జాగ్రత్తలో నేను వుండడం మంచిది.

చీకట్లో ఏమీ కనిపించడంలేదు. ఆకాశంలో నక్షత్రాల వెలుగు తప్ప మరో వెలుగు లేదు. ఒక్కసారి కొండ దిగి వెళ్ళి నిద్రపోతున్న బండారీ మీద పడి దాడిచేయాలనే పిచ్చి ఆవేశం వచ్చింది, ఒక్కక్షణం. కాని అది జరిగే పని కాదని తెలుసు. బండారీ పొరపాటున మేలుకొని నా కోసం కాచుకొని వున్నా, నేను వస్తున్న శబ్దం విన్నా. మరుక్షణం నేనీలోకానికి గుడ్‌బై చెప్పేయాల్సి వస్తుందనే విషయం నేను మరిచిపోలేదు.

మెల్లిగా కొండ అవతలివైపుకు ఎడారిలోకి దిగడం ప్రారంభించాను. చప్పుడు చెయ్యకుండా క్రిందికి దిగింతరువాత కాసేపు నీరసంగా అలాగే ఇసుకలో కూలబడ్డాను. కొండమీద బండలవెనుక కూర్చోని వున్నపుడు తెలియలేదు కాని, కొండ దిగేప్పుడు కాళ్ళకు బాగా పని కల్పించేప్పటికి తెలిసింది నాలో శక్తి ఎంత తగ్గిపోయిందో.

కాళ్ళకండరాలు ఎవరో బిగించి పట్టుకొన్నట్లు, ప్రతి అడుక్కీ ముడుచుకు పోతున్నట్లు అనిపించి విపరీతంగా బాధ పెడుతున్నాయి. దానికితోడు దాహం, రాతిఉప్పు నోట్లో వేసుకొన్నా, ఒంట్లో నీరు చాలా తక్కువగా వుండడంవలన లాలాజలం ఏ మాత్రం రావడంలేదు. పైగా ప్రొద్దుననుండి అప్పుడప్పుడూ చప్పరిస్తున్నానేమో, నాలుక అంతా అక్కడక్కడా తెగి నోరంతా ఉప్పుగావుంది.

నోట్లో 'పిప్పరోట్' చప్పరిస్తూ, మనసులో భగవంతుణ్ణి ప్రార్థిస్తూ బయలుదేరాను. ఈ మధ్యలో వుండేకొండలో ఎక్కడయినా నీరువుంటే వుండొచ్చుగాని, ఆ నీటి గుంటల్ని వెతికి పట్టుకొనే సత్తువలేదు నాకు. పైగా ఆలోగా తెల్లవారిపోతే బండారీ రైఫిల్ గుళ్ళు తప్పించుకొనే అవకాశం లేదు నాకు.

ఓ పదినిముషాలు అలా కూర్చోన్న తరువాత మెల్లిగా లేచి నిలబడ్డాను. తర్వాత ఆ చీకట్లోనే దారిచూసుకొంటూ ఆ చివరవున్న కొండకేసి బయల్దేరాను. అలా ఎంతసేపు ఆ కొండలను అంటిపెట్టి నడిచానో నాకే తెలియదు. నడుస్తూ వుంటే వేసే ప్రతి అడుగుకూ దూరం మరింత పెరుగుతోన్నట్లు అనిపిస్తోంది. ఈ బాధల చివర్న ఎక్కడో ఈ దాహంతీరే అమృతం లభిస్తుందనే ఆశ నన్నంత సేపు నడి

పించింది.

బహుశా ఆరేడు గంటలు అలానే నడిచాను, మధ్య మధ్య ఓ అయిదు, పది నిముషాలు విశ్రాంతి తీసుకొంటూ. విశ్రాంతి కోసం ఆగిన ప్రతిసారీ ఇక కదలలేననిపించేది. తిరిగి అడుగులు వెయ్యడానికి బ్రహ్మ ప్రయత్నం చెయ్యాల్సివచ్చేది. దానికి తోడు దాహం. భరించలేని దాహం. పెదిములుపగిలి మంట పుట్టడం ప్రారంభించాయి. నాలికతో తడుపు కొందామన్నా, నాలుక కదిపితే భరించలేని నొప్పిపుట్టింది. మిన్నరోటి చప్పరించడానికి కూడా శక్తి చాలాక చిన్న చిన్న ముక్కలుగా చేసి ఓ రొట్టె మింగాను. గొంతులో కూడా తడి లేకపోవడం వలన బలవంతంగా మింగాల్సి వచ్చింది.

ఈ పరిస్థితిలో రాత్రి ఎడారి దాటాలని నేను ప్రయత్నించివుంటే నిజంగా వృథాప్రయత్నం అయుండేది. ఈ మూడు నాలుగు మైళ్ళపొడవున్న కొండతీరం నడవడానికే నాకు ఆరు గంటలపైన బడితే, ఎడారిలో మరో రెండు మైళ్ళ కన్న ఎక్కువ నడవగలిగే వాణ్ణికాదేమో.

నేను ఎక్కవలసిన కొండను చూడగానే ఒక్కక్షణం మనసు నిరాశ ఆవరించుకొంది. దూరంనుండి చూసినంత తేలిగ్గా కనిపించలేదు, ఆ కొండ ఎక్కడం. క్రింది నుండి దాదాపు ఇరవై అడుగుల ఎత్తువరకూ ఎవరో పని గట్టుకొని పదునుచేసినట్లు, ఎక్కడా చేతికిగాని, కాలుకుగాని పట్టు దొరకడానికి వీల్లేకుండా నున్నగా వుంది. పైగా పెద్ద ఏటవాలు తనంలేకుండా దాదాపు తిన్నగా వున్నట్లు మొదట్లో కొండని స్తంభంలా వుంది. ఇంత దూరం నడిచిరావడం వృథా అనిపించింది.

మెల్లిగా కొండచుట్టూ ప్రదక్షిణ మొదలెట్టాను. ఎక్క

డైనా పైకి ఏక్కడానికి పట్టు దొరుకుతుందేమో చూద్దామని. ఆ క్షణంలోనే మరో విషయం స్ఫురించింది. నాకు ఏలాఅయినా ఈ కొండపైకి ఎక్కగలిగితే, బండారీ నన్నువెంటాడి పైకి వచ్చే అవకాశంలేదని. ఈ ఆలోచన మరింత బలాన్నిచ్చిందినాకు. కొండలో ఎక్కడైనా చిన్నపగులు, కొద్ది ఎగుడు దిగుడు కని పిస్తే దాని సహాయంతో పైకి వెళ్ళాలని అతి జాగ్రతగా వెతక సాగాను. కాని ఎక్కడా ఏమి సందు కనిపించలేదు.

తూర్పున వెలుగు రేకలు కనిపించడం మొదలుపెట్టాయి. నాగుండె మరింత వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టింది. మరి కాసేపట్లో నేను ఏదోవిధంగా పైకి చేరుకోకపోతే చావు తప్పదు. నావెనక ఎవరో రొప్పుతూ పరిగెడుతున్న చప్పుడయింది. ఒక్క క్షణం గుండెలు ఆగి కొట్టుకోవడం మొదలుపెట్టాయి. బండారీ వచ్చేశాడా?

నిస్పృహగా వెనక్కి తిరిగాను. మరుక్షణం ఆనందంతో అరవాలనిపించింది. ఎడారి రేచు ఒకటి దూరంగా ఆగి నావైపే తీక్షణంగా చూస్తోంది. నేను ఊపిరి బిగబట్టి దానివైపే చూడసాగాను.

రేచు ఈ ప్రాంతంలో, ఈసమయంలో తిరుగుతుం దంటే, ఇక్కడే ఎక్కడో నీరు దొరికే ప్రదేశం వుందన్నమాట. ఈ రేచు ఎటు వెళ్తుందో గమనిస్తే, దానివెనకే నేనూ వెళ్ళ వచ్చు ఆ నీటిదగ్గరకు. రేచు అలాగే నావైపు కాసేపు చూసి చెంగున గెంతి కొండ వంపువైపు పరిగెత్తింది.

నేనూ శరీరంలోని శక్తినంతా కూడగట్టుకొని దాని వెనకే పరిగెతాను. ఒక్కసారి తూలి క్రిందపడ్డాను. మెల్లిగా లేచి కొండ వంపువైపు నడిచాను. రేచు కనుపించలేదు. జాగ్ర త్తగా ఇసుకలో దాని కాలి గుర్తులవైపు చూస్తూ వెళ్ళసాగాను.

ఆ అడుగుజాడలు కొండ వంపుతిరిగి కొండవతలివైపు దారి తీశాయి.

ఎక్కడో గుర్రుమన్న విచిత్రమైన శబ్దం వినిపించింది కొండపైనుండి. రేచు అరుపు అదని తెలుసునాకు. తలెత్తి అటువైపు చూశాను. పైన కొండ అంచునుండి నావైపు తొంగి చూసి మళ్ళీ మాయమయింది. చెప్పలేని ఉత్సాహం వచ్చింది నాకు. అంటే ఈ ప్రాంతాల్లోనే పైకి ఎక్కడానికి అనువైన చోటు ఎక్కడో వుందన్నమాట.

మెల్లిగా రేచు కాలిగుర్తులను అనుసరిస్తూ ముందుకు వెళ్ళాను. చీకట్లో వెతకటం వలన నేను గమనించలేక పోయి వుండాలి. కొండకి ఓ ప్రక్క పెద్ద రాతిపగులు భూమినుండి దాదాపు ఐదడుగుల పైనుండి వుంది. రేచు అడుగులు అక్కడ వరకు వచ్చి ఆగిపోయాయి. అంటే అది ఇక్కడనుండే పైకి ఎక్కివుండాలి. రొట్టెల మూటను వీపుకు కట్టాను.

మెల్లిగా ఆ పగులుమధ్య చేతులు ఇరికించి పట్టుకొని పైకి లేవడానికి ప్రయత్నించాను. రెండు చేతులు దాంట్లో పట్టించడం కష్టం. పైకి వెళ్ళేకొలదీ వెడల్పుగా వుంది. కొది గా ఎగిరి రెండుచేతుల్తో పగులువున్న రాతిని గట్టిగా పట్టుకు న్నాను. ఆ తర్వాత రెండు కాళ్ళనూ కొండకు తన్నిపట్టి ఒక చేతి పట్టును వదిలి ఇదివరకటి చోటుకు కాస్త పైన పట్టు కొన్నాను. మళ్ళీ అతి కష్టంమీద. ఒకచేతిమీద బరువంత వేళ్ళాడేట్టువుంచి, గోడకు కాళ్ళుతన్నిపట్టివుంచి, రెండవ-చేతిని పైకి జరిపి పట్టుకొన్నాను.

ఏక్షణాన శక్తి పోతుందా, ఏచేతి పట్టును వదిలేస్తానో అని ప్రతిక్షణం గుండె దడదడ లాడుతూనేవుంది. అలా మెల్లి మెల్లిగా పైకి జరుగుతూ మెల్లిగా ఒక పాదాన్ని ఆ సందులో

ఇరికించాను. అప్పుడు తట్టిందినాకు. ఆ రేచు ఎంత కొండల్లో తిరగటం అలవాటు పడినా ఇంతఎత్తు ఇలా ఎక్కడానికి అవకాశం లేదని. రేచు దాదాపు ఆరేడు అడుగుల ఎత్తు ఎగరగలదు. కాని మనిషిలా గోడలు పట్టుకు వ్రేలాడుతూ పైకి ఎక్కలేదు. అంటే ఇంతకన్న సులువుగా అది పైకి వెళ్ళగల మార్గం వుండే వుండాలి. కాని దాదాపు ఏడడుగులు పైకి వచ్చింతర్వాత మళ్ళీ క్రిందికిదిగి వెళ్ళే ఓపిక, శక్తి వుందనిపించలేదు నాకు.

రెండుకాళ్ళూ ఆ సందులో ఇరికించి, పిల్లిలా ఆ కొండ గోడకు అత్తుకొని వున్నాను. రెండుకాళ్ళమీద బరువు ఆనించడంవల్ల కాస్త చేతులకు శ్రమ తగ్గంది. ఒక చేతిని పట్టు నుండి తీసేసి సందులో చేయి పెట్టి వెతికాను. కొండగోడ లోపలి అంచు తగిలింది. అంటే పగులు వున్న రాయి ఎక్కువ మందం లేదన్న మాట.

రెండు చేతుల్ని లోపలి అంచువైపు పట్టువేసి మెల్లగా నిచ్చెనలా ఆ సందులో నుండి పైకి ఎక్కసాగాను. దాదాపు పది అడుగులు పైకి ఎక్కేప్పటికి నా శరీరం అంతా పట్టేంత పగులు వుంది. మెల్లిగా శరీరం అంతా పగుల్లో ఇరికించిం తరువాత ఇక పైకి ఎక్కడం కష్టం అనిపించలేదు.

ఆ ఇరవై అడుగులు పైకి వెళ్ళింతరువాత కొండ చక్కగా ఏటవాలుగా ఉంది. ఆ సందులో నుండి రెండు చేతుల మీద ఆనుకొని పైకి ఎక్కాను. కొండంతా బోడి గుండులా నున్నగా ఎక్కడా వేరే రాళ్ళు లేకుండా, ఏకరాయి లా వుంది. మెల్లిగా ప్రాక్కుంటూ ఇంకా పైకి వెళ్ళాను. ఇలా పైకి ఎక్కుతున్నప్పుడు ఒక్కసారి కూడా క్రిందకు చూడ్లేదు.

మరో ఇరవై అడుగులు పైకి వెళ్ళింతరాత్వ కొండనిండా

అక్కడక్కడా పెద్దపెద్ద రాళ్ళు అడ్డదిడ్డంగా పడివున్నాయి. ఏటవాలుతనం పోయి కాస్త బల్లపరుపుగావుంది ఇక్కడ. మెల్లిగా ప్రతి రాళ్ళసందునా నీటికోసం వెతకడం మొదలుపెట్టాను.

కేవలం నా అదృష్టంవల్ల ఆ నీటిని కనుక్కోగలిగాను అంతే! ఏలా ఏర్పడిందో ఎప్పుడు ఎర్పడిందో... నేను ఊహించ లేను... బహుశా భూమి పుట్టినపుడు భూమిలో లావా పైకి వచ్చి గట్టిపడుతోన్నప్పుడు ఏర్పడివుండాలి ఆ సొరంగం. చాలా ప్రకృతి సిద్ధంగా ఎర్పడిన చిన్నసొరంగం. దాదాపు అర డుగుల వెడల్పున భూమిలోకి త్రవ్వినట్లు ఏటవాలుగావుంది.

దాదాపు పది అడుగుల లోపల పల్లంలో మోకాలు లోతున నీళ్ళున్నాయి. ఎప్పుడో సంవత్సరానికోసారి వాన కురిసినప్పుడు, నీరు సొరంగంలోని ఈ పల్లంలోకి ప్రవహించి వుండాలి. సొరంగం అనడంకన్నా గుహ అంటే బావుంటుం దేమో ఈ ప్రదేశాన్ని. దాన్నిండావున్న పక్షుల రెట్టలు, పక్షులు ఎప్పుడూ ఇక్కడే నీళ్ళు త్రాగులాయనే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

ఒక్కసారి ఎగిరిదూకి ఆ నీళ్ళల్లో మునిగిపోవాలనిపించింది. నీటిచుక్కలేని ఈ ఎడారిలో నాకు ఈ జలాశయం దొరకడం కేవలం నా అదృష్టం. నీటిలో పూర్తిగా తడవాలనే కోరికను బలవంతంగా చంపుకొంటూ, మెల్లిగా ఆ నీటిప్రక్కనవంగి దోసిలినిండా నీరుపట్టి త్రాగాను. చప్పగా, ఏరుచీ లేనట్లు నిలువగా వున్నాయి. అయితేనేం ఆ దోసిలినీళ్ళు నాకెంతో శక్తి నిచ్చాయి.

ఒక్కక్షణం ఆగి గబగబా ఓ పదిదోసిళ్ళ నీరు త్రాగాను. నీళ్ళుతాగిన మరుక్షణం నిద్ర ముంచుకువస్తున్నట్లనిపించింది. తృప్తిగా, ఆనీటిప్రక్కనే గుహలో కళ్ళుమూసుకొని నిద్ర

పోయాను.

# 6

మెలకువ వచ్చేప్పటికే సూర్యుడు చాలాపైకి వచ్చేశాడు. దాదాపు పదిగంటలు అయ్యుంటుంది. గుహలో ఉక్కగాఉంది. మొహంనిండా చెమటపట్టివుంది. నేను మెలకువవచ్చి కదలగానే నీళ్ళుతాగుతున్న పక్షులు చప్పుడుచేసుకొంటూ ఎగిరిపోయాయి. మెల్లిగా సొరంగంలోనుండి బయటికివచ్చి బండారీవున్న దిక్కు వైపుకు చూశాను.

గుడారంకాని, జీప్‌కాని, బండారీ జాడకాని కనిపించలేదు. ఒక్కక్షణం బండారీ వెళ్ళిపోయాడేమో అనే సందేహం కలిగిందినాకు. కాని రిస్క్ తీసుకోవడం బండారీ చెయ్యడనిపించింది. ఎందుకంటే బండారీ తిరిగి అహ్మదాబాద్ వెళ్ళాలంటే మావూరుమీదుగానే వెళ్ళాలి. మావాళ్ళకు సరైన సమాధానం చెప్పకుండా బండారీ వెళ్ళగలడని నేననుకోను. నేను ఈ కొండల్లో చచ్చిపోయానని చెప్పినా మావాళ్ళు నా శవం వెతకడానికైనా వస్తారు.

ఆ ఆలోచన మరుక్షణం నిజమయింది. దూరంగా ఏక్కడో జీపుచప్పుడు వినిపించింది. వెనక్కుతిరిగి చూశాను. బండారీ జీపులో కొండచుట్టూతిరిగి వస్తున్నాడు అవతలివైపు నుండి. చటుక్కున బండచాటున దాక్కున్నాను.

నేనున్న కొండదగ్గరగా రాగానే జీపు ఆగినశబ్దం వినిపించింది. మెల్లిగా బండలచాటునుండి తొంగిచూశాను. బండారీ జీపుదిగి క్రిందనేలను పరీక్షిస్తూ నడుస్తున్నాడు. బహుశా ఇసుకలో అతనికి నా అడుగుల జాడలు కనిపించివుండాలి. అతని చేతిలోని రైఫిల్‌మీద ఎండపడి మెరుస్తూ కనిపిస్తోంది.

మెల్లిగా కొండఅంచుకు నడిచి జాగ్రత్తగా నేలచాటున

పడుకొని తొంగిచూశాను. నాఅడుగుజాడలవెంట ముందుకు కదుల్తున్నాడు. కొండ వంపుతిరిగి కొండ పగులువున్న చోటుకు నడవసాగాడు. నేను చేతితో ఎత్తగలరాయి దొరుకుతుందేమోనని చుట్టూ చూశాను. అన్నీ బరువైన పెద్దపెద్ద రాళ్ళుతప్ప నేను కదల్చగలిగిన రాయి ఒక్కటీ కనిపించలేదు. మళ్ళీ క్రిందకు చూశాను.

చటుక్కున తల పైకెత్తి చూశాడు బండారీ. ఒక్కక్షణం మాఇద్దరికళ్ళూ కలుసుకొన్నాయి. వెంటనే తల లోపలికి తీసకొన్నాను. చటుక్కునలేచి నా గుహలోకి పరిగెత్తాను. గుండెల దడదడ మంటున్నాయి. ఇహనేనెక్కడున్నానో తెలిసింది కనుక నాకోసం ఓపిగ్గా కాచుకొని వుంటాడు బండారీ.

అతను ఏలాగూ ఈ కొండ ఎక్కలేడని నాకుతెలుసు. నేనైనా మామూలు పరిస్థితుల్లో ఆ పగుళ్ళలో కాళ్ళూ, చేతులుపెట్టి పైకొచ్చే ప్రయత్నం చేసేవాణ్ణికాదు. కాని తెగింపు వల్ల నాకాసాహసమూ, శక్తి కలిగాయి. పైగా ఈ కొండల్లో తిరగడంలో వున్న నా అలవాటు దానికి తోడయింది. పట్నవాసానికి అలవాటుపడిన బండారీ అంత కష్టపడతాడని నేననుకోను. తీరా పైవరకూ వచ్చింతరువాత నేనో తోపు తోస్తే అతను అంతులేకుండా పోతాడు. సరైనమార్గం లేందే బండారీ పైకిరాడని నాకు తెలుసు.

ఎందుకయినా మంచిదని చిన్నచిన్న గులకరాళ్ళు నాలుగయిదుఏరి దగ్గర పెట్టుకొన్నాను. అవసరమయితే కాట్‌బాల్‌లోకి పనికొస్తాయని. పదిగజాల్లోపల కాట్‌బాల్‌తో వదిలిన రాయి చాలా ప్రమాదకరం.

అనుకొన్నట్లుగానే బండారీ కొండ ప్రక్కనుండి కదలి వెళ్ళిపోయాడు. ఓ అయిదునిముషాల తరువాత లాండ్‌లోవర్

స్టార్ట్ అయిన చప్పుడు వినిపించింది. జాగ్రత్తగా సొరంగంలో నుండి బయటికివచ్చి చూశాను. బండారీ జీపును కొండకు దూరంగా తీసుకెళుతున్నాడు.

దాదాపు నాలుగైదువందల గజాలు దూరంవెళ్ళిన తరు వాత జీపుఆపి క్రిందకు దిగాడు. బైనాక్యులర్స్‌తో నేనున్న కొండను పరీక్షగా చూడసాగాడు. అతని కదలికబట్టి కొండను ఒక్కొక్క అంగుళమే ఆ పవర్‌ఫుల్ బైనాక్యులర్స్‌తో క్షుణ్ణంగా పరీక్షిస్తున్నాడనిపించింది. మెల్లిగా వెనక్కుతిరిగి సొరంగంలోకి వెళ్ళాను.

ఒక 'మిన్నిరోటీ' చప్పరిస్తూ మింగి నాలుగుదోసిళ్ళు నీళ్ళుతాగాను .నేలమీద చతికిలబడి ఏంచెయ్యాలో ఆలోచిస్తూ కూర్చున్నాను. అలా ఎంతసేపు గడిచిందో నాకు గుర్తులేదు. హఠాత్తుగా జీపు స్టార్టయిన శబ్దం వినిపించింది. చటుక్కున లేచినిలబడి బయటకువచ్చి జాగ్రత్తగా జీపువున్నవైపుచూశాను. ఒక్కక్షణం ఆశ్చర్యపోయాను నేను.

జీపు అక్కడే అలాగే కదలకుండావుంది. బండారీ ఇంకా బైనాక్యులర్‌తో నేనున్న కొండను గాలిస్తూనేవున్నాడు. మరయితే ఈ జీపుశబ్దం ఎక్కడిది. శబ్దం ఇంకా దగ్గరగా వస్తోంది. శబ్దం వస్తోన్నవైపు తలత్రిప్పి చూశాను. నా ఆనందానికి అంతులేదు!!

డిజర్ట్ వార్‌ఫర్ ట్రయినింగ్ సెంటర్ హెలీకాప్టర్ గరుత్మంతుల్లా ఎగురుతూ వస్తోంది. బండరీకేసి చూశాను. అతనూ హెలీకాప్టర్ వైపే చూస్తున్నాడు. బండరాళ్ళచాటు నుండి బయటికివచ్చి హెలీకాప్టర్‌కేసి చేతులూపసాగాను.

"హెల్ప్! హెల్ప్!"— అంటూ అరిచాను గట్టిగా ఎగు రుతూ, చేతులూపుతూ. హెలికాప్టర్‌లో వాళ్ళు నన్ను చూ?

నట్లు లేదు. అలాగే ఎగురుతుంది. క్రింద బండారీ కూడా దాని వైపు చూస్తూ చేతులు ఊపాడు. హెలికాప్టర్ కాస్త ముందుకు వెళ్ళి, గుండ్రంగా తిరిగి నే నున్న కొండ వైపు వచ్చింది.

ఆనందం పట్టలేక గట్టిగా అరుస్తూ చేతులు ఊపాను. ఎవరో హెలీకాప్టర్ కాబిన్‌లోనుండి చేతులు ఊపుతున్నారు. అర్థంకాలేదునాకు. నావైపు రమ్మన్నట్లు చేతులు ఊపసాగాను.

హెలీకాప్టర్ నేనున్న కొండపైన చుట్టూ ఓసారితిరిగి బండారీ ఉన్నవైపు కిందికి దిగసాగింది. నేను పిచ్చిగా అరుస్తూ ఊపసాగాను.

హెలీకాప్టర్ మెల్లిగా జీపుకు దగ్గర్లో క్రిందకు దిగింది. బాటిల్‌గ్రీన్ యూనిఫారంలోఉన్న ఇద్దరు అందులోనుండిదిగి బండారి జీపుదగ్గరికి నడిచారు. వాళ్ళిద్దరూ బండారీకి కాస్త దూరంలోఆగి ఏదో మాట్లాడారు. తర్వాత దగ్గరగా వెళ్ళారు. బండారీ వాళ్ళిద్దరితోనూ షేక్‌హాండ్ చేశాడు.

తర్వాత బండారీ వాళ్ళతో ఏదోచెబుతూ నేనున్నకొండ వైపు చూపెట్టాడు. వాళ్ళిద్దరూ నేనున్నవైపు చూశారు. నేను మళ్ళీ గట్టిగా అరుస్తూ వాళ్ళవైపు చేతులువూపాను. హెలీకాప్టర్ రొదలో నాఅరుపు వాళ్ళకు వినిపించదని తట్ట లేదు నాకు. వాళ్ళిద్దరూ నావైపుతిరిగి చేతులు వూపి, బండారీతో షేక్‌హాండ్‌చేసి తిరిగివెళ్ళి హెలీకాప్టర్‌లో కూర్చున్నారు. శిలాప్రతిమలా చూస్తూవుండిపోయాను నేను.

వాళ్ళకు అనుమానం కలగకుండా బండారీ ఏదో చెప్పి వుంటాడని తోచింది. హెలీకాప్టర్ మళ్ళీ గాల్లోకిలేచి గుండ్రంగాతిరిగి నేనున్న కొండవైపు వచ్చింది. ఏదో ఓరకంగా వాళ్ళను ఆకర్షించాలని గట్టిగా చేతులు ఊపసాగాను. హెలీ

కాప్టర్‌లోవాళ్ళు మళ్ళీ నావైపు చేతులుఊపారు... క్షణాలమీద హెలికాప్టర్ పార్‌మర్‌వైపుగా ఎగిరిపోయింది.

గట్టిగా ఏడ్వాలనిపించిందినాకు. కోపం పట్టలేక కొండని కాళ్ళతోతంతూ గుహలోకి వెళ్ళాను. నాకు తెలియకుండానే కళ్ళమ్మట నీళ్ళుకారుతున్నాయి. నేలమీద పడుకొని భోరున ఏడ్చాను.

# 10

చిన్నపిల్లాడిలా ఏడుస్తూ అలానే నిద్రపోయివుండాలినేను— హఠాత్తుగా ఏదో శబ్దం వినిపించేప్పటికి చటుక్కున మెల కువ వచ్చింది. చెవులు రిక్కించివిన్నాను. రెండు ఇనుప వస్తువులు ఒకదానికొకటి తగిల్తే వచ్చినశబ్దం... జాగ్రత్తగా విన్నతరువాత కొండ క్రిందివైపునుండి వస్తున్నట్లనిపించింది.

ఓ గుక్కెడు నీళ్ళుతాగి గుహలోంచి ప్రాక్కొంటూ బయటికి వచ్చాను. బహుశా సాయంత్రం నాలుగవుతుందేమో! సూర్యుడి ప్రతాపం చాలావరకు తగ్గిపోయింది. అయినా కొండంతా ఇంకా భరించలేనంత వేడిగావుంది. జీపు ఆగి వున్న వైపు చూశాను. ఇంకా అక్కడేవుంది. కాని బండారీ జాడ ఎక్కడా కనిపించలేదు. మళ్ళీ ఇనుపముక్కలు రాపిడవుతున్న శబ్దం వినిపించింది. మెల్లిగా బండలచాటునుండి పాక్కొంటూ కొండ అంచుకు ఆ శబ్దం వస్తున్న వైపు వెళ్ళాను.

ఒక్క క్షణం ఊపిరి ఆగినంతపనయింది నాకు. క్రిందికి చూసిన వెంటనే కాంప్‌టెంట్‌ను పాతడానికి ఉపయోగించే ఇనుప మేకుల్ని బండారీ అతిశ్రమతో కొండ పగుల్లోకి సుత్తెతో దిగ్గొడుతున్నాడు. అంటే బండారిసులభంగా, ప్రమాదంలేకుండా కొండమీదికి చేరుకొన్నే ప్రయత్నం చేస్తున్నాడన్నమాట.

ఒక్కొక్క మేకు దాదాపు అడుగుపొడవుంటుంది. వాటిని

ఆ కొండ పగుల్లోకి దిగ్గాటి, పైకి రావడానికి నిచ్చెన మెట్లు లా తయారుచేస్తున్నాడు బండారీ. అడుగున్నరకు ఒకటి చొప్పున మూడు మేకులు దించాడు. నాలుగవ మేకు అతి ప్రయాసగా దించుతోవున్నాడు. అంత పనిలోనూ అతని భుజానికి రైఫిల్ వేలాడుతోనేవుంది. అలాంటి మేకు మెట్లు పది పదిహేను అతను వెయ్యగలిగితే కొండమీద పట్టు దొరికే ప్రదేశానికి అతను తేలిగ్గా చేరుకోగలడు.

ఒక్క క్షణం మంత్రింపబడిన మనిషికి మల్లే చూస్తూ వుండిపోయాను. అలా తేలిగ్గా పైకి రావడానికి వీలుగా మెట్లుంటే, నేను రెండు చేతుల్తో అతన్ని ఆపగలగడం చాలా కష్టం. పైగా మెట్లు నిలబడ్డానికి ఆధారంగా వుండడవలన అతనికి ఒకచేత్తో రైఫిల్ వుపయోగించే అవకాశంవుంది. నేను పై నుండి ఏ బండారాయయినా అతనిమీద దొర్లించాలన్నా నిటారుగా వున్న కొండ శిఖరం మీద నుండి అతని మీదకు రాతిని దొర్లించడం దుస్తరం. పైగా నేను కదిలించగల రాళ్ళు కూడా ఆకొండ మీద లేవు. బైనాక్యులర్సులో నుండి బండారీ ఆ విషయం గమనించేవుంటాడు.

నేనెలాగూ ఎడారిలో పడి ప్రాణాలు పోగొట్టుకొనే ప్రయత్నం చెయ్యడంలేదు గనుక, తనే నా దగ్గరికి వచ్చే ప్రయత్నం చేస్తున్నాడు బండారి. ఈ కొండ మీద నన్ను సజీవంగా వదలి వెళ్ళిపోవడం అతనికి ప్రమాదకరం.

ఏం చెయ్యాలో తోచక గుడ్లప్పగించి చూస్తూవుండి పోయాను. చటుక్కున బండారీ మేకుదింపడం ఆపి తలెత్తి పైకి చూశాడు. నన్నుచూసి మేక పిల్లను చూసి ఆనందించే తోడేలులా నవ్వాడు. ఆ నవ్వులో ఏదో క్రూరమైన ఆనందం కనిపిస్తోంది. ఎందుకో తెలియని పిచ్చికోపం ఆ క్షణంలో

నన్నావహించింది. తుపుక్కున ఉమ్మును తుడుచుకొన్నాడు బండారీ. నా నిస్సహాయ పరిస్థితిని అతను బాగా అర్థంచేసుకో వుండాలి.

కొండ అంచునుండి మెల్లిగా వెనక్కి జరిగి నాగుహాకేసి నడిచాను. మనసులో బండారీ మీద ద్వేషం, కోపం, కసి సుళ్ళుతిరుగుతోంది. ఎందుకో తెలియకుండానే నాలోనేను ఓ నిశ్చయానికొచ్చాను. ఈ క్షణంవరకూ బండారీ వేటగాడిలా నన్నువెంటాడాడు. నేను ఎదురుతిరక్క ప్రతిక్షణం అతన్నుండి పారిపోతూవచ్చాను. ఎందుకని? నేనే ఎదురు తిరిగి అతనితో యుద్ధానికి దిగివుంటే ఏమయ్యుండేది? నా కన్నా అతనికున్న బలం ఏదుటి?

అతని రైఫిల్! నాదగ్గరా ఒ రైఫిల్ వుంటే ఈ పాటికి నేనే వేటగాడిని బండారీ లేడి అయ్యుండే వాడే. కాని నాదగ్గర రైఫిల్ లేదు. ఈ ఎడారిలో నాచేతికి మరో రైఫిల్ వచ్చే అవకాశంలేదు. కానీ నేను బండారీని సమాన బలంతో ఎదుర్కో వాలంటే రెండే మార్గలున్నాయి. ఒకటి అతని చేతిలో రైఫిల్ లేకుండా చేయడం. లేదా ఆతని జీప్‌లో వున్న రెండవ రైఫిల్ని నాస్వాధీనం చేసుకోవడం.

మొదటిది అసంభవం అని తెలుసు. ఎందుకంటే బండారీ తన రైఫిల్ చేతిలో లేకుండా ఎక్కడికీ కదలడంలేదు. ఆ రైఫిల్ అతన్దగ్గరుండగా కనీసం అతని దగ్గరకు చేరుకొనే అవకాశంలేదు. ఇకరెండవది. జీపులోని రెండో రైఫిల్ని స్వాధీనం చేసుకోవడం. మొదటి పద్ధతి కన్న దీనికి అవకాశంవుంది. మొదటిది జరగనిపని, ఇది కొద్దిగా తెగిస్తే జరిగే అవకాశం వుంది. కానిఏలా?

మరి కాసేపట్లో ప్రొద్దువాలబోతుంది, అంటే బండారి

మెట్లు కొట్టడం మానేసి. మళ్ళీ రేప్రొద్దున ప్రారంభించాలి. అరగంటకో మేకుచొప్పున బహుశా రేపుమధ్యాన్ననికి పై వరకూ మెట్లు కొట్టగలడు. ఆ తర్వాత అతన్ని నేను జయించే అవ కాశంకాదుగదా! అతన్నుండి తప్పించుకొనే అవకాశంశూన్యం.

అంటే అతను పైకి వచ్చేలోపునే నేను ఆ జీపు దగ్గరికి వెళ్ళి ప్రయత్నంచెయ్యాలి. కానీ అతను జీపు దగ్గర వుండగా నేను అక్కడికి వెళ్ళలేను. అతను జీపు దగ్గర లేనప్పుడే నేను జీపును చేరుకొనే ప్రయత్నం చెయ్యాలి. జీపు చేరుకొని ఆ రెండో రైఫిల్ సంపాయిస్తే అతన్ని అటకాయించడం వీల వుతుంది.

రేపు ప్రొద్దున్న తిరిగి మేకులు కొట్టడానికి అతను పైకి ఎక్కగానే, నేను జీపులో రైఫిల్ స్వాధీనం చేసుకోగలిగితే నేను బండారీని జయించగలననే నమ్మకం నాకుంది. ఎందుకంటే జీపు దగ్గరికి నేను చేరుకోగలిగితే మేకుల నిచ్చెన మీద నిలబడిన బండారీ జీపు వైపుకు నేను వుంటాను. మేకుల మీద నిలబడి బండారీ వెనక్కు తిరిగి గురిచూసి నావైపు రైఫిల్ పేల్చే అవ కాశం లేదు.

జీపులో వున్న మార్నెట్ రైఫిల్ రేంజ్ చిన్నదే అయినా, అతను క్రిందకు దిగేలోపున అతనికి రైఫిల్ గుండు తగిలేంత దగ్గరికి చేరుకోగలను కానీ జీపు దగ్గరికి చేరుకోవడంఎలా? బండారీ మేకులు కొట్టుతున్నప్పుడే జీపు దగ్గరికి వెళ్ళాలి. కాని ఈ కొండ మీదనుండి దిగే అవకాశమేలేదు. జీపు దగ్గరకు వెళ్ళడం ఎలా? పైగా బండారీ మేకులు కొడుతున్నప్పుడు జీపు చేరుకోవాలంటే పగలు ఆ పని జరగాలి. కాని పగలు వెలుతుర్లో బండారీ కన్ను కప్పి ఈ కొండదిగి జీపును చేరుకోవడం అసం భవం? ఏం చెయ్యాలి ?

మేకులు కొడుతున్న ధ్వని ఆగిపోయింది. ఎండ పూర్తి తగ్గిపోయింది. గుహలోనుండి బయటికి వచ్చి ఎడారిలో చూశాను. బండారీ మెల్లిగా నడుచుకొంటూ జీపు దగ్గరి వెళుతున్నాడు.

అలాగే బండచాటున కూర్చుని ఆలోచించసాగాను. ఎలా ఎలా? బండారీ పైకి వస్తే ఎలాగు నాకు చావు తప్పదు ఆలోగా కొంత రిస్క్ తీసుకొంటే నేనతన్ని ఓడించే అవకాశ వుందా? మనసంతా ఆవిషయంమీద లగ్నంచేసి ఆలోచించసాగాను

ఓ పథకం మెల్లిగా నామనసులో రూపం పోసుకోసాగింది ఒక్కసారి జీపునీ దాని పరిసర ప్రాంతాల్ని జాగ్రత్తగా పరీక్షి చాను. మనసులో ఆలోచనలు మళ్ళీ మళ్ళీ పునరావృతం చేసుకో సాగాను. ఆలోచించే కొద్దీ అంతకన్న మంచి పథకం. ఈ ప స్థితుల్లో వుండదనిపించింది.

మనసులోనే నిశ్చయించేసుకొని. మిగిలిన 'మిన్నిం పూర్తిచేసి, రాత్రి బాగాచీకటిపడ్డాక నా పథకం అమలు చేయ లని నిశ్చయించేసుకొన్నాను.

# 1

మొలలో వున్న చాకును, మెడలో తగిలించుకొన్న కా బాల్ని ఓసారి తడివి చూసుకొన్నాను. రొట్టెలు మూ కట్టుకు వచ్చిన గుడ్డనుచింపి రెండు కాళ్ళ పాదాలకు మడిచ చుట్టూ బూటులా చుట్టుకొన్నాను. కొండలోపలి అంచువై మెల్లగానడిచాను.

రాత్రిదాదాపు ఒంటిగంట అయింటుంది. నెలపొడ చంద్రునికాంతిలో ఏమీ స్పష్టంగా కనిపించడం లేదు. జా త్తగా రాళ్ళమధ్యనుండి కదులుతూ కొండఅంచుకు చేరుకొన్నా బండారీ జీపుదగ్గరగా వేసుకున్న గుడారంలో హాయిగా ని

ోతూవుంటాడు ఈ సరికి.

ఈ వైపు కొండఅంచు మరీ గోడలా నిటారుగా వుండ
ుండా కాస్త ఏటవాలుగావుంది. అంటే క్రిందినుండి ఎక్కడానికి
ిలయినంత ఏటవాలు తనంకాదు. కాని పైనించి అతిజాగ్రత్తగా.
లుకవగా దిగితే కొద్దిపాటి గాయాలతో దిగడానికి వీలయిన ఏట
ాలుతనం. మధ్యలో ఎక్కడా కాలుకుపట్టు దొరకడానికి కూడా
లులేనంత నున్నగావుంది కొండవుపరితలం. అయినా తప్పదు...
ాపథకం అమలు జరగాలంటె నాకు కలిగే గాయాలకు లెక్క
యకూడదు.

మెల్లిగా రెండు కాళ్ళను ముందు క్రిందికి పోనిచ్చాను.
ారినప్పుడు మడమలు కొట్టుకపోకుండా వాటిచుట్టూవున్న
ుడ్డలు కొంత రక్షణ ఇస్తాయి. కాని పిరుదలకు, వీపుకు,
ుజాలకు మాత్రం గీసుకపోకుండా ఏవిధమైన రక్షణలేదు.
ళ్ళకు' చేతులకు తప్ప మరెక్కడ శరీరానికి గాయాలయినా
రవాలేదు. కాని నేను కదలడానికి. పోరాడ్డానికి అవసరమైన
ాటికి దెబ్బలు తగులుతే నాపథకం ఫలించడం చాలా కష్టం.

చిన్నప్పుడు జారుడుబల్లమీద క్రిందకు జారడానికి పైనే
ార్చొనే పద్ధతిలో పొజిషన్‌లోకి వచ్చింతరువాత. రెండుచేతు
ు ప్రక్కల అదిమిపట్టి, ఒక్కవూపులో ముందుకు కదిలాను.
దలడం మొదలవగానే రెండుచేతులనూ క్రిందతగలకుండా
కితీసు కొన్నాను.

ఒక్క అరనిముషం పాటేమో, మెల్లగా కదిలాను. ఆ
ర్వాత నాశరీరం నాస్వాధీనంలో లేదు. విపరీతమైన వేగంతో
రం క్రిందకు జారుతోంది. చూడ్డానికి నున్నగావున్నా జారు
ంటె వీపు భుజాలు ఆవేగంరాపిడికి రాతిమీద గీకుకొనివిపరీ
ుగా మండడం మొదలు పెట్టాయి. కాళ్ళకు కట్టుకొన్న

గుడ్డ పీలికలు వేగానికి అరిగి మడమలు కొట్టుక పోవడం మొదలు పెట్టాయి, ఏక్షణాన ఆవేగానికి ముందుకుతూలి, గాల్లోతేలి క్రిందికి పడిపోతాననే భయం ప్రతిక్షణం మండు తున్నా శరీరాన్ని రాతికే అదిమిపట్టే ప్రయత్నం నాతో చేయించింది.

అలా ఎంతసేపు క్రిందికి జారానో నాకే తెలియదు. వీపంతా అగ్నిగుండంలా మండుతూ వుంటే, ఆవేగంలో కాలాన్ని మరిచి పోయేను. హఠాత్తుగా నారెండు కాళ్ళు మెత్తని ఇసుకలోకి దిగి నయ్. ఆతాకిడికి శరీరం తూలి, గాల్లోకితేలి, ఎగిరి ఇసుకలో పడింది.

అయిదు నిముషాలపాటు అలాగే కళ్ళుమూసుకొని కదల కుండా ఆఇసుకలో వుండిపోయాను. వీపు, భుజాలు, మెడ, మోచేతులు' కాలిమడమలు విపరీతంగా మండుతున్నాయి. కాసేపటి తరువాత మెల్లగా లేచినిలబడ్డాను. లోతుగా గాయాలు తగలడం కాని, ఏవయినా ఎముకలు విరగక పోవడం కాని నిజంగా నా అదృష్టం.

నేను నిలబడ్డ ప్రదేశానికి చిన్నగా నాలుగయిదు వందల గజాల దూరంలో ఓపెద్ద బండరాయివుంది. బండారీ గుడా రానికి కూడా దాదాపు అంతేదూరంలోవుంది. నిలబడి నేనా బండరాయి చాటున దాక్కోవడం కష్టం .పొరపాటున బండారీ నేనక్కడ ఉన్నట్లు గమనిస్తే చావుతప్పదు.

మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ బండవైపు నడవసాగాను. పదిగజాలు నడిచాక గుర్తొచ్చింది. ఇసుకలో బండారీ నాఅడుగుజాడలు గుర్తించే అవకాశం వుందని నాకాలికివున్న గడ్డలు విప్పివాటిని పేలికలుగా చేసి కుంచలా తయారు చేశాను. ఒక్కొక్క అడుగే వెనక్కి వేస్తూ, ఒక్కొక్క అడుగు జాడా

కుంచతో స్పష్టంగా కనపడకుండా చెరుపుతూ బండవైపు నడిచాను.

దాదాపు గంటన్నర పట్టివుంటుది నేనా బండచాటుకు చేరేప్పటికి. తర్వాత బండ ప్రక్కమ్మటి ఆరడుగుల పొడవు, రెండడుగుల వెడల్పున, దాదాపు ఓఅడుగులోతు వుండేట్లు గొయ్యి తియ్యసాగాను. చాలా జాగ్రత్తగా ఏమాత్రం చప్పుడు చెయ్యకుండా పూర్తిగా ఆగొయ్యితీసేప్పటికి దాదాపు తెల్లవారు జాము నాలుగయ్యింటుంది.

కాట్‌బాలు నాకు దొరకడం నిజంగా నాఅదృష్టం అని చెప్పాలి ఎవర్నీ హింసించడానికి దాన్ని ఉపయోగించక పోయినా, ఈరోజు నాస్వరక్షణకు అదిబాగా వుపయోగపడింది. కాట్‌బా లోకి వున్న రబ్బరు ట్యూబును పిడినుండి ఊడ దీశాను. సన్నని రబ్బరు గొట్టం. అర్ధసెంటీమీటరు మందానవున్న గొట్టం అది. ఈచివరినుండిగాలి వుదితే ఏఅడ్డంకీ లేకుండా రెండోవైపు నుండి వస్తోంది.

రబ్బరు గొట్టాన్ని మధ్యకు రెండుముక్కలు చేశాను. తర్వాత ఆగోతిలో పడుకొని మెల్లిగా ఇసుకను నాశరీరంమీదికి లాక్కోసాగాను. పావుగంటలో నామెడవరకూ ఇసుకవచ్చేసింది. వీలయినంతవరకూ నన్నుకప్పిన ఇసుక బయటి ప్రదేశంలో సమా నంగా వుండేట్టుసర్దాను.

తర్వాత రెండురబ్బరు గొట్టాల్లో ఒకదాన్ని చేత్తో ఒక్క చెవిరంధ్రంలోకి వచ్చేట్టు పట్టుకొని, రెండవ కొనను గుంట బయటికి వుండేట్టు పెట్టాను. రెండవ గొట్టాన్ని నోట్లో పెట్టుకొని దాని కొసకూడా బయటికి వుండేట్లు పెట్టి, రెండవ చేత్తో నాముఖం మీదికి తలమీదికి కప్పేటట్లు ఇసుకను పోసుకొన్నాను. తర్వాత మెల్లగా రెండవచేతిని కూడా అతికష్టం

మీద లాక్కొన్నాను.

అంటె ఇప్పుడు నేనుపూర్తిగా ఇసుకలో కప్పబడి పోయానన్న మాట. నానోట్లోనూ, చెవిలోనూ వున్నరెండు రబ్బరు గొట్టాలే నాకు బయటి ప్రపంచంతో వున్న సంభంధం నోట్లోవున్న గొట్టం గాలిపీల్చుకోడానికి. విడవడానికి పనిచేస్తుంది. పొరపాటున నోటితో పీల్చడం మరచి ముక్కుతో గాలిపీల్చినా. ఇసుక ముక్కులోకీ గొంతులోకి వెళ్ళి ఉక్కిరి బిక్కిరయి నా సమాధిలోంచి బయటపడకతప్పదు. చెవిలోకి వున్న గొట్టంద్వారా బయట శబా లను వినడానికి వీలవుతుంది.

బండ చాటున గొయ్యితీసుకొన్నాను గనుక ఇసుకలో వచ్చిన తేడాలు బండారీ గమనించే అవకాశం లేదని అనుకొంటున్నాను. ఆరిస్క్ నేను తీసుకోవాలి. తప్పదు. వీపుమీద, కాళ్ళకు తగిలిన గాయాల్లో ఇసుక గుచ్చుకొని విపరీతమైన మంట, దురద పుడుతున్నాయి. అయినా నేను కదలడానికి వీలులేదు.

అలా ఎంతసేపు ఆ ఇసుక సమాధిలో వున్నానో నాకే తెలియదు. ఎన్నో గంటలు గడిచినట్లు అనిపిస్తోంది. సూర్యోదయమయిందో లేదో తెలియదు. ఉన్నట్టుండి నాపథకం మీద నాకే అనుమానం రావడం ప్రారంభించింది. ఆ సన్నని రబ్బరు గొట్టం బండారీ చేసే•చప్పుళ్ళు నాకు వినిపించగలదా అనే అనుమానం నా మనసును తొలచడం ప్రారంభించింది.

ఈ ఇసుక మధ్యలోంచి తల బయటికి తీసి చూసే ధైర్యం లేదు నాకు బయటపూర్తి వెలుగువుండి, బండారీ ఇంకా జీపు దగ్గరేఉంటే బండారీకి తప్పకుండా కనిపించే అవకాశం వుంది. ఒక వేళ ఈ ట్యూబు ద్వారా ఏ శబ్దం వినిపించకపోతే ఎంతకాలం ఈ జీవ సమాధిలో వుండాలి? ఈ భయంకర పరిస్థితిలోంచి తప్పించమని మనసులోనే భగవంతుణ్ణి పదే పదే

ప్రార్థించసాగాను.

ఉన్నట్లుండి వినిపించింది. ఆ ధ్వని. ఎక్కడినుండో, సన్నగా వినిపించి వినిపించనట్లు వినిపించింది. నేనంత ఏకాగ్రతంలో వింటూ వుండకపోతే గమనించేవాణ్ణి కాదు. ఆదే ధ్వని సుత్తితో ఇనుప మేకులు కొడుతున్నచప్పుడు. పదినిముషాల పాటు అలానే ఆ శబ్దాన్ని వింటూ వుండిపోయాను. అంటే తెల్లవారిందన్నమాట. బండారీ బ్రేక్‌ఫాస్ట్ ముగించి మళ్ళీ మేకులు కొట్టడానికి వెళ్ళాడన్నమాట.

మెల్లిగా, జాగ్రత్తగా కదులుతూ, ఒక్కొక్క అంగుళం ఇసుకలోంచి బయటపడ్డాను. బండారాయి అడ్డం వుండడం వలన బండారీ ఇటువైపు చూస్తున్నా నేను కనిపించే అవకాశం లేదు. మెల్లిగా బోర్లాపడుకొని రాతిప్రక్కనుండి బండారీవైపు చూశాను. దీక్షగా ఆ గుడారం మేకులను కొండ గోడలోకి దించడంలో మునిగిపోయాడతను. అతని వీపు నావైపువుండడం వలన పూర్తిగా తలత్రిప్పిచూడందే నేను కనిపించే అవకాశం లేదు. అతనికి.

మరో క్రొత్త మేకు మొదలుపెట్టగానే మెల్లిగా బండ చాటునుండి లేచి జీపు వైపు కదలడం ప్రారంభించాను. గబ గబా జీపు చాటుకు పరిగెత్తుకు పోవాలని ఎంత మనసు తొందర పెడుతున్నా, నా అడుగుల చప్పుడు బండారీ వింటాడేమోననే భయంతో ఎంతో మెల్లిగా అడుగులో అడుగు వేసుకొంటూ జీపు వైపుకు నడకసాగించాను.

ఆ పదిహేను నిముషాలు నా జీవితంలో మరపురాని భయంకర క్షణాలు. ఏ క్షణాన బండారీ మేకు దింపడం ఆపి వెనక్కి తిరుగుతాడో, ఏ క్షణాన నన్ను చూస్తాడో అని ఆతృతలో, భయంతో, అతిజాగ్రత్తగా నడిచాను. చివరికి ఎలా

నయితేనేం జీపు చాటుకు చేరుకొన్నాను. ఒక్క క్షణం అనం దంతో గెంతులు వేద్దామనిపించింది.

జీపు ప్రక్కనే గుడారం ఇంకా అలానే వుంది. గుడారం కాదు నాకు ముఖ్యం ఆ 22 హార్నెట్ రైఫిల్. ముందు సీట్లోకి తొంగి చూశాను. ఎక్కడా ఆ రైఫిలు సూచనలు లేవు స్పేర్ పెట్రోల్ డబ్బాలు తప్ప. మెల్లిగా వెనక బాడీలోకి తొంగి చూశాను. అక్కడా లేదు. అదంతాఖాళీగావుంది. అంటే సామాన్లన్నీ గుడారంలో వున్నాయన్నమాట. గుడారానికి, కొండ కి మధ్య జీపు అడ్డం వుండడంవలన నేను గుడారంలోకి వెళ్ళ డం బండారీకి కనిపించే అవకాశం లేదు. చటుక్కున మెరుపులా గుడారంలోకి వెళ్ళాను.

లోపల అన్నీ నీటుగా సర్ది వున్నయి. ఒక ప్రక్క స్టౌ, వంట వండుకొనే పాత్రాలు కిరోసిన్ డబ్బా, పెట్రోమాక్స్ లైట్లు వున్నాయి. మరో ప్రక్క బండారీ కాంప్ కాట్ పరిచి వుంది. కాంప్‌కాట్ మీద తలగడకు అడ్డంగా పడి 22 హార్నెట్ రైఫిల్ కనిపిస్తోంది.

ఒక్క గెంతుగెంతి దాన్ని అందుకొని చటుక్కున ముద్దు పెట్టుకున్నాను. క్రిందకు వంగి కాంప్‌కాట్ క్రింద నుండి బండారీ సూట్‌కేస్ బయటకు లాగి, తెరచి అందులో నుండి 22 బుల్లెట్లు బయిటికి తీశాను.

అప్పుడు తట్టింది నాకు... ఆ రైఫిల్లో ఏదో లోపం వున్నట్లు. అవును! రైఫిల్ నా చేతికి దొరికిన ఎక్సయిట్ మెంట్‌లో గమనించలేదు నేను. రైఫిల్‌బోల్టు బండారీ తీసే శాడు. రైఫిల్ ముఖ్యమైన, పార్టు అదే. చిన్నదయినా బోల్టు లేకుండా ఏ రైఫిల్ పనిచెయ్యదు.

నమ్మలేనట్లు నా చేతిలోని రైఫిల్ వంక కళ్ళప్పగించి

చూస్తూ వుండిపోయాను. ఒక్క సారిగా పడిన శ్రమంతా వృధా అనీ, చావు తప్పదనే భావం నాధైర్యాన్ని, మనసును కృంగదీశాయి.

# 12

గుడారం అంతా ఒక్కచోటు కూడా వదలకుండా ప్రతి ప్రదేశంగాలించాను. ప్రయోజనం లేకపోయింది. ఎక్కడా ఆరైఫిల్ బోర్డు కనిపించలేదు. బోల్టు లేకుండా రైఫిల్‌ను ఏవిధంగానూ వుపయోగించే ఆవకాశంలేదునాకు. అంటే నేను ఇంత ఆలోచించి కష్టపడివేసిన పథకం వృదాఅయిందన్నమాట.

బండారీ ఎంత జాగ్రత్తమనిషో, రిస్కులను ఎలా వూహిస్తాడో అర్ధమయిందినాకు. ఆలోచించడానికి బండారీకి అవకాశం ఇస్తే అతను ఎత్తుకు పై ఎత్తుకు, చదరంగం ఆటగాడులా ముందే వేసివుంచుతాడు. నిస్సహాయత ఆవహించి ఏమీతోచని వాడిలా నిలబడిపోయాను ఆ గుడారంమధ్యలో.

ఏందోచెయ్యాలి... చెయ్యకతప్పదు. కాని ఏంచెయ్యాలి? ఎలాచెయ్యాలి? అదేఅర్ధం కావడంలేదు.

అప్పుడే బండారి పదడుగుల ఎత్తుకి మేకులు కొట్టేశాడు. మరో మూడు గంటల్లో అతనుకొండపైకి తేలిగ్గాచేరుకోగలడు కొండపైకి వెళ్ళింతరువాత నేనక్కడ లేకపోతే ఈ చుట్టుప్రక్కల వేటకుక్కలా గాలించక మానడు. బండరాతి నుండి గుడారం వరకూ నేను నడిచివచ్చిన అడుగుజాడలు ఇసుకలో అతనికి స్పష్టంగా కనిపిస్తాయి. మధ్యాన్నంలోగా పైకివెళ్ళక పోయినా లంచ్‌కోసం వెనక్కితిరిగి రాకమానడు. అప్పుడయినా నన్ను అతను పనిపట్టితీరతాడు... తప్పదు... ఏదోచేసి తీరాలి నేను.

జీపుడాష్‌బోర్డ్‌లో కూడా బోల్టు కనిపించక పోయింతరువాత ఆ నిశ్చయానికి వచ్చానునేను. అతన్ని ఏదోరకంగా ఎత్తు

వేసి నాకు దగ్గరగా రప్పించగలిగితే అతనితో తలపడే అవకాశం నాకుంది. ఎంతో అకస్మాత్తుగా, ఊహించలేని సంఘటన ఏదేనా సృష్టిస్తేగాని అతను ఈజీపుకు, గుడారానికి దగ్గరగా వచ్చే అవకాశంలేదు.

మెరపులా ఓ ఆలోచన వచ్చింది నాకు. ఎంతో రిస్క్ కూడుకొన్న ఆలోచనఅది. అయినా ఆక్షణంలో అంతకన్న మంచి ఆలోచన స్ఫురించలేదునాకు. వెంటనే నాఆలోచన అమలు పెట్టడానికి నిశ్చయించుకొన్నాను.

గుడారంలోకివెళ్ళి స్టౌ దగ్గరున్న కిరోసిన్‌టిన్ను తెరచి కాంప్‌కాట్‌మీదా, తెరలమీదా పోశాను. తరువాత లైటు తుడవడానికి ఉపయోగించే కాటన్‌వేస్ట్, లైటును తీసుకొని బయటికి వచ్చాను. జీప్‌బాడీలోవున్న స్పేర్ పెట్రోలు టిన్నులు తెరచి కాటన్‌వేస్ట్ తడిపి, మిగిలినపెట్రోలంతా గుడారంమీద చల్లాను. లైటర్ వెలిగించి, కాటన్ వేస్ట్ ముట్టించి గుడారంమీద పడేలా విసిరేశాను.

'గుప్పున' పెద శబ్దంతో మండింది గుడారమంతా. పెట్రోలులో తడిసిన కేన్వాసు వెంటనే అంటుకొని మండసాగింది. నేను బొడ్డులోంచి కత్తితీసి పట్టుకొని జీపు ప్రక్కనేనక్కి దాక్కున్నాను.

గుడారం మండుతూ నల్లటిపొగ ఆకాశంలోకి సుళ్ళు తిరుగుతూ వెళుతోంది. రెండు నిమిషాల తరువాత బండారీ పరిగెత్తుకువస్తున్న అడుగుల శబ్దం వినిపించింది. ఊపిరిబిగబట్టి తయారుగా వున్నాను.

ఒక్కసారి హఠాత్తుగా మండినమంట బండారీని నిజంగా ఆశ్చర్యంలోముంచి, ఆలోచనను పోగొట్టి వుండాలి. ఏమాత్రం సందేహంలేకుండా గుడారంవైపు దూసుకువచ్చాడు.

బండారీ జీపు దాటగానే ఎగిరి అతనిమీదకు పులిలాగెం తాను. దూకుతోనే నాచేతిలోని కత్తిని అతని రైఫిల్‌వున్న భుజం మీద బలంగా దించాను. పెద్దగా కేకపెట్టి దబ్బున క్రిందపడ్డాడు. అతనిపైన నేనుపడ్డాను అకస్మాత్తుగా నేను కొట్టినదెబ్బ షాక్‌కు, నా బరువువలన అరనిమిషం పాటు అచేతనంగా వుండి పోయాడతను.

భుజంలో దిగిన కత్తిని బయటికి లాగలేదు నేను, అది అలానే వదిలేసి కాళ్ళతో, చేతుల్తో అతన్ని విచక్షత లేకుండా ఇష్టంవచ్చినట్లు గుద్దసాగాను. అలా ఎంతసేపు అతన్ని బాధిం చానో నాకు గుర్తులేదు. అప్పటివరకూ అతనిమీద నాలో పెరిగిన కసి, ద్వేషం నన్ను మానవత్వం మరిచి పోయేలా చేశాయి.

అతని ముక్కులోనుండి, నోటిలోనుండి, భుజంమీద గాయంలోనుండి వస్తున్న రక్తం, అతని శరీరంలో ఆగిన కద లిక చూచి నాకు ఒళ్ళుతెలిసింది. ఒక్కక్షణం నమ్మలేనట్లు బండారీవంక తేరిపార జూశాను.

బండారీ మూలుగుతూ అలానే పడివున్నాడు. తెరచివున్న అతనికళ్ళు ఇంకా సంభ్రమంగా నావైపే చూస్తున్నయ్. జరిగిన విషయం నమ్మలేనట్లు, అలానే నా వైపు చూస్తున్నాడు. మెల్లిగా అతని భుజం మీదవున్న రైఫిల్‌ను తొలగించి చేత్తో పట్టుకొని నిలబడ్డాను. ఏమాత్రం నన్ను ఆటంకపరచలేదు.

రైఫిల్‌చేత్తో పట్టుకొని రొప్పుతూ నిలబడ్డాను.

"లేచినిలబడు బండారీ! నీ ఆటకట్టింది"— అన్నాను క్రూరంగా అతనివైపుచూస్తూ.

బండారీ మాట్లాడలేదు. అతని భుజంలో దిగిన కత్తిని బయటకు లాగాలని ప్రయత్నించాడు. రక్తం గాయంలోంచి వరదలా కారింది. మెల్లిగా లేవడానికి ప్రయత్నించాడు. బహుశా

నేను ఆ కోపంలో, కసితో అతన్ని పెద్ద దెబ్బలే కొట్టివుండాలి. రెండు చేతులమీదా లేవబోతూ చటుక్కున వెనక్కి పడి పోయాడు. బండారి స్పృహతప్పాడు.

అతడి కాళ్ళూ, చేతులు బంధించి, జీప్‌లో వేసుకొని, మా గ్రామంవైపు బయలు దేరాను.

—: ఐపోయింది :—

# నీతిలేని వాళ్ళు

ఏ. వీ. మోహన్రావ్

గంట ఏడయింది.

విమల హాల్లోంచి నడవలోకి వచ్చికూర్చుంది.

ఇసుకవేస్తే రాలనంత జనం. ఒకరివెనుకఒకరు. చేతుల్లో చిన్నవీ, పెద్దవీ, రంగురంగుల, రకరకాల సీసాలు పట్టుకుని నిలబడివున్నారు. అంతా అలగాజనమే.

"అమ్మగారూ! డాక్టరుబాబు రాలేదా?" అడిగాడు క్యూలోనుంచి ఒకతను.

"వస్తారు! వస్తారు! కాస్త ఓపిగ్గా, అల్లరిచెయ్యకుండా వుండు?" అంది విమల.

నర్సు ట్రయినింగ్ పూర్తయ్యాక, ఆమెతండ్రి బలవం

తంగా తెచ్చి డాక్టర్ దయానిధి దగ్గర ఉద్యోగంలో ప్రవేశ పెట్టాడు.

చిన్న బంగళాలాంటి ఇంట్లో ముందున్న మూడురూములు హాస్పిటల్ క్రింద మార్చారు. వాటి వెనకవున్న రెండురూముల్ని విమల వాడుకోసాగింది. మేడంతా డక్టర్ క్రిందవుంది.

దయానిధి ఆవూరికొచ్చి సంవత్సరమయింది. అతనొచ్చిన ఆరుమాసాలకు విమల ఉద్యోగంలోవచ్చి చేరింది. ఊరిలోఉన్న పేదలందరికీ దయానిధి దైవసమానుడు. కారణం అతను ఎవ్వర్నీ డబ్బు అడగడు. మందులుకూడా ఫ్రీగా ఇస్తుంటాడు. కాని డబ్బున్నవాళ్ళ దగ్గరమాత్రం ముక్కుపిండి లాగుతాడు. అతని హస్తవాసి మంచిదని అందరిలోనూ బలమైన నమ్మకం ఏర్పడింది.

డాక్టర్ బ్రహ్మచారి. పెళ్ళి చేసుకుందామన్న ప్రయత్నా లుకూడా అతను చెయ్యటంలేదు.

మార్నింగ్ వాక్ వెళ్ళిన దయానిధి తిరిగొస్తూ చూశాడు జనాన్ని. అతనికి ఆనందంతోపాటు గర్వంకూడా కలిగింది.

అందరూ దండాలు బాబయ్యా అంటూ మొక్కసాగారు చిరునవ్వులు చిందిస్తూ ప్రతి నమస్కారాలుచేసి, తిన్నగావెళ్ళి కన్‌సల్టింగ్ రూంలో కూర్చున్నాడు. ఒక్కొక్కరినే విమల లోపలకు పంపసాగింది. వాళ్ళు తిరిగివస్తూ తెచ్చిన చీటీ ప్రకారం సీసాల్లో మందులు నింపి ఇవ్వసాగింది.

ఆడపేషంటు పోయినప్పుడల్లా విమలకు కాస్త అత్భుతగా వుంటుంది. మగవాళ్ళను రెండునిముషాల్లో పంపేసే డాక్టరు, ఆడవాళ్ళను పదినిముషాలన్నా పరీక్షించంది పంపడు. విమల నాలుగయిదుసార్లు దొంగతనంగా చాటునుండి చూసింది. వృత్తి ధర్మానికి విరుద్ధంగా వున్న అతని ప్రవర్తనగురించి పదిమంది

తోచెప్పి, నాలుగు తప్పిద్దామన్నంత కోపం వచ్చిందికూడా.

అంతలోనే ఆమెకు డాక్టరుగారికి ఆ వూళ్ళో ఎంత పేరుందో గుర్తొచ్చింది. తను చెప్పినది ఎవ్వరూ నమ్మరనిపించాక అతని పాపానపడి అతనే పోతాడని, ఆ ప్రయత్నాలు మానుకుంది.

పదింటికి పనిలో తీరిక చిక్కింది. పేషంట్లంతా వెళ్ళిపోయారు.

"విమలా!" పిలిచాడు డాక్టరు.

లోనికెళ్ళి ఆయనకెదురుగా నిలుచుంది విమల.

"నా బ్యాగ్‌కాస్త సర్దు. పెన్సిలిన్ ఇంజక్షన్సు నాలుగు పెట్టు!" అన్నాడు తెల్లకోటుతీస్తూ.

"అలాగే!" అంటూ నిలుచుంది.

ఆమె అక్కడనుంచి కదలకపోవడం చూసి "నిలబడ్డావేం?" అడిగాడు.

"మీతో ఒకమాట చెపుదామని." అంది తలొంచుకొని.

"చెప్పు" అన్నాడు దయానిధి ఉలెన్‌కోటు తీసి తొడుక్కుంటూ.

"ఆడ పేషంట్లను ఒంటరిగా కన్సల్టింగ్ రూంలోకి రప్పించుకుని, పరీక్షించడం పేరుతో వాళ్ళ అవయవాలతో ఆడుకోవడం, ప్రతిఘటన లేకుండావుంటే అనుభవించి పంపడం మొదలైనవన్నీ చేస్తున్నారు. మీారు డాక్టర్లు. మీవృత్తిధర్మానికది విరుద్ధం. అలా వాళ్ళను పాడుచెయ్యడం, మీారు పాపం పెంచుకోవడం బాగాలేదు. కథ ఎదురు తిరిగిందంటే ఈ జనానికి మీామీాదున్న గౌరవంపోయి కక్ష పెరుగుతుంది. అది శిక్షగా మారుతుంది. అలాంటి పరిస్థితి రాకుండానే మీరు మారడం మంచిది." అంది విమల తాపీగా.

"నాగదిలో ఏంజరుగుతుందో దొంగచాటుగా చూడడం

మొదటితప్పు. నాఉప్పుతింటూ నాకే నీతులు చెప్ప బూనడం రెండవతప్పు. నా వ్యక్తిగతమైన విషయాలలో జోక్యం చేసుకో వద్దు.'' అన్నాడు కోపంగా దయానిధి.

విమల బ్యాగ్ సర్దడంలో మునిగిపోయింది.

రాత్రిళ్ళు తనూ డాక్టర్ ఆ బంగళాలో ఒంటరిగానే వుంటున్నారు మూడుమాసాల నుంచి. అయినా అతనెప్పుడూ తనకోసం క్రిందికి రాలేదు. తనవేపుకూడా సరిగ్గా చూడడు. తను అందంగా లేనేమో ననుకుంది.

డాక్టరు వెళ్ళిపోయాడు. మామూలుగా ఊర్లో డబ్బు ఉన్నవాళ్ళ ఇళ్ళలోవుండే పేషంట్లను చూసేందుకు.

విమల తన గదికిపోయి అద్దంముందు నిలుచుంది.

పైటకొంగు క్రిందకు జార్చి చేతులురెండూ పైకెత్తి చూసుకుంది.

మనిషి ఎరుపూ, నలుపూకాని మధ్యరకం ఛామనఛాయలో వుంటుంది. కళ్ళు గుండ్రంగా అందంగా వుంటాయి. మెడ సన్నగా నున్నగా ఉంటుంది. పైపెదవి సన్నగా, క్రిందిపెదవి కాస్త లావుగా వుంటాయి. ఆమెనోరు చాలా అందంగా వుంటుంది. నవ్వితే బుగ్గలు సొట్టలుపడతాయి. తీర్చిదిద్ది నట్లున్న తెల్లటిపళ్ళు తళ తళ మెరుస్తాయి. రొమ్ములు బలంగా ఎత్తుగా వుంటాయి. నడుం సన్నగా వుంటుంది. అక్కడ్నుంచి శరీరం వెడల్పుగా మారిపోతుంది.

నిజానికి విమల అందగత్తెల్లో లెక్కే. అలాగే అనిపించింద క్షణంలో ఆమెక్కూడా అద్దంలో చూసుకుంటుంటే.

దయానిధి అనుభవించిన చాలామంది అమ్మాయిలకన్నా విమల ఎందులోనూ తీసిపోదు. అయినా అతను ఆమెవం కన్నెత్తి చూడకపోవడం ఎందుకో అర్థంకాలేదు.

తలుపు తట్టిన చప్పుడయింది.

గబగబా పైటకొంగు సరిగ్గా వేసుకొని వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా ఆరడుగుల అజానుబాహు విగ్రహం కనిపించింది.

"మీరా?" అంది ఆశ్చర్యపోతూ.

"నేనే!" అంటూ తలుపుమూసి లోనికొచ్చి కూర్చున్నాడు.

"ఇదేనా రావడం?" అడిగింది విమల తనుకూడా ూర్చుంటూ.

"ఆఁ! ఏమిటి విశేషాలు. డబ్బుకావాలి." అన్నాడు.

"నాదగ్గరేంలేదు. నా అవసరాలకు కొద్దిగా తీసుకున్నాను. ుగిలింది డాక్టరుదగ్గరే వుంది. తీసుకొని వెళ్ళండి." అంది మల కాస్త కటువుగా, "ఎందుకమ్మాయ్ అలా కటువుగా ాట్లాడుతున్నావ్?" అన్నాడతను సిగరెట్టు వెలిగిస్తూ.

"మిమ్మల్ని తండ్రిఅని చెప్పుకోవడం నాకు అవమానంగా ుంది. ఇంతవయసొచ్చినాగూడా ఇంకా త్రాగుడు, జూదం, ్భిచారంలాంటి అలవాట్లు తప్పని మీకెందుకు తోచడంలేదు! ెగిన కూతురు మంచిచెడ్డలు చూడవలసిన భాధ్యత మీకు ా?" అడిగింది విమల.

"నా అలవాట్లు మారేవిగావు. నీ మంచిచెడ్డలు చూస్తూ వున్నాగా. నీకు ఇక్కడ ఉద్యోగమిప్పించింది నేనుగాదా?" ిగాడు జనార్ధనం.

"మీరే! ఈ నరకంలో నన్నుతోసింది మీరే!" అంది విమల.

"నరకమా? ఏంటమ్మా? ఏమయింది?" అడిగాడు ఆతృ ా జనార్ధనం.

ఇంతదాకా ఏంలేదు. ఆ దయానిధి కిరాతకుడు. ఆడవా ాటే ఆటబొమ్మలక్రింద లెఖ. మందుకోసంవచ్చే మనుషుల్ని

పాడుచేస్తున్నాడు. నా పాపంకూడా ఎప్పుడో పండిస్తాడని భయం గా వుంది. నేను ఇక్కడ మానుకుందా మనుకుంటున్నాను." అంది విమల.

జనార్దనం కోపంతో వూగిపోయాడు.

"నీపట్ల అమర్యాదగా ప్రవర్తించాడా?"

"లేదు!"

"అలాంటిదెప్పుడూ జరగదు. నువ్వుమాత్రం ఇంకో ఉద్యోగం చూసేదాకా ఇక్కడేవుండు. ఉద్యోగం దొరకగానే వెళ్ళవచ్చు. వస్తాను." అంటూ లేచి వెళ్ళాడు జనార్దనం.

విమల చూస్తూ కూర్చుంది.

## 2

దయానిధి ప్రసిడెంట్‌గారింటిముదు స్కూటర్ ఆపి బ్యాగ్ తీసుకొని లోని కడుగపెటాడు. నలుగురైదుగురు పోలీసులు, ఒక సబ్‌ఇన్‌స్పెక్టరు, చుట్టుప్రక్కల జనం కొంత మంది హడావుడిగా తిరుగుతూ, మాట్లాడుతూవున్నారు.

ప్రసిడెంట్‌గారు ఎదురొచ్చి "డాక్టర్‌గారూ! కొంప మునిగిపోయింది" అన్నాడు ఏడుస్తూ.

"ఏమయింది? మీ ఆవిడకు.................... ?" అంటూ ఆగాడు.

"మీచేతి చలువవల్ల అది ముక్కలా బాగానేవుంది. దొంగలుపడి రెండులక్షల రూపాయలు కాజేశారు." అన్నాడు ప్రసిడెంట్.

"నిజంగానా? అంత డబ్బు ఎందుకుపెట్టారు ఇంట్లో." అంటూ కూర్చున్నాడు ఇన్‌స్పెక్టర్ ప్రక్కనే మంచంపైన.

"ఇవ్వాళ అందరికీ ఎరువులకోసం అప్పులుపంచాలి. నిన్న బాంక్‌లో తెచ్చాను. రాత్రి పొలం కుప్పలదగ్గర కాపలా పడ

కునేందుకు వెళ్ళాను. తెల్లారి ఇంటికొచ్చేసరికి ఇదీ జరిగింది''
చెప్పాడు ప్రసిడెంటు.

రెండు లక్షల రూపాయలు చోరీ జరగడం ఆ వూళ్ళో అదే మొదటిసారి. గత సంవత్సరంగా అలాంటి దొంగతనాలు నాలుగైదు జరిగాయి. పోలీసులు రావడం, సాక్ష్యాలు తీసుకోవడం, తప్ప దొంగల్ని పట్టుకుందిమాత్రం లేదు.

రిపోర్టు రాసుకోవడం ముగించిన ఇన్‌స్పెక్టర్ రాయుడు స్థూలకాయాన్ని మంచంమీదనుండి బలవంతంగా పైకిలేపాడు.

''రాయుడుగారూ!'' పిలిచాడు దయానిధి.

ఏమిటన్నట్టు డాక్టర్‌వంక చూశాడు.

''ఏమైనా ఆచూకీ తెలిసిందా?'' అడిగాడు.

''ప్రసిడెంట్‌గారి భార్య రాత్రి ఇంట్లో ఒంటరిగావుంది ఆమె తలుపులన్నీవేసి పడుకున్నానని నమ్మకంగా చెపుతూంది. అయినా దొంగలు ఎలా లోపలకు వచ్చారో అంతుబట్టడం లేదు. డబ్బు అల్మైరాలో పెట్టారట. ఆ తాళాలు ఆమె దగ్గర వున్నాయి. అవి తలక్రింద పెట్టుకున్నానని చెప్పిందీ. తెల్లారాక తాళాలు తనే దిండుక్రిందనుండి తీశానని చెప్పతూంది.'' అన్నాడు రాయుడు.

''దొంగలు లోనికి వెళ్ళేందుకు వేరేమార్గంలేదా?''

''చూశాను. ఏమీ కనిపించలేదు.'' అన్నాడు రాయుడు.

'' నాకుమాత్రం ఇంకోవిధంగా తోస్తుంది. ఆ కాంపౌండ్ ప్రక్కన పెద్ద వేపచెట్టు చూశాను. దాని కొమ్మలు ఈ ఇంటిపై డాబాపైకి వున్నాయి. దొంగ సులభంగా ఇంటి పై భాగానికి చేరవచ్చు. అక్కడనుంచి మెల్లగా క్రిందకుదూకి ఆమె పడకగదిగుండా క్రింద హాల్లోకి వచ్చి పని ముగించుకొని వెళ్ళవచ్చుననిపిస్తుంది. అన్నాడు దయానిధి.

"ఆమెచెప్పడం తన గది తలుపులు ఘట్టిగా బిడాయించు కున్నానని గదా? అలాంటప్పుడు ఆ దొంగ పైనుంచి దూకి ఎలా రాగలుగుతాడు? అడిగాడు రాయుడు.

"ఆమె తలుపు వేసుకుందో? లేదో? మీరు కాస్త గద్దించి అడిగేసరికి వేసుకున్నానని చెబుతుందేమో?" అను మానంగా అన్నాడు దయానిధి.

"అలాంటప్పుడు, వీధివాకిలి తలుపుకూడా వేసుకుందన్న గ్యారంటీ ఏముంది?" అడిగాడు రాయుడు.

"అవును. మీరుచెప్పింది నిజమే! ఏమయినా పోలీసులు. మీకు తెలియాలి ఈ తికమకలు. నాకేంతెలుస్తాయి?" అన్నాడు దయానిధి.

దీనంగా తలవంచుకొని మౌనంగా కూర్చున్న ప్రసిడెంటు గారిదగ్గర సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు రాయుడు.

దయానిధికూడా "నేనూ వెళ్ళివస్తాను." అన్నాడు ప్రసిడెంటుతో.

ఆయన మాట్లాడకుండా అలాగేనన్నట్లు తలూపాడు.

అంతదాకా దూరంగా గుమ్మంలో నిలుచున్న ప్రసిడెంటు గారి భార్యామణి, దయానిధి వెళ్ళడంచూసి, తనుకూడా లోనికి వెళ్ళిపోయింది.

దయానిధి స్కూటర్ ఎక్కి స్టార్ట్‌చేశాడు. కొంచెం ముందుకు పోగానే, కాంపౌండ్ గోడనానుకొని పెరిగిన పెద్ద చెట్టు మొదలుచుట్టూ వంగి చూస్తున్న రాయుడుగారి స్థూల కాయం కనిపించింది.

రాయుడిగారి దగ్గరగా ఆపి దిగాడు స్కూటర్ దయానిధి "ఏమిటండీ! పరిశోధిస్తున్నారా?" అడిగాడు డాక్టర్.

"ఎవరివైనా అడుగుజాడలు దొరుకుతాయేమోనని చూస్తు

న్నాను.'' అన్నాడు రాయుడు.

''మీా ప్రయత్నం ఏమన్నా ఫలించిందా?''

''లేదు!''

''ఈ రోజుల్లో దొంగలుకూడా తెలివిగా మారిపోయారు. పోలీసులు పరిశోధన ఎలా సాగిస్తారో ఆ వెధవలకు తెలుసు. అన్నిరకాల జాగ్రత్తలు తీసుకొంటున్నారు. ఏవిధమైన ఆచూకీ చిక్కకుండా వుండేందుకు.'' అన్నాడు దయానిధి.

''మీరు చెప్పిందికూడా నిజమే'' అంటూ తల పైకెత్తాడు. ప్రసిడెంటుగారి మేడపైన, నిలబడి వీధివంక చూస్తున్న అతని భార్య కనిపించింది రాయుడికి.

''నేను వస్తానండీ! అవతల చూడవలసిన పేషంట్లు చాలామంది వున్నారు.'' అన్నాడు స్కూటర్ స్టార్ట్‌చేస్తూ

''మంచిది వెళ్ళిరండి!'' అన్నాడు రాయుడు,

స్కూటర్ వెళ్ళిపోయింది.

రాయుడు ఎంత వెతికినా ఏవిధమైన ఆచూకీలు దొరక లేదు. మళ్ళీ ఇంట్లోకొచ్చాడు. ప్రసిడెంటును ఇంకకొన్ని ప్రశ్నలడిగాడు. అతను చెప్పిన సమాధాలను నోటు చేసుకు న్నాడు.

''డబ్బు దొరుకుతుందంటారా సార్!'' నిరాశగా అడిగాడు.

''నోట్ల నంబర్లున్నాయి. మార్చడానికి ప్రయత్నం చేశా డంటే చిక్కుతాడు. మీారు డబ్బు తెచ్చిందీ, ఇంట్లో దాచిందీ రాత్రి ఇంట్లో ఉండకుండా పొలానికెళ్ళిందీ, మొదలైన విషయా లన్నీ తెలిసిన మనిషే ఈ దొంగతనం చేసివుండాలి. అతన్ని ఎలా గైనా పట్టుకుంటాను. మీరు నిశ్చింతంగా వుండండి!'' అన్నాడు రాయుడు.

పనిమనిషి వెండిగ్లాసుతో కాఫీతెచ్చి అందించాడు రాయు

డికి. గ్లాసందుకుని త్రాగాడు ప్రసిడెంటు. భార్య మఃగుమ్మాని కానుకుని నిలుచుంది. ఆమెకేసి చూశాడు రాయుడు

సినిమా తారలా అలంకరించుకొని వుంది. ఆమె వయస్సు పాతికేళ్ళకు మించి వుండదనుకున్నాడు. ప్రసిడెంట్‌కు యాభై కి పైనే వున్నాయి. రెండో పెళ్ళి చేసుకున్నాడేమో ననిపించింది. అడిగి తెలుసుకుందామనుకున్నాడు. అతనేమయినా బాధపడతా డేమోనని ఆ విషయం వదిలేసి, మరి నేను శెలవు తీసుకుంటాను. మీకు ఏదైనా చెప్పదగిన విషయం అనిపించింది గుర్తొస్తే నాకు కబురు చెయ్యండి.'' అన్నాడు రాయుడు.

''అలాగే!'' తలూపాడు ప్రసిడెంటు.

రాయుడు వెళ్ళిపోయాడు అక్కడ్నుంచి.

''మణీ!'' పిలిచాడు భార్యను ప్రసిడెంటు.

గుమ్మందిగి నడవలోకివచ్చి భర్తముందు నిలుచుంది.

''ఏమిటి?'' అడిగింది మెల్లిగా.

''రాత్రి నేను వెళ్ళాక నువ్వు తలుపులు వేసుకుందీ లేనిదీ గుర్తులేదూ.''

''అదేంటండీ అలా అడుగుతారు. మీరు వెళ్ళగానే వీధి తలుపు వేశాను. లోనికొచ్చి క్రింది తలుపులన్నీ మూసి పైకి వెళ్ళి పడుకున్నాను. మళ్ళా తెల్లారి తీశాను.'' అంది మణి.

''నేను పొలంవెళ్తూ పాలేరు పెళ్ళాం లక్ష్మిని వెళ్ళి నీకు తోడుగా పడుకోమని చెప్పాను అది రాలేదా?'' అడిగాడు ప్రసిడెంటు.

''ఎవ్వరూ రాలేదండీ. చాలాసేపు నిద్రపట్టక పుస్తకం చదువుకొంటూ కూర్చున్నాను. వచ్చి తలుపు తట్టివున్నా, పిలిచివున్నా నాకు తెలిసివుండేదే!'' అంది మణి.

''విచిత్రంగా వుంది. తలుపులన్నీ మూసివుంటే, కన్నం

కూడా వేయకుండా దొంగ ఎలా లోనికొచ్చి వుంటాడు.''
అన్నీ తనే ప్రశ్నించుకున్నాడు పెద్దగా.

''పోలీసులొచ్చారుగా? వాళ్ళే విచారించి దొంగను పట్టు కుంటారు. మనడబ్బు ఎక్కడికీపోదు. దిగులు పడకండి ధైర్యంగా వుండండి.'' అంది మణి.

''పాపం డాక్టరుగారు నీకు ఇంజక్షను ఇవ్వకుండానే వెళ్ళి పోయినట్లున్నాడు, ఈ హడావిడిలో. అది మానితే మళ్ళా కడుపునొప్పి వస్తుందేమో. మళ్ళీ ఆయనను రమ్మని చెప్పడం బాగుండదు. నువ్వెళ్ళి చేయించుకుని రాకూడదు!'' అన్నాడు ప్రసిడెంటు.

''తర్వాత వెళ్తాలెండి'' అంది మణి

''నీయిష్టం నేనలా ఊర్లోకి వెళ్ళివస్తాను.'' అన్నాడు ప్రసిడెంటు.

మణి లోనికి వెళ్ళిపోయింది.

# 3

విమలకు పేషంట్లద్వారాఆఊళ్ళో జరిగిన దొంగతనం తెలిసిపోయింది. గుచ్చి గుచ్చి ప్రశ్నలువేసి కొన్ని వివరాలు కూడా సేకరించింది.

దయానిధి స్కూటర్‌దిగి లోనికొచ్చాడు.

''విమలా?'' పిలిచాడు.

వెళ్ళి ఎదురుగా నిలుచుంది బొమ్మలా మాటా పలుకూ లేకుండా.

''ఇంతకూ నన్నెందుకు పిలిచారు?''

''ఈ పేషంట్లంతా దాదాపు రోజూ వస్తున్నవాళ్ళలాగే వున్నట్లున్నారు. నేను కన్సల్టింగ్ రూంలో వుంటాను. మామూలు రోగులైతే నిన్నటిమందులు రిపీట్‌చెయ్యి. కాంప్లి

కేషన్స్ వున్న కేసులయితే నాదగ్గరకు పంపు. నామనస్సేమీ బాగాలేదు.'' అన్నాడు దయానిధి.

''అలాగే! కానీ వాళ్ళు మీరే చూడాలంటారు. నామాట వినరు.'' అంది విమల.

''నువ్వే ఏదోలాగ సర్ది చెప్పు.''

''ప్రయత్నిస్తాను.'' అంటూ వెలుపలికొచ్చింది.

ఒక్కొక్కరి దగ్గరవున్న చీటీలు తీసుకొని తనే టెంపరేచర్ చూడడం, గుండె తట్టి చూడడం, లాంటివన్నీచేసి, మందులివ్వసాగింది.

అందరూ డాక్టర్‌గారి గురించే అడగసాగారు. ఆయనకు వొంట్లో బాగులేదనీ, కాస్త విశ్రాంతి తీసుకంటున్నాడనీ, ఇష్టంలేకున్నా అబద్ధంచెప్పి సర్ది పంపేసింది మొత్తాని కందరినీ.

అందరూ వెళ్ళి పోయరని నిర్ధారణ చేసుకుని, కన్సల్టింగ్ రూంలోకి తిరిగొచ్చి చెప్పింది ఆ విషయం దయానిధికి.

థాంక్స్! నీలాంటి ఏబుల్ వర్స్ వుండడంలోని సుఖం మొదటిసారిగా నాకిప్పుడర్థమయింది.'' అన్నాడు.

''ఇంతకూ మీ మనస్సు ఎందుకు బాగులేదు!''

''మనకు ఆత్మీయుడైన ప్రసిడెంట్ ప్రసాదరావుగారింట్లో దొంగలు పడ్డారట రాత్రి. రెండు లక్షల రూపాయల దాకా కాష్ కాజేశారట. ఆయన భార్య రమణ మణికి ఇంజక్షను ఇద్దామని వెళ్ళే సరికి పోలీసులు నిండి వున్నారు. విన్నాక బాధ కలిగింది. మిగిలిన కేసులు కూడా చూడకుండా వచ్చేశాను.'' అన్నాడు దయానిధి.

''పాపం! చాలా అన్యాయం జరిగింది.'' అంది విమల. ఆమెకు ప్రసాదరావు తెలుసు. అతని మంచితనం గురించి చాలా వినిందికూడా. అందుకే అంతకుముందునించీ బాధ

పడసాగింది.

"పోలీసులు దిగారుగా రంగంలోకి. దొంగలు అంత సుల భంగా తప్పించుకోలేరు." అంది విమల.

"అవునవును. అందులో బ్రహ్మరమిసాల పెద్ద బొజ్జ రాయుడు క్రొత్తగా సర్కిల్ ఇన్‌స్పెక్టరుగా వచ్చాడు. అతని తెలివి తేటల గురించి కథలు చెప్పుకుంటారు చాలామంది. అతనే ఈ కేసు పరిశోధన చేసేందుకు పూనుకున్నాడు." అన్నాడు దయానిధి.

"ఇలాంటి విషయాలన్నింటిగురించి ఆలోచించి మీ మనస్సు ఎందుకు పాడుచేసుకుంటారు. మరచిపొండి. హుషారుగా వుండండి." అంది విమల వెక్కసంగా.

"నేనలా పెరగలేదు విమలా. అందరి కష్టాలు నావే అని పిస్తాయి. వీలయినంత మందిని ఆదుకోవాలనిపిస్తుంది. అందుకే పరమ పవిత్రమైన సేవా నిరతితో కూడుకున్న డాక్టర్ వృత్తిని ఎన్నుకొన్నాను." అన్నాడు దయానిధి గంభీరంగా.

"నేను వెళ్తాను. మీరు కూడా రెస్టు తీసుకోండి!" అంది విమల ఇంక ఈ సంభాషణ ఆపేద్దామని.

"అలాగే" అంటూండగా కాకీ బట్టల్లో వున్న వ్యక్తి లోనికొచ్చి "నమస్తే సార్!" అన్నాడు చేతులు జోడిస్తూ.

"ఎవరు?" అడిగింది విమల.

"వీరాపురం జమీందారు గారి డ్రైవర్ను అమ్మా!"

"ఏం కావాలి?"

"డాక్టరు గారికోసం?"

"ఎందుకు?"

"మా అమ్మగారు ఈ మధ్య కడుపునొప్పితో బాధ పడు తూంది. పట్నంలో చూపించుకొచ్చాం. ఏదో మందిచ్చారు.

నొప్పి వచ్చినప్పుడల్లా వేసుకోమన్నారు. రెండు నెలలు పని చేసింది. ఆ తర్వాత పనిచేయడంలేదు. ఆమెనిప్పుడు తీసు కొచ్చాను. నొప్పితో మెలికలు తిరిగి పోతూంది." అన్నాడు డ్రైవరు.

"ఓరీ ఫూల్! పేషంటునక్కడ పెట్టి నువ్వు ఎలా. వచ్చావ్ లోనికి. ముందావిడ్ని తీసుకురా! పో" అంటూ పెద్దగా అరచాడు దయానిధి.

డ్రైవరు పరుగెత్తాడు వెలుపలకు.

"విమాలా! వాడు ఆమెను తీసుకురాగలడో లేదో, నువ్వు కూడా వెళ్ళు!" అంటు తొందర పెట్టాడు.

బ్లడ్ ప్రెషర్ చూసే ఇన్‌స్ట్రుమెంట్, ధర్మామిటర్, మొదలైన సామగ్రి అంతా ఛకచక సర్దు కొన్నాడు.

రెండు నిముషాలకు "అమ్మా! అబ్బా!"అంటూ మెలికలు తిరిగి తున్నా మనిషిని చెంతో చెయ్యి భుజంపైన వేసికొని, విమలా మరో ఆడమనిషి లోనికొచ్చారు. దయానిధి చూసి "ఇలా తీసుకురండి!" అన్నాడు.

ఆమెను టేబుల్ పైన పడుకోబెట్టారు.

విమల ఆమెకాళ్ళు చక్కగా సర్ది పెట్టింది పొడుగ్గా వుండేట్లు. ఆమె వెంట వచ్చిన మనిషి చేతులు సర్దింది.

తెల్లటి మెర్క్యూరీ లైట్ క్రింద వెల్లి కింతలా పడుకున్న ఆమె శరీరం లోని ఎత్తు పల్లాలు అందంగా కనుపించాయి. క్షణం తదేకంగా చూశాడు దయానిధి. మెల్లిగా టేబుల్ ప్రక్కకు జరిగి స్టెత స్కోపు గుండెల మీద పెట్టాడు.

"పైట కాస్త తీసెయ్యి!" అన్నాడు.

పేషంటు వెంట వచ్చినమనిషి అయిష్టంగానే పైట చెంగు తొలిగించింది. బలమైన గుండ్రంగావున్నా యవ్వనం

కవ్విస్తున్నట్లనిపించింది. అక్కడే స్టెతస్కోపు పెట్టాడు దయానిధి మరో రెండు చోట్ల చూశాడు. స్టెతస్కోపు మెడచుట్టూ తగిలించుకుని అద్దాల బీరువా వైపు నడిచాడు. లోపలి నుంచి మందు తీసి ఇంజక్షనులో ఎక్కించాడు.

విమల ప్రత్తి స్పిరిట్‌లో తడిపి తెచ్చింది. దయానిధి ఇంజక్షనిచ్చాడు. రెండు మాత్రలు మింగించమన్నాడు.

ఐదు నిముషాల్లో పేషంటు లేచి కూర్చుంది.

ఫాన్ క్రిందకూర్చుని పేపరు తిరగేస్తున్న దయానిధి ఆమెలేవడం చూసి, "విమలా! ఆమె నిలా తీసుకురా?" అన్నాడు.

విమల ఆమెను తీసుకొచ్చి ఎదురుగానున్న కుర్చీలో కూర్చో బెట్టింది.

"నొప్పి తగ్గిందా?" అడిగాడు దయానిధి.

"తగ్గిందండీ!" చెప్పిందామె సంతోషంగా.

ఆ నొప్పి పుట్టు పూర్వోత్తరాలు, దానికి వాడిన మందులు మొదలైన వివరాలు అడిగి తెలుసుకున్నాడు. మాటల మధ్య ఆమె పేరు సుజాతని కూడా తెలుసుకున్నాడు.

"వస్తానండీ!" అంది సుజాత.

"పది రోజుల పాటు రోజూ ఇంజక్షనులు తీసుకోవాలి. వస్తారా? లేక మీ వూర్లో ఎవరిదగ్గరన్నా తీసుకుంటారా?" అడిగాడు దయానిధి.

"రోజూ రావడం పడదండీ! మీరు రాలేరా?"

"రాగలను. కానీ చాలా ఆలస్యమవుతుంది. ఇక్కడ తెరిపి లేకుండా పనివుంటూ వుంటుంది. అందువల్ల కష్టంగా వుంటుం దేమో. మీరు రాగలిగితే చాలా మంచిది!" అన్నాడు డాక్టరు.

"మావారితో చెపుతాను. వారిచేతే కబురు చేయిస్తాను."

అంది సుజాత పర్సు తీసి వంద రూపాయల కాగితం అందిస్తూ.

డాక్టరు ఆమెను అంగాంగ పరిశీలనచెయ్యడం విమల గమనించింది. ఆమె నాష్టి తగ్గించి, ఆమె చేత చీకటి తప్పు చేయించేందుకు పథకం వేస్తున్నాడనుకొంది.

కారు దాకా వెళ్ళి సాగనంపింది. ఎక్కి కూర్చున్నాక పదిరూపాయల కాగితం తీసి విమల కిచ్చింది. వద్దంటూనే తీసుకుంది.

తిరిగి లోపలి కొచ్చే సరికి డాక్టరు వెళ్ళిపోయాడు గది లోంచి.

విమల కూడా తన గదిలోకి వెళ్ళిపడుకుంది.

# 4

సైకిల్ రోడ్ మీద పడేశాడు రాయుడు.

కొంచెం దూరంగా పొలం గట్టు కానుకుని వున్న చిన్న గుడిసె కేసినడిచాడు. ఆరు బయట నులక మంచం మీద కూర్చుని తాటినార తాడు నేస్తున్న పాలేరు వీరడు పోలీసు దుస్తుల్లో వున్న రాయుడ్ని చూసి అదిరి పడ్డాడు. వెంటనే ఎదురయ్యి వంగివంగి దణ్ణం పెట్టాడు.

"వీరడంటే నువ్వేనట్రా!" అడిగాడు మీసం దువ్వుతూ రాయుడు.

"ఆబడుద్దాయి యీడేనయ్యా!" అంటూ తన్ను తనే చూపించుకొన్నాడు చేత్తో.

"నీతో కొద్దిగా మాట్లాడాలని వచ్చాను." అన్నాడు

తమరిట్టా మంచం మీదకుసొండి." అంటూ రాయుణ్ణి మంచం దులిపి కూర్చోపెట్టి, తను క్రింద కూర్చుని "అడుగుదొరా!" అన్నాడు వీరడు.

"మీ ప్రెసిడెంటుగారింట్లో దొంగలు పడ్డారు రాత్రి.

నువ్వు చీకట పడ్డది మొదలు తెల్లారిందాకా ఎక్కడున్నావ్?''
అడిగాడు రాయుడు.

''కొంపదీసి నేనే దొంగననుకోవడం లేదుకదా సార్!''
ఏడుస్తూ అడిగాడు వీరడు.

''నేనే మనుకునేది నీకనవసరం! జవాబుచెప్పు'' గద్దించాడు రాయుడు.

''ఈడే వున్నాను దొరా! అమ్మతోడు. కావాలంటె మా ఆడదాన్ని అడగండి'' అన్నాడు.

''దాన్ని కూడా పిలు''

''మాలచ్చి! మాలచ్చీ!'' పిలిచాడు

గుడిసెలోంచి ఆడమనిషి బైటకొచ్చింది. రాయుణ్ణి చూచి అడుగు పడక అక్కడే ఆగిపోయింది.

''రా! రాత్రి నేనెక్కడుందీ దొరకు చెప్పు'' అన్నాడు వీరడు.

''ఇక్కడే నాతోనే వున్నాడు దొరా!'' చెప్పింది మాలచ్చి.

''అబదం!'' అన్నాడు రాయుడు

ఇద్దరూ ఆ అరుపుకు చెమ్మటతో ముద్దలా తడిసిపోయారు.

''రాత్రి ప్రసిడెంటు పొలానికొచ్చాడు. వస్తూనే మాలచ్చిని తనభార్యాకు తోడుగా పడుకోమనిచెప్పాడు. అదివెళ్ళింది అవునా?''

''అవును.'' అంది మాలచ్చి.

''వెళ్ళి తలుపులెంతకూ అమ్మగారు తీకుంటే విసుగెత్తి వచ్చేసింది'' చెప్పాడు వీరడు.

''అవునుదొరా! అంతే జరిగింది.'' అంది మాలచ్చి

''నువ్వెళ్ళి తిరిగి రావడానికి ఎంత టైమ్ పట్టింది?''

''రెండు గంటలు పట్టిందేమో దొరా!''

"ఆ టయిమ్‌చాలు, నువ్వెళ్ళి దొంగతనంచేసి వచ్చేందుకు. నీకు ఆయింట్లో ఏదెక్కడుందో తెలుసు. డబ్బు ఎక్కడ పెట్టారో తెలుసు. మాలచ్చి పోగానే వెంటనే నువ్వూవెళ్ళావ్. పెళ్ళాన్నిబైట కాపలాపెట్టి, నువ్వు చెట్టెక్కి మేడపైకి దూకి దొంగతనంచేసి తిరిగివచ్చావ్ పెళ్ళాంతో."

"బాబూ! అబద్ధం! నేనసలు ఇక్కడనుంచి కదలలేదు. దేముడిమీద ప్రమాణంచేసిచెపుతున్నాను. నామాట నమ్మండి." అన్నాడు మొత్తుకుంటూ.

"నువ్వు ఆ రెండు గంటలసేపూ ఇక్కడే వున్నావని సాక్ష్యం చెపేందుకెవరున్నారు?" అడిగాడు రాయుడు.

"దేవుడు."

"ఆ దేవుడుకి నోరుంటే ఆ మణెమ్మగారి సంగతే పోలీసోళ్ళకి చెప్పి వుండేవాడు, ఆయనకు నోరులేదు కాబట్టి ఆ దొంగతనం మనతలకెత్తారు!" అంది మాలక్ష్మి

రాయుడికి ఆమాటతో కూడా ఉత్సాహం ముంచుకొచ్చింది. వాళ్ళిద్దరూ ఆయింటిమనుషులు. అక్కడివాళ్ళలో గుట్టు, వీళ్ళకే తెలిసుంటుందన్న నమ్మకంతో, ఇంతదూరం వచ్చాడు. వాళ్ళనే దొంగలుగా చెప్పడంలో ఆయనఉద్దేశ్యం కూడాఅదే. తన పాచిక పారినందుకు సంతోషం వేసింది.

"మాలక్ష్మి! ఏమిటా మణెమ్మసంగతి," అడిగాడు.

"ఏముంది బాబూ! పెద్దవాళ్ళరహస్యాలు. నోరుజారింది. తప్పకాయండి నన్నేమీ అడక్కండి బాబూ. నేను చెప్పానని తెలిస్తే, తాటిబరకతో నా వొంటితీట తీరుస్తుందాతల్లి." అంది మాలక్ష్మి.

"నీకేంభయంలేదు. నువ్వుచెప్పే విషయాలు నాకుతప్ప మరెవ్వరికీ తెలియవలసిన అవసరం లేదు. ధైర్యంగాచెప్పు. వీరు

దొంగలుకాదని బుజావు చేసుకొనేందుకయినా నాకు ఆవిష యమంతా చెప్పితీరాలి!,, అన్నాడు రాయుడు.

"ఈ వూరి డాక్టరు బాబు తెలుసు గదాతమకు. ఆయన వాళ్ళునయం చేసేందుకని రాకపోకలు మొదలెట్టాడు. ఎలా కుదిరిందో ఏమో ఆ దేవుడికే తెలియాలి. ఇద్దరూ ప్రెసిడెంటు కళ్ళుకప్పి రంకుసాగిస్తున్నారు.', అంది మాలక్ష్మి

"నిజంగానా!" నమ్మలేక అడిగాడు.

"నిజందొరా!" చెప్పింది.

"నువ్వు చూశావా?"

"కాబట్టే ఖచ్చితంగా చెపుతున్నాను."

"నాకీవిషయం తెలిసినట్టుగానీ, నాకు చెప్పినట్లుగానీ ఎవ్వరికీ తెలియనివ్వకు. జాగ్రత్తగావుండు. వస్తాను." అని అక్కడ్నుంచి బయలుదేరాడు రాయుడు. రోడ్డుపైకొచ్చి సైకిలు తీసుకొని ఎక్కాడు. ఊరివైపు పోనిచ్చాడు.

దొంగలు చెట్టెక్కి ఇంట్లోకి రావడం అసాధ్యమన్న విషయం పరిశోధనద్వారా తెలుసుకున్నాడు రాయుడు. మణికి తెలీకుండా తలుపులు ఎలా తెరవబడి వుంటాయన్నది ఆయనకు అర్థంకాలేదు.

మాలక్ష్మి చెప్పినమాట నిజమైన పక్షంలో, మణి డాక్టర్ రాకకోసం ఎదురుచూస్తూ తలుపులు తెరచిపెట్టివుంటుంది. అతను రాబోయేముందు దొంగలులోనికి దూరివుంటారు. ఆ తర్వాత డాక్టర్ వచ్చివుంటాడు. అతనూ, ఆమె రసకేళిలో మైమరచి వుండగా, అంతకుముందే లోనికిదూరిన దొంగలు తమపని ముగించుకొని వెళ్ళిపోయివుంటారు తలుపు తెరుచుకుని. అదే జరివుండాలని ఘట్టిగా నమ్మకం కలిగింది. ఒకవేళ డాక్టరే తీసివుంటాడా? అని ఆలోచించాడు రాయుడు. కాని

అతనికి ఆ అవకాశంలేదు. మణి అతనివెంటే వుంది. అందు వలన అది ఎవరో ఆరితేరిన దొంగలే చేశారనిపించింది.

ఆదొంగలకు రెండు విషయాలు తెలిసివుండాలి. ఒకటి ప్రసిడెంటు రాత్రికి పొలంపోవడం, రెండోది ఇంట్లో రెండు లక్షల రూపాయలు తెచ్చి వుంచడం. ఈ విషయం ఆయింటికి బాగా వస్తూపోతూ వుండేవాళ్ళకు తప్ప మరెవ్వరికీ తెలిసే అవకాశం లేదు.

ప్రసాదరావు ఇంటిముందు సైకిలాపి లోనికొచ్చాడు రాయుడు.

"రండి! రండి!" అంటూ ఆహ్వానించాడు ప్రసిడెంటు.

రాయుడు వెళ్ళి అతనికెదురగా కూర్చున్నాడు.

"ఏమయినా తెలిసిందా?"

"తెలుస్తుంది! తొందరపడి లాభంలేదు. మీయింటికి ఎక్కువగా వస్తూపోతూ వుండేవాళ్ళ పేర్లు చెప్పండి." అన్నాడు.

"నేను ప్రసిడెంటును. చాలామందికి ఏదోఒక అవసర ముంటుంది. అందువల్లవస్తారు. ఎవరినని ప్రత్యేకంగా చెప్పమంటారు".

"తమ పనులకోసం వచ్చి మాట్లాడేవారుకాదు. ఇంట్లో చనువుగా తిరిగేవాళ్ళు. పదేపదే పనికట్టుకొనివచ్చి పలకరించి పొయ్యేవాళ్ళు."

"మా చెల్లెలు, అతనిభర్త ప్రక్కవీధిలో వున్నారు. వాళ్ళు వస్తుంటారు. ఈ వూరి డాక్టరు నా భార్యకు ఇంజక్షనివ్వడానికి రోజూవస్తాడు. అంతే వేరే ఎవ్వరూ అంత ఎక్కువగా రారు."

"ఓమారు మీ శ్రీమతిని పిలవండి!" అన్నాడు రాయుడు.

ప్రసాదరావు "మణి! మణి!" అని కేకేశాడు.

"వస్తున్నా" అంటూ పలికిందామె లోపలినుండి. రాయుడు గుమ్మంవేపే చూడసాగాడు. ఆమె గుమ్మందగ్గరకు రాగానే తలత్రిప్పి ప్రసిడెంటువైపు చూస్తూ "ఈ వూరి డాక్టర్ గురించి మీ అభిప్రాయమేమంటారు?" అడిగాడు.

"చాలా మంచివారని అందరూ అంటారు. నేను అలాగే అనుకొంటున్నాను." అన్నాడు ప్రసిడెంటు.

"నమస్కారమండి!" అందిమణి దూరంగా నిలుచుని.

ఆమెకు రాయుడు దొంగతనం జరిగిన పరిస్థితుల్ని వివరంగాచెప్పి "మీకోసం ఎక్కువగా వచ్చేవాళ్ళెవరయినా వున్నారా? ముఖ్యంగా నిన్న ఎవరెవరు వచ్చారు. వాళ్ళతో మీరు మాటల సందర్భంలో ఇంట్లో డబ్బుపెట్టారన్న విషయం ఏదైనా చెప్పారేమో, గుర్తుచేసుకోండి." అన్నాడు.

మణి చాలాసేపు ఆలోచించి "నిన్న ఎవరూ రాలేదండీ! ఎవ్వరితోనూ డబ్బుగురించి చెప్పనుకూడాలేదు." అంది.

"నా పరిశోధన ఎటూ ముందుకు జరగడంలేదు. పోనీలెండి. మీ ఆరోగ్యం బాగుంటూందా?" అడిగాడు రాయుడు.

"లేదండీ! కాస్త నలతగావుంటే డాక్టర్‌గారి దగ్గర మందు తీసుకుంటున్నాను."

"అసలు జబ్బేమంటారు?"

"అదేదో ఇంగ్లీషుపేరు చెప్పారు. ప్రతిరోజూ ఒక ఇంజక్షను ఇవ్వాలన్నారు."

"ఈ డాక్టర్ హస్తవాసి చాలా మంచిదని విన్నాను. మీ జబ్బు త్వరలోనె నయమవుతుందిలెండి!" అంటూ లేచాడు రాయుడు.

"కాఫీ త్రాగి వెళ్ళండి!" అన్నాడు ప్రసిడెంటు.

"వద్దండీ ఇంతకు ముందే త్రాగాను." అని కదలబోతూ

"మణెమ్మగారూ ఒక్కవిషయం అడగడం మరచిపోయాను. రాత్రి మీవారు వెళ్ళాక మీరు తలుపులు వేసుకున్నారు. ఆతర్వాత మాలక్ష్మి వచ్చి చాలాసేపు తలుపు తట్టిందట మిమ్మల్ని పేరుపెట్టి పిలిచిందట. ఎంతకూ తలుపు తీయక పోతే తిరిగి వెళ్ళిపోయిందట. మీగదిలో మాత్రం లైటు వెలుగుతుండడం తను గమనించిందట. అంటే మీరు మేలుకొనే వుండివుండాలి.

ఆటయిమ్‌లో మీకేవిధమైన చప్పుళ్ళుగానీ, శబ్దాలుగానీ వినిపించలేదా' అని అడిగాడు రాయుడు.

ఆప్రశ్నవినగానే మొఖం అదోలా పెట్టింది. జవాబు వెంటనే చెప్ప లేకపోయింది. మాటల కోసం తడుము కోసాగింది. మెల్లగా గుండె పదిలపరుచుకొని "రాత్రితలుపులు వేసుకొని పుస్తకం తీశాను చదవుదామని. వెంటనే నిద్రముంచు కొచ్చింది. పడుకున్నాను అలానే" అందిమణి.

"అంటే ప్రొద్దున్న ఆలైటు ప్రసాదరావుగారొచ్చి ఆర్పేసి వుండాలి" అన్నాడు రాయుడు.

"లేదండీ! నేనొచ్చేసరికే లైటు ఆర్పేసివుంది." అన్నాడు ప్రసిడెంటు.

"మధ్యలో మెలుకవ వచ్చింది. లేచి బాతురూంకు వెళ్ళాను. తిరిగి పడుకునేప్పుడు లైటార్పివేశాను." అందిమణి.

"అంటే అదే అర్ధరాత్రి జరిగుండాలి. అప్పుడు కూడా మీరు ఏవిధమైన శబ్దం వినలేదా?"

"లేదండీ!" అందిమణి.

"మీవారులేనప్పుడు ఒంటరిగా ఇంతపెద్ద ఇంట్లో వుండటం భయంగా వుండదూ. అడిగాడు రాయుడు.

"నాకుచచ్చే భయమండీ. ఎవర్నో ఒకర్ని తోడుంచు

కుంటాను."

"మరి రాత్రి మీవారు పొలంవెళ్ళా మాలక్ష్మినిపంపు తానని చెప్పారుగా. ఆవిడవచ్చిందాకా మీరు వెయిట్‌చేసివుండొచ్చుగా. నాకుతెలిసిందాన్నిబట్టి ఆమె ఇక్కడకు చేరుకునేందుకు అరగంటకన్నా తక్కువకాదు పట్టివుండాలి. ఆకాస్తసేపు నిద్ర తట్టుకో గలిగివుంటే మీకు తోడు దొరికుండేది." అన్నాడు రాయుడు.

మణికి ఇన్‌స్పెక్టర్ మాటలు కొంత భయాన్ని, అను మనాన్ని కలిగించాయి. రాత్రింతనెలావున్నది ఎందుకింత వివరంగా అడుగు తున్నాడో అర్థంకాలేదు. అతనికెవరైనా తనరహస్యం చెప్పారేమోనన్న అనుమానం వచ్చింది.

రాయుడు అక్కడ్నుంచి కదిలాడు.

# 5

ప్రసిడెంటుగారింట్లో దొంగలుపడి అప్పుడే మూడురోజులయి పోయింది. పోలీసులు ఊరంతా తెగ తిరుగుతున్నారు.

అనుమానమున్న ప్రతిమనిషినీ స్టేషనుకు లాక్కొచ్చి రకరకాల ప్రశ్నలడిగి తమ సందేహాలునివృత్తి చేసుకొనిపంపుతున్నారు. కానీకేసుముందుకు కదలడం లేదు. ఆరోజు మిట్ట మధ్యాహ్నం. ఎండ ఎర్రగా మండుతూంది.

స్టేషన్‌ముందు నుండి ఒంటినిండా పైటకొంగు కప్పుకొని పోతున్న మణెమ్మ కనిపించింది. స్టేషన్‌లో వుండే చూశాడు రాయుడు.

మఫ్టీలోవున్న కానిస్టేబుల్‌నుపిలిచి ఆమె ఎక్కడికి వెళుతూందో చూసిరమ్మని పురమయించాడు.

మణెమ్మ ముందు కానిస్టేబుల్ వెనక నడవడం మొదలెట్టారు. ఆవీధి చివరి కంటాపోయి, ప్రక్కకుతిరిగి దూరంగా

వున్న దయానిధి ఆసుపత్రి వేపు వడచింది ఆమె. కానిస్టేబుల్ వెనక్కి వెళిపోయాడు ఆ విషయంచెప్పేందుకు.

మణెమ్మ లోపలికెళ్ళుతూ చూసింది. వెలుపల అందమైన కారుంది. ఆవూరిదిగాదది. అసలు ఆవూళ్ళో ఎవురికీ కార్లు లేవు. ప్రక్కవూరివాళ్ళెవరైనా వచ్చి వుంటారను కొంటూ, లోనికెళ్ళి, విజిటల్‌రూంలో కూర్చుంది.

విమల వచ్చి చూసి "మీరా?" అంది ఆశ్చర్యంగా.

"నేనే! డాక్టరుగారు ఫ్రీగా వున్నారా?"

"లేరు ఎవరో పేషంటును చెక్‌చేస్తున్నారు." అంది విమల కూర్చుంటూ.

"ఆడవాళ్ళా? మగవాళ్ళా"

"ఆడవాళ్ళే! వీరాపురం జమీందారు గారిభార్య సుజాత."

ఆ మాట వినగానే ఆమెలో అసూయ, అనుమానం కలిగాయి. మొదటిరోజు తను మందుకోసం వచ్చినప్పుడు జరిగినసంఘటనలు గుర్తొచ్చాయి. దయానిధి పరీక్ష చేస్తున్నట్లే నటించి, అనవసరంగా బుగ్గగిల్లి రొమ్ములుతాకి, తొడలుగీరి, తన్ను ఉద్రిక్తురాల్ని చేశాడు. తను మత్తెక్కి పోయిన విషయం తెలుసుకొని మందివ్వడం విషయం మానేసి ఆనందమందించే ప్రయత్నంలో పడ్డాడు. తను భయపడింది ఆవిషయం చెప్పింది. ధైర్యం చెప్పాడు. వెళ్ళి తలుపులకు గొళ్ళెం పెట్టి వచ్చాడు. ఆ తర్వాత జరిగింది తను చూళ్ళేదు. శరీరం మాత్రం హాయిలో ఆనందంలో తేలియాడింది. వరుసగ రెండు రోజులు హాస్పిటల్‌లోనే ఆ అనుభవం దొరికింది మెల్లిగా ఇంటికి వెళ్ళే ఏర్పాటుచేసుకున్నాడు. లోపలున్నది ఆడపేషంటని చెప్తానే, అందులోనూ ఆమె వీరాపురం జమీం దారు భార్యన్నాక, దయానిధి ఆమెను అలాగే చేస్తున్నాడేమో

నన్ను అసూయ పుట్టింది.

"ఆమె వచ్చి చాలాసేపయిందా?" అడిగింది మణి.

"ఆఁ! అరగంటయింది." అంది విమల

"మీరిక్కడే వున్నారే: ఆయన కేదైనా అవసరమవుతుందేమో? ప్రక్కనే వుండలేక పోయారా?"

"వారు అలా వుండనివ్వరు. తన పనికి అడ్డంగా వుంటుందని, అవసరమైతే పిలుస్తానని చెపుతారు. అందుకనే నేను ఎప్పుడూ వుండనక్కడ."

"అలాగా! ఇంకా చాలాసేపు పడుతుందేమో పరీక్ష!" అంది వ్యంగ్యంగా.

"మీరు చేయించుకొన్నారుగా ఆయన దగ్గర పరీక్ష. దాని సంగతి మాకు క్రొత్తేం కాదు. లేకపోతే ఆమె జమీందారు గారి భార్య. అందంగా వుంటుంది. ఆరేళ్ళనుండి కడుపు నొప్పితో బాధపడుతూంది. ఇంకొంచెం ఓపిగ్గా, ఎక్కువసేపు పరీక్షచేస్తారేమో? అంతే!" అంది విమల.

విమల మాటలు సూటిగా తగిలాయి మణికి. ఆమె వ్యంగ్యంగా తన్నుద్దేశించే అంటుందని అర్థమయింది. ఆమెతో గొడవపడి అనవసరంగా రభస పడటం ఇష్టంలేక నోరు మూసుకుంది.

"మీకు ఇంజక్షనేగా! నన్నిమ్మంటారా?"

"వద్దు. అదేం సరిగ్గా పనిచేయడం లేదు. చూపించి వేరే మందు మార్చి ఇవ్వమని అడుగుదామని వచ్చాను." అంది మణి.

"అలాగా! కాసేపుండండి." అంతలో విమలలోని కెళ్ళింది.

ఆతర్వాత పదినిముషాలకు కన్సల్టింగ్ రూం తలుపులు తెరుచుకొన్నాయి సుజాత వెలుపలికొచ్చింది. మణి ఆమె కేసి

చూసింది. తనకన్నా ఆమె ఖచ్చితంగా అందమైనదేనన్న అభి
ప్రాయం కలిగింది. డబ్బు, హోదా తెచ్చిన పొంకంలో పొన్న
పూవులా మెరిసి పోతుందనిపించింది.

విమలకు వెళ్ళొస్తానని చెప్పి, రెండు మందు సీసాలు,
టాబ్లెట్ల పొట్లంను చేత్తోపట్టుకొని వెళ్ళిపోయింది వెలుపలకు.
ఆతర్వాత కారు కదలిన శబ్దమయ్యింది.

''డాక్టర్‌గారు ఫ్రీగా వున్నారు. మీరూవెళ్ళి పరీక్ష
చేయించుకోండి.!'' అంది విమల.

మణికి కోపం ముంచుకొచ్చినా తమాయించుకొని వెళ్ళింది

''ఓహో! నువ్వా? ఏమిటిలా వున్నట్టుండివూడివడ్డావ్?''
అడిగాడు దయానిధి. లోపికొచ్చిన మనిషిని చూసి.

''మీ రాసక్రీడకు అడ్డొచ్చానా?'' అడిగింది ఎదురుగా
కూర్చుంటూ.

''ఏమిటామాటలు?''

''మీ చేతలేమిటి ఆ సుజాతను గంటనుంచి పరిక్షిస్తూనే
వున్నారా? నాకులాగే పరీక్షించివుంటారు.'' అంది కోపంగా.

''తప్పు! ఆమె అటువంటిదికాదు.'' అన్నాడు దయానిధి.

''అంటే! నేను అటువంటిదాన్ననా నీఅభిప్రాయం.''

''అదికాదుమణీ! ఆమెను చూస్తే నాకటువంటి దృష్టి
గానీ, అభిప్రాయంగానీ, చివరకు ఉద్రేకంగానీ కలుగవు!''

''అదేం పాపం! ఆమె నాకన్నా అందంగావుంది. యవ్వనం
లో వుంది.''

''ఆమె గొడవ ఎందుకు? ఇంతకూ మీరొచ్చినపని చెప్పండి''

''ఏంలేదు ఆ పోలీసుఇనస్పెక్టరుకు అనుమానంగావుంది.''
అంది మణి.

''ఎవరిపైన?''

"మనపైన."

"నాన్సెన్స్! ఎందుకలాగనిపించింది నీకు?"

"మన ఇద్దరం అక్రమంగా కలుసుకుంటున్నట్లు అతనికి ఎవరో నిక్కచ్చిగా చెప్పారు. ఆరాత్రి నువ్వు నాతో నాయింట్లో గడిపినట్లు సాక్ష్యం సేకరించి వున్నట్టుంది. దొంగలెవరో తీసి వున్న తలుపులద్వారానే లోనికొచ్చి, పనిముగించుకొని వెళ్ళి పోయారని నమ్మకంగా వున్నట్లుందాయనకు. నానాప్రశ్నలడిగి నా ప్రాణాలు తోడేశాడు." అంది మణి.

"మనల్నేం చెయ్యలేడు."

"దొంగతనం మాటటుంచి మనగుట్టు రట్టయితే మా వారు నీతల నాతల తెగనరికి మాయింటిముందున్న వేపచెట్టుకు వ్రేలాడగడతాడు అంది మణి.

"అయితే నన్నేం చెయ్యమంటావ్?"

"ఆ సుజాత సంగతి కొన్ని రోజులు మరచి మన రహస్యం ఆ రాయుడుగార్ని దాటి వెలుపలకు రాకుండా చూచే బాధ్యత మీది."

"అసలు మనవిషయంకూ, దీనికి ఏమిటి సంబంధం?"

"మీకోసం తలుపులు తీసిపెట్టాను. మీకన్నాముందు దొంగలు లోనికొచ్చివుంటారు. ఆతర్వాత మీారు మేడపైకి రాగానే వాళ్ళు తమపని పూర్తిచేసుకొని తలుపుతెరుచుకొని వెళ్ళిపోయివుంటారు. అందువల్ల మన రహస్యంకు దీనికీ అవినా భావ సంబంధ మేర్పడింది." చెప్పింది మణి

"లోపలికి రావచ్చా?" అని ఎవరిదో కంఠం వినిపించ గానే మణి, దయానిధి గుమ్మంకేసి చూశారు. ద్వారబంధం నిండిపోయి నిల్చున్న రాయుడు కనుపించాడు. అతన్ని చూడ గానే బిక్కచచ్చిపోయారిద్దరూ.

"రండి! రండి! అక్కడే నిల్చున్నారే? ఎంతసేపయ్యింది వచ్చి." అడిగాడు దయానిధి.

"మీరేదో మాట్లాడుకొంటున్నారు." అంటూ ఆగాడు.

"ఆవిడ అనారోగ్యం గురించి కారణాలు చెపుతున్నాను." అన్నాడు దయానిధి.

"నేను వెళ్ళొస్తానండీ! మీరు చెప్పినట్లే తీసుకుంటాను మందులు." అంది మణి.

"ఆఁ! ఆఁ! నేనువచ్చి చూస్తాన్లెండి. కంగారుపడకండి, జబ్బు తగ్గుతుంది. కానీ టైమ్ పడుతుంది." అన్నాడు కంగారు కంగారుగా.

మణి తలొంచుకుని వెళ్ళిపోయింది.

దారిలో ఎదురొచ్చి విమల "వెళ్తున్నారా?" అంది.

"ఆఁ!" అంటూ తలూపింది.

"పరీక్ష మధ్యలో వుండగానే వచ్చాడా రాక్షసుడు. అప్పటికీ చెప్పాను. వినకుండా వచ్చేశాడు." అంది విమల.

ఆమె మాటలు వినకుండా వీధిలోకురికింది.

"ఏంటి? ఇంత దూరం వచ్చారు?"— అడిగాడు దయానిధి.

"నాక్కూడా ఒంట్లో నలతగా వుంటూంది. రెండు రోజాలనుండి నీరసంగా ఉంది. మీకు చూపించుకొని ఏదైనా మందు తీసుకుందామని వచ్చాను." అన్నాడు రాయుడు.

ఆమాటతో దయానిధికి గుండె నిమ్మళించింది. గబగబచెక్ చేసి బి. కాంప్లెక్స్ టాబ్‌లెట్సు పది తీసిఇచ్చి "రోజా కొక్కటి చొప్పున వేసుకోండి. నీరసం తగ్గిపోతుంది" అన్నాడు.

"థాంక్స్! వస్తాను." అన్నాడు రాయుడు.

ఇన్‌స్పెక్టర్‌ని వీధి దాకా సాగనంపి తిరిగి లోనికొచ్చి

కూర్చునాడు.

సుజాతను తన దారికి తెచ్చుకోవడం కష్టమయింది. ఆమె ముందు పోరాడింది. అరచి అల్లరిచేస్తానని బెదరించింది. తను పట్టు వదలకుండా, పని సాధించుకొన్నాడు. అంతా అయ్యాక చప్పబడిపోయి రోజా వస్తావంది.

కథ రసకందాయంలోవుండగా, పానకంలో పుడకలా ప్రత్యక్ష మయింది మణి. ఆమె సులభముగానే జరిగింది గ్రహించింది. ఆమెతో మాట్లాడుతుండగా రాయుడు రావడం అతన్ని కుదిపి వేసింది భయంతో. ఏమేం ప్రశ్నలడుగుతాడో నన్న భయంతో బిక్కచచ్చి కూరున్నాడు. అతను వెళ్ళేదాకా మనస్సుకు ధైర్యం చిక్కలేదు.

మణి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.

ప్రసాదరావు మోటుమనిషి. అతనికి తన రహస్యం తెలిస్తే ఏం జరిగేది మణిని లోబరుచుకునేప్పుడు ఊహించకున్నా తర్వాత తెలుసుకున్నాడు. రాయుడు నోరు మూసుకునే విధాన మేమన్న చిక్కుతుందాని ఆలోచించ సాగాడు.

జరిగిన విషయం వివరంగా చెప్పి, కొంత డబ్బు అతని మొహానకొడితే నోరు మూసుకుంటాడేమోనన్న ధైర్యం కలిగింది. రాయుడు చాలా స్ట్రిక్ట్ మనిషని అందరు అంటారు. అతను లంచం తీసుకొనే జాతికిచెందిన వాడుకాకుంటే చిక్కే ఏం చేయుడమాని అలోచిస్తు కూర్చున్నాడు.

రకరకాల పథకాలు మెదిలాయి. ఒక్కటీ సరయిందిగా తోచలేదు. అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు.

# 6

దొంగతనం జరిగి ఐదు రోజులయింది.

రాయుడి కేవిధమైన క్రొత్త క్లూ దొరకలేదు. ఏలూరు

నుండి ఫోనొచ్చింది. మాట్లాడాడు. ప్రసాదరావుగారి దగ్గర దొంగిలించిన డబ్బులోని నంబరుగల వందరూపాయల కాయితం ఒకటి బ్రాందీషాపు యజమాని ఒకతను బాంక్‌లో కడుతుంటే పోలీసులు స్వాధీనం చేసుకున్నారనీ, వెంటనే రావలసిందనీ, కబురు చేశారు.

హెడ్ కానిస్టేబుల్‌కు అన్నీచెప్పి, రాయుడు ఏలూరుకు బయలుదేరాడు. సాయంత్రానికి ఏలూరు చేరుకున్నాడు.

బ్రాందీషాపు యజమానిని రిమాండులో వుంచిపెట్టారు. అక్కడి సర్కిల్ ఇన్‌స్పెక్టరు రాయుడుతో అంతాచెప్పి, "అతను ఏమీ చెప్పడంలేదు." అన్నాడు.

"నేనూ ప్రయత్నిస్తాను." అన్నాడు.

"మీయిష్టం" అంటూ లేచాడు.

ఇద్దరూ రిమాండు రూంకు బయలుదేరారు.

సన్నగా పొడుగ్గావున్న మనిషి కటకటాల వెనుక పచార్లు చేస్తూ కనుపించాడు. తలుపు తెరిపించాడు రాయుడు. అతన్ని రమ్మన్నాడు. ఆఫీసుగదిలోకి తీసుకొచ్చి ఎదురుగా కూర్చో పెట్టి అన్నాడు.

"ఆ వందరూపాయల కాగితం ఇచ్చిన మనిషెవరో నీకు తెలీదంటావు. అంతేనా?" అడిగాడు రాయుడు.

"అవునండీ!"

"నువ్వు పేపరు చదువుతావా?"

"ఆఁ!"

"ఏం పేపరు చదువుతావు?"

"ఆంధ్ర పత్రిక"

"రోజూ చదువుతావా?"

"చదువుతానండీ!"

"నాల్రోజులనుండి పాండవపురంలోజరిగిన దొంగతనంలో పోయిన రెండులక్షల రూపాయల తాలుకు నోట్ల నెంబర్లు వేస్తోంది ప్రభుత్వం. అది గమనించావా?"

"లేదండీ" తల అడ్డంగా త్రిప్పుతూ అన్నాడు.

"నీ బార్‌లో రోజు సేల్స్ ఎంతవుంటాయి?"

"తొమ్మిది వందలదాకా వుంటుంది."

"నిన్న మొత్తం వసూలయిన డబ్బులో ఎన్ని వంద కాగితాలున్నాయి."

"రెండు."

"వాళ్ళు బహుశా నీముందు నిలచివుండాలి చిల్లరకోసం కాగితం తీసుకొని చూసుకొని గల్లాపెట్టెలో వేసుకొని మళ్ళీ చిల్లరతీసి లెక్కపెట్టి యివ్వాలినువ్వు ఇదంతా చేసేందుకు చాలా టయిమ్ పట్టాలి. అంతసేపూ ఆనోటిచ్చినమనిషి నీకెదురుగా నిలుచునే వుంటాడు. అతన్ని'ఇష్టంలేకున్నా ఎక్కువ సేపు చూడక తప్పదు అంటూ? అడిగాడు రాయుడు.

"అవునండీ!"

"అయితే ఆనోటిచ్చిన ఇద్దర్నీ నువ్వు చూసివుండాలి. బాగాగుర్తుతెచ్చుకో. వాళ్ళు ఎలా వుంటారో చెప్పు." అన్నాడు.

"ఎంత ఆలోచించినా గుర్తురావడం లేదండీ!" అన్నాడు అతను మొండిగా.

రాయుడు అతని కళ్ళల్లోకి సూటిగా చూశాడు. ఆ చూపులకు తట్టుకొనలేక కళ్ళు క్రిందికి దించు కొన్నాడు అతను.

ప్రక్కనవున్న ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగి "ఇతను అమాయకుడు ఏం తెలిసినట్లుగాలేదు. అనవసరంగా రిమాండులోవుంచి ప్రయోజన మేమిటి? వదిలేదాం?" అన్నాడు కన్నుగిట్టి

అతను అర్థంచేసుకొని "నాకానమ్మకం లేదు సార్! కానీ మీరు వదలమంటే వదుల్తాను." అన్నాడు.

"వది లెయ్యండి." అంటూ "చూడు. నిన్ను వదిలెయ్యమనిచెప్పాను. నీకు ఆమనిషిగుర్తొచ్చినా. లేదా కనిపించినా లేదూ మాకుచెప్పాలనిపించినా, వచ్చి సమాచారం అందజెయ్యి," అన్నాడు రాయుడు.

'అలాగేసార్" అంటూ అక్కడ్నుంచి పరుగెత్తాడు అతను.

అతని వెనుక మఫ్టీలోవున్న కానిస్టేబుల్ వెళ్ళడం చూసి రాయుడు తృప్తిగానవ్వుకున్నాడు.

"అతన్నెందుకు వదిలెయ్యమన్నారు. నాకు అర్థం కాలేదు!" అన్నాడు సి. ఇ.

"అతనికానోటిచ్చిందెవరో తెలుసు. బహుశా ఆ మనిషి రోజూ అతని బార్ లోనే త్రాగుతూండి వుంటాడు. అందు వల్లే చెప్పడానికి ఇష్టపడడం లేదు. మనకు చెప్పినందువల్ల రెండు నష్టాలు. వందరూపాయలు పోవడంతో పాటు, అతన్ని పట్టిచ్చినట్లవుతుంది. అవతలి మనిషి పగ పెట్టుకొని, ఇతన్నే మయినా చేస్తాడని భయంవుండి వుంటుంది. అందుకే వదిలెయ్య మన్నాను. ఇక్కడ్నించి తిన్నగా అతని దగ్గరకే వెళ్తాడు. మన మనిషి వెంట వెళ్ళాడు కాబట్టి ఆ వంద కాగితం మార్చిన మనిషిని మనం సులభంగా పట్టుకోవచ్చు." అన్నాడు రాయుడు.

"మీది మంచి ఆలోచనే!" అన్నాడు సి. ఇ. అతనికి రాయుడి గురించి బాగా తెలుసు.

అరగంట తర్వాత వచ్చాడు మఫ్టీలో వెళ్ళిన కానిస్టేబుల్.

"ఏమయింది?" అడిగాడు రాయుడు.

"రైలు పేటలోని పాడుబడ్డ ఇంటికి వెళ్ళాడు సార్.

ఆయింటికి తాళం వేసివుంది. పక్కవాటాలో వాళ్ళతో రెండు నిముషాలు మాట్లాడి తిరిగి వెళ్ళిపోయాడు తను. నేను ఆయింట్లో ఎవరుంటున్నారని అడిగాను ప్రక్క వాటా వాళ్ళను. ఎవరో ఒక తను వుంటున్నాడనీ, ఇష్టమొచ్చినప్పుడు వచ్చి పోతుంటాడని చెప్పారు." అన్నాడు.

"గుడ్! మీరు అతన్ని ఎలాగైనా పట్టుకొని నాదగ్గరకు పంపండి. మిగిలిన విషయాలు నేను చూసుకుంటాను. ఈ వూళ్ళోనే మనకు కావలసిన వాళ్ళచిక్కేటట్లున్నారు. అన్నిబ్యాంక్ లకు కాస్త జాగ్రత్తగా వందరూపాయల నోట్లు చెక్ చెయ్యమని చెప్పండి." అన్నాడు రాయుడు.

"అలాగే!" అన్నాడు సి. ఇ.

"నేను వస్తాను. నాకు ఊళ్ళో చాలా పనులున్నాయి." అని సెలవు పుచ్చుకున్నాడు.

బస్ స్టాండుకొచ్చి బస్సుకోసం నిలబడ్డాడు. రాఘవపురం నుండి రావలసిన బస్సు మరో అరగంటదాకా లేదని చెప్పాడు స్టాండ్‌సూపర్‌వైజర్.

ఆకలిగా వున్నట్లనిపించింది. టిఫిన్ తిందామని హోటల్‌కు వెళ్ళాడు. దోశతెమ్మనిచెప్పి వెలుపలకి చూస్తూ కిటికీవారగా కూర్చున్నాడు.

పదిహేనునిముషాల తర్వాత వచ్చిందిదోసె. తింటూ అప్పుడప్పుడు బస్ వచ్చిందేమోనన్న అనుమానంతో చూస్తూ వున్నాడు రాయుడు.

# 7

బస్సొచ్చింది.

అందరికన్నా ముందుదిగిన ఒకడాక్టర్ దయానిధి కనుపించాడు అతని చేతిలో చిన్న బ్రాండ్‌కేస్ వుంది.

రాయుడు ఆగిపోయాడు.

డాక్టర్ వున్నట్టుండి వచ్చాడెందుకో అనుకున్నాడు. తినడం ఆపేసి, లేచాడు. రూపాయి కాగితం కౌంటర్‌లో పడేసి వెలుపలికొచ్చాడు. దయానిధి, రిక్షావాడితో బేరం చేయసాగాడు.

వెనకగావెళ్ళి భుజంపైన చెయ్యి వేశాడు రాయుడు.

తలత్రిప్పి రాయుడ్ని చూసి అవాక్కయి పోయాడు దయానిధి.

"ఇప్పుడేనా రావడం?" అడిగాడు రాయుడు.

"అవునండీ! మీరెప్పుడొచ్చారు."

"ప్రొద్దునొచ్చాను. మన వూళ్ళో జరిగిన దొంగతనంలో పోయిన డబ్బుకు సంబంధించిన వందకాగితాలు కొన్నచిక్కా యిక్కడ. అవి మార్చేందుకు ప్రయత్నించిన వాళ్ళను పట్టు కున్నారు. వాళ్ళ ద్వారా ఏదైనా సమాచారం రాబడుదామని వచ్చాను." అన్నాడు రాయుడు.

"ఏమైనా తెలిసిందా?"

"లేదండీ! ఇంకా రిమాండ్‌లోనే వుంచాం. అన్నిరకాల పద్ధతులను ఉపయోగిస్తున్నాం. వాళ్ళచేత నిజం కక్కించడానికి. కానీ వాళ్ళు నోరు విప్పడంలేదు. ఇదంతా నిదానంమీదపని." అన్నాడు రాయుడు.

"మీరు ఊరికి వెళ్తున్నారా?" అడిగాడు దయానిధి.

"అవునండీ! ఈ బస్‌లోనే పోదామనుకుంటున్నాను."

"నాకేం పెద్దపనిలేదు. కొద్దిగా మందులు కొనాలి. తర్వాత బస్‌లో వచ్చేస్తాను. వుంటావా?" అడిగాడు దయానిధి

"మీరుండమంటే వుంటాను. తోడుగా వెళ్ళడం నాకు సరదాయే!" అన్నాడు రాయుడు.

మళ్ళీహోటల్‌లోకి వచ్చికూర్చున్నాడు. ఈమారు కాఫీ తెమ్మన్నాడు. అదివచ్చేలోగా పోలీస్‌స్టేషన్‌కు ఫోన్‌చేశాడు. ఏదైనా విశేషాలుతెలుస్తే అరగంటదాకా తను అక్కడేవుంటాననీ. చెప్పమనీ.

కాఫీ త్రాగుతూ, పేపరు చూస్తూ గడిపాడు.

సరిగ్గా అరగంటకల్లా వచ్చేశాడు దయానిధి. మందుల పాకెట్లతో.

బస్సొచ్చింది. ఇద్దరూఎక్కి కూర్చున్నారు డ్రైవరుకు వెనుకనున్నసీట్లో.

బస్సు బయలుదేరింది. ఏలూరు దాటింది.

"రాయుడుగారూ!" పిలిచాడు దయానిధి.

"ఏమిటి?" అన్నాడు.

"మీకోవిషయం చెప్పాలని నాల్రోజులనుండి చూస్తున్నాను. చెప్పాలంటే నాకే అవమానంగావుంది. కానీ చెప్పక తప్పదు. చెప్పినందువల్ల మీ పరిశోధనకు కొంత సహాయంగా వుంటుందనిపిస్తోంది."

"అయితే సందేహించడమెందుకు? చెప్పండి." అన్నాడు.

"నేను చెప్పేది చాలా పెద్ద రహస్యం. మీలోనే వుంచుకోండి."

"అలాగే! చెప్పండి."

"ప్రసాదరావు భార్య మణెమ్మకు నాకూ సంబంధముంది. వీలునుబట్టి ఆమె నాదగ్గరకు రావడం, నేనూ ఆమెదగ్గరకు పోవడంచేస్తుంటాము. దొంగతనం జరిగిన రోజురాత్రి నేను ఆమె ఇంటికి వెళ్ళాను. నాకోసం ఆమె తలుపులు తీసిపెట్టింది. నేను లోపలికెళ్ళాను. వెళ్తూ తలుపులు వేయడం మరిచాను. పైకెళ్ళాక మాధోరణిలో మేమున్నాం. దొంగలు

వాళ్ళపని పూర్తిచేసుకొని పోయారు.'!' అన్నాడు మెల్లిగా దయానిధి.

"మీరు కావాలనే నాకు ఆరోజు అబద్ధం చెప్తున్నట్లు అర్థం చేసుకున్నాను. కానీ దాన్ని ప్రేరేపించినది ఇంతపెద్ద రహస్యమనుకోలేదు. ఊరంతా మిమ్మల్ని దేముడంటారు. మరి మీరు........"

"మనిషినేగదండి. అదొక బలహీనమైన క్షణం. జరిగి పోయింది. ఆమెముందంజ వేసింది. నన్నునేను కంట్రోలు చేసుకోలేకపోయాను. నాకుతలచుకుంటే బాధగావుంది. అందుకే వీలయినంతత్వరగా ఈవూరినుండి మకాం ఎత్తేద్దామను కుంటున్నాను." అన్నాడు దయానిధి.

"డాక్టరుగారూ! నిజం చెప్పినందుకు చాలా సంతోషం. ఆరాత్రంతా చక్కగా చాలాసేపు మీరిద్దరూ మేలుకొనే వుంటారు. మీకు మనుషులు లోనికొచ్చిన శబ్దంగానీ, కదులు తున్న సవ్వడిగానీ వినిపించలేదా?" అడిగాడు రాయుడు.

"లేదండీ!"

"చిత్రంగావుందే?"

"మీకూ తెలియందేముంది. మేము తియ్యటి మత్తులో పడి ప్రపంచాన్నే మరచిపోయివున్నాం. అందువల్ల బహుశా వినిపించలేదనుకుంటాను." అన్నాడు రాయుడు.

ఉన్నట్టుండి బస్ ఆగిపోయింది.

"ఏమయింది?" అడిగాడు రాయుడు.

"వాళ్ళెవరో కారుకు రిపైరేసుకొంటున్నారు. అయినా కారుని రోడ్ కడ్డంగా పెడతారా. ప్రక్కన పెట్టుకుంటే బాగుండేదికదా!" అంటూ దిగాడు డ్రైవరు.

రాయుడు దిగాడు. అతని వెంట దయానిధికూడా దిగాడు.

ఆకారు వీరాపురం జమీందారుగారిదని చూడంగానే తెలుసుకున్నాడు దయానిధి. రాయుడికి చెప్పాడు. ఇద్దరూ కారు వద్దకెళ్ళారు.

జమీందారుగారు దయానిధిని పలకరించాడు. రాయుడ్ని కూడా పలకరించాడు.

"ఎక్కడికిసార్ ప్రయాణం?" అడిగాడు దయానిధి.

"మద్రాసు వెళ్తున్నానుసార్ నాల్రోజుల్లో వస్తాను. సుజాతకేదైనా నొప్పివస్తే, మీకు కబురు పంపమన్నాను. కాస్త చూస్తూవుండండి" అన్నాడు జమీందారు.

"అలాగే!" అన్నాడు దయానిధి.

రాయుడు డ్రైవర్ని కారు రోడ్ కడ్డంగా పెట్టినందుకు తిట్టాడు. వాడువణుకుతూ గబగబ పని ముగించి స్టార్టు చేశాడు.

బస్‌లోఎక్కి కూర్చున్నారిద్దరూ మళ్ళీ.

రాఘవపురం వచ్చింది.

"నా రహస్యం మీరు కాపాడాలి!" అన్నాడు దిగేముందు దయానిధి.

"అలాగే." అన్నాడు రాయుడు ముందు దిగుతూ.

# 8

దయానిధి చదువుకుంటూ కూర్చునాడు కన్సల్టింగ్ రూంలో. గంట పదకొండయింది.

కారొచ్చి ఆగినశబ్దం అయింది.

డ్రైవరు దిగి లోనికొచ్చాడు

"మిమ్మల్ని వెంటనే పిల్చుకు రమ్మన్నారు.,, అన్నాడు.

"మీ అమ్మగారికి మళ్ళీ నొప్పి వచ్చిందా?,,

"అవునండీ!" అన్నాడు.

విమల లైట్లు వెలిగించుకుంటూ వచ్చింది.

"వీరాపురం వెళ్తున్నారా?"

"ఆఁ!"

"నన్ను రమ్మంటారా?" అడిగింది విమల.

"ఎందుకూ నిద్రదండుగ. ఇంజక్షనిస్తే తగ్గుతుందానొప్పి వెంటనే వచ్చేస్తాను." అంటూ తనమెడికల్ చెస్ట్ తీసుకొన్నాడు చేతికి. వెళ్ళి కారెక్కాడు.

విమల లైట్లన్నీ ఆర్పుకుని పడుకుంది.

కారు పదిహేను నిముషాల్లో వీరాపురం చేరింది.

బంగళా నిర్మానుష్యంగా వుంది.

డ్రైవరు డోరుతీశాడు. దయానిధి దిగిలోనికెళ్ళాడు.

సుజాతకూడా పైన గదిలోవుంది.

"ఎవ్వరూ లేరుగా?" అడిగాడు చెస్ట్ టేబుల్ పైన పెడుతూ.

"లేరు." అంది సుజాత

"బయఁట డ్రైవరు మాత్రం వున్నాడు."

"వాడ్ని పంపిచేసేదా?"

"ఏమని చెప్తావు."

"ఏదో చెప్తాను." అంటూ ఉద్రేకం ఆపుకోలేక దయానిధి పైకొచ్చింది. ఆమెను పొదివి పట్టుకున్నాడు. అతనికి ఆమె పైనున్న వింతకోరిక చెవిలో చెప్పాడు. నవ్వింది సుజాత. వెళ్ళి తలుపులు మూసింది. కిటికికున్న కర్టెన్లు లాగింది. ఒక్కొక్కటి బట్టలన్నీవిప్పి మంచంపైన వేసింది. అల్మైరాతెరచి తనకున్న మొత్తం నగలు ధరించింది.

బంగారం రంగుతో మెరుస్తూన్న నగ్నమైన ఆమె శరీరం

పైన అలంకరించిన ఆభరణాలు వింతగా వెలిగాయి.ఆ దృశ్యాన్ని చూసి దయానిధి పిచ్చెక్కిపోయాడు అలాగే ఆమె పైనపడ్డాడు.

ఆట విడుపులో ఆమెనగలన్నీ తీసి దిండు క్రింద పెట్టింది బట్టలు కట్టుకొంది.

"ఇక్కడ మనం ఎక్కువసేపు వుండడం మంచిదికాదు. విూ డ్రైవరు అనుమానపడొచ్చు." అవసరమైన ఇంజక్షను కావాలనీ, అది హస్పటల్ లో వుందనీ, చెప్తాను. దానికోసం అక్కడికి వెళ్ళాలి రాత్రంతా అక్కడే వుండొచ్చు. అంతగా డ్రైవరు అడిగితే మళ్ళీ నొప్పివచ్చే ప్రమాదం వుందని చెప్తాను. అందువల్ల తెల్లవారిందాకా వుండడం మంచిదని అతన్నివెళ్ళి తెల్లారగట్ల రమ్మనిచెప్పి పంపిస్తాను." అన్నాడు దయానిధి "అలాగే!" అంది మత్తు పూర్తిగా వొదలని వొంటికేసిచూసుకుంటూ.

అనుకున్నట్లుగానే మరో పదిహేను నిముషాల్లో పాండవపురం చేరుకొన్నారు. పదినిముషాల తర్వాత కారును కూడా పంపేశారు.

ఆ రాత్రంతా ఆనంద సాగరంలో మునిగితేలారిద్దరూ.

వేకువ జామున డ్రైవరు కారు తెచ్చాడు. అందులో ఎక్కి వెళ్ళి పోయింది సుజాత వీరాపురానికి.

దయానిధి నిద్రకుపక్రమించాడు. విమల మేలుకునే వుంది. అంతా చూస్తూనే వుంది.

తెల్లవారుతూండగా రాయుడు వచ్చి తలుపు తట్టాడు విమల తీసింది తలుపులు.

"డాక్టరుగారున్నారా?" అడిగాడు.

"ఆఁ నిద్రపోతున్నారు."

"కాస్త మాట్లాడాలి!" అన్నాడు.

"అర్జంటా?."

"అవును."

విమల మారు ప్రశ్న వెయ్యకుండా లోనికెళ్ళి లేపింది. దయానిధి కళ్ళునులుముకుంటూ వచ్చాడు.

"సుజాత అదే వీరాపురం జమీందారు గారి భార్య రాత్రి ఇక్కడే వుండిందటగా. అక్కడ బంగళాలో దొంగలు పడ్డారు. ఆమె నగలు మొత్తం దాదాపు రెండులక్షలు చేసేవి ఎత్తుకు పోయారు. మనిషి వచ్చి చెప్పాడు. వస్తారా? వెళ్దాం!" అన్నాడు రాయుడు.

"చిత్రంగా వుందే! ఆమె నాలుగింటికి వెళ్ళినట్లుంది. రాత్రంతా నొప్పితో బాధపడుతూ వుండిందిక్కడే. నాలుగైదు ఇంజక్షను లిచ్చాను." అన్నాడు దయానిధి.

"త్వరగా రండి. వెళ్దాం!" అన్నాడు రాయుడు.

పది నిముషాల్లో స్కూటరెక్కి వెళ్ళా రిద్దరూ.

"పోలీసుల్ని పంపారా?"

"ఆఁ! వాళ్ళీపాటికీ చేరి వుంటారు." అన్నాడు రాయుడు. పది నిమషాల్లో వీరాపురం చేరుకున్నారు.

దొంగతనం చాలా సులభంగా జరిగిపోయినట్లు తోచింది. తలుపులు తెరిచే వున్నాయి. తిన్నగా సుజాత బెడ్ రూంకు వెళ్ళిపని ముగించు కొని వెళ్ళిపోయారు ఆ దొంగలు.

"బీరువా తాళాలు దానికే వ్రేలాడుతున్నాయి. తాళాలు మాములుగా ఎక్కడుంటాయి?" అడిగాడు రాయుడు.

"నాతలగడ క్రింద పెట్టుకుంటాను." అంది సుజాత.

"మీరు బీరువా తీసి మళ్ళా మూయడం మరచిపోయి వుండవచ్చు. ఆలోచించుకొని చెప్పండి."

"లేదండీ! నేను అది తెరచి చాలా రోజులయింది." అంది సుజాత.

"మీ పనివాళ్ళు వరిమీాదన్నా మీాకు అనుమానం వుందా?"

"అంతా నమ్మకస్తులు. చాలా రోజుల్నించి పనిచేస్తున్న వాళ్ళు."

"డ్రైవరు ఎలాంటివాడు. అతని కొక్కడికే తెలుసు మీారు తెల్లారిందాకా రారని. అతనికి దొంగతనం చేసే అవకాశం వుంది." అన్నాడు రాయుడు.

"అవకాశ మంటే వుంది. కానీ అతని తండ్రి తరాన్నించి మా దగ్గరే బ్రతికారు. ఇంత నీచానికి పాల్పడు తారని నేను అనుకోవడం లేదు." అంది సుజాత.

"మీా వారికీ విషయం తెలిపారా?"

"వైరిప్పించాను. సాయంత్రానికొస్తారేమో?

"ఈ ప్రాంతాల్లో ఈమధ్యజరుగుతున్న దొంగతనాలన్నీ చిత్రంగావున్నయి" అంటూ రూంలో కెళ్ళాడు. గది అంతా నిశితంగా పరిశీలించాడు. మంచాన్నిచూశాడు. తలగడలుపై కెత్తాడు. దాని క్రింద ముక్కుపుడక కనిపించింది, మిలమిల మెరుస్తూ. దాన్ని చేతికి తీసుకున్నాడు. వెలుపలికొచ్చాడు.

"ఇదిమీాదేనా?" అడిగాడు రాయుడు.

"నాదేనండీ?"

"ఇదెక్కడ పెట్టారు. బీరువాలోనేనా?

"అవునండీ! మిగిలిన వాటితో వీట్నికూడా పెట్టాను." అంది సుజాత. ఆమె చెప్తున్నది అబద్ధమన్న విషయం ఆఒక్క మాటతో బుజువయిపోయింది.

"రాత్రి డాక్టర్ను ఇక్కడికి పిలిపించారుగా? మళ్ళీ పాండవ పురం వెళ్ళారెందుకు?" అడిగాడు రాయుడు.

"నొప్పి తగ్గలేదు. ఎక్కువయింది. వేరేమందు ఇవ్వాలనీ అది ఎలా పనిచేస్తుందో చూడాలనీ చెప్పాడు డాక్టరు. అందు

వల్ల వెళ్ళాం.'' అంది సుజాత.

''సుజాతగారూ! మీరు పూర్తిగా నిజం చెప్పడం మంచిది జరిగింది జరిగినట్లు చెప్తే నాకు దొంగల్ని పట్టుకోవడం సుల భంగా వుంటుంది.'' అన్నాడు రాయుడు ఆమె కళ్ళలోకి చూస్తూ.

''నేను అబద్ధం చెప్తున్నాననుకొంటున్నారా. నగలు పోగొట్టుకొని కూడా అబద్ధాలు చెప్పే అవసరం నాకే ముంటుంది?''

''అది మీకు తెలియాలి. ఈ ముక్కుపుడక గురించి అడిగినప్పుడు దాన్ని ఖచ్చితంగా బీరువాలో పెట్టానని చెప్పారు.'' కానీ నాకది మీ తలగడ క్రింద దొరికింది. అది అబద్ధంకాదా?''

''లేదు! నేను మాత్రం బీరువాలోనే పెట్టాను.'' మొండి గా చెప్పింది సుజాత.

''ఆల్ రైట్. ఇప్పుడిక్కడ నేను చేయగలిగిందేమీలేదు. మీవారు వచ్చాక ఓసారి నన్ను కలుసుకోమని చెప్పండి.'' అన్నాడు రాయుడు లేస్తూ. అతనివెంట కానిస్టేబుల్ కూడా బయలుదేరాడు.

అంతా వెళ్ళిపోయారు.

# 9

'' ఇంత పొద్దున్నే వచ్చావేం ?'' అడిగింది విమల జనార్ధనాన్ని.

''నిన్ను చూడాలనిపించింది. అంతే వచ్చేశాను. డాక్టరు లేడా?

''లేడు వీరాపురం వెళ్ళాడు పోలీసులతో.''

''ఎందుకు?

''అక్కడ జమీందారిగారింట్లో దొంగతనం జరిగిందట

"డాక్టర్ ఏంచేస్తాడక్కడ?"

"నాకు తెలీదు!" చెప్పింది విమల.

జనార్దన్ మౌనంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఆకలిగావుంది. ఏమైనా వుంటే తినేందుకు పెట్టు." అన్నాడు జనార్దనం.

విమల లోనికెళ్ళి బిస్కట్లు, రొట్టెతెచ్చి అందించింది. అవితిని టీత్రాగి, వెళ్ళి పడుకున్నాడు.

ఆతర్వాత అరగంటకు దయానిధి వచ్చాడు.

"ఏమయింది?" అడిగింది విమల.

దొంగతనం విషయం టూకీగాచెప్పి లోనికి వెళ్ళాడు. తన తండ్రి వచ్చిన విషయం చెప్పాలనుకుంది. కాని అనవసరంగా నిద్రలోవున్న మనిషిగురించి ప్రస్తావించడం అనవసరమనుకొని వూరుకొంది.

ఆతర్వాత గంటసేపటికి సుజాత వచ్చింది. లోనికి వెళ్ళడం చూసింది విమల.

డాక్టర్‌గారి గదిబైట నిలుచుంది.

"ఎందుకొచ్చావ్" అన్నాడు కంగారుగా.

"రాయుడిగారిక్కి మనపైన అనుమానంగా వున్నట్లుంది. చిన్న అబద్ధం చెప్పాను. పట్టుకున్నాడు. నేనుమాత్రం నిజం చెప్పలేదు. చెప్తే మంచిదో కాదో అన్నఅనుమానం వచ్చింది. మిమ్మల్ని అక్కడే అడుగుదామనుకున్నాను. అతనివెంట మీరూ వచ్చేశారు అందుకని రాక తప్పలేదు." అంది.

"ఏంచెప్పాలనుకుంటున్నావ్?"

"మనిద్దరిసంగతిచెప్పి, మీరు నగలు వేసుకుంటే చూద్దామన్నారనీ, అందుకని బీరువాలోంచి తీసి, వేసుకొని, తిరిగితీసి, దిండుక్రింద పెట్టి, తిన్నగా పాండవపురం మీతో వచ్చేశానని

చెప్తాను." అంది సుజాత.

"వద్దు! దానివల్ల మన రహస్యం అందరికీ తెలిసే ప్రమాద ముంది." అన్నాడు దయానిధి.

జనార్దన్ వెనుకనుండి వచ్చి "ఏంది వింటున్నావ్?" అడిగాడు విమలను.

"డాక్టరుగారు ఎవరితోనో మాట్లాడుతున్నాడు.. ఏవి టాని వింటున్నాను." అంది విమల.

జనార్దనం మాటలు వినిపించి గబగబ వెలుపలికొచ్చాడ దయానిధి. చూచి భయంతో కంపించిపోయాడు.

"నువ్వా ? ఇక్కడే వున్నావా ?" అన్నాడు.

"ఆఁ!" అన్నాడు జనార్దనం.

"వెళ్తానన్నావుగా ?"

"అన్నాను. కానీ ఒంట్లో ఓపికలేదు. సాయంత్ర దాకా వుందామనుకొన్నాను. అన్నాడు" జనార్దనం.

"నీతో కొద్దిగా మాట్లాడాలి. రా!" అంటు ఆపరేషన్ చేసే గదిలోకి తీసుకెళ్ళాడు.

సుజాత కేమీ తోచలేదు.

వెళ్ళి ఫాన్ వేసి డాక్టరుగారి కుర్చీలో కూర్చుంది. తమషా టేబుల్ సొరుగు లాగింది. అందులో ఏమున్నాయోననుకుంటు చూసింది. కొన్ని టాబ్లెట్లు చిన్న మందు సీసాలు కనిపించాయి ఇంకొంచెం ముందుకు లాగింది సొరుగును.

కళ్ళు జిగేలు మనిపిస్తూ వజ్రాల హారం కనిపించింది చూడగానే అది తనదని గుర్తుపట్టింది. ఆ హారం అక్క కెలాగొచ్చిందో ఆమెకు అర్థంకాలేదు. అంతకు ముందు రా దయానిధి కోరిక తీర్చేందుకు తను ధరించింది. ఆ తర్వా తీసి తలగడ క్రింద పెట్టింది. మిగిలినవాటితో పాటు. త

చూస్తూవుండగా దయానిధి దాన్ని తీయలేదు. ముందు తనే క్రిందికి దిగి వెళ్ళి కార్లో కూర్చున్నాడు. అతని వెనుక వెళ్ళింది తను. అలాంటప్పుడు అతని చెతికీ హారం ఎలా వచ్చింది?.

ఆమె ప్రశ్నకు సమాధానం మనస్సు ప్రశ్నించగానే, గుండె దద్దరిల్లిపోయింది. ఆహారాన్ని అలాగే చేత్తోపట్టుకొని వెలు పలికివచ్చింది.

లోనికి వస్తున్న రాయుడు కనిపించాడు.

తిన్నగా ఆతని దగ్గరకువెళ్ళి హారం చూపించి "దొంగను పట్టుకుంటారా?" అడిగింది. ఆమె కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి.

"అందుకే వచ్చాను." అన్నాడు.

అక్కడే వున్న విమల కంగారుగా వచ్చి "ఎవరు సార్! ఆ దొంగ" అడిగింది.

రాయుడు విమల వేపు దయగా చూసి "నీకు తెలీని సత్యం చెప్పవలసివచ్చినందుకు బాధగావుంది. జనార్దనం నీకు తండ్రి అవుతాడా." అడిగాడు.

"అవునండీ!"

"అతనే దొంగ!"

"నిజంగానా?"

"నిజమేనమ్మా! ఈ డాక్టరు దొంగ డాక్టరు. ఇతను కలకత్తాలో ఒక పెద్ద డాక్టరు దగ్గర కాంపౌండరుగా పనిచేసే వాడు. అక్కడ మందులు దొంగిలించి అమ్ముకుంటుండేవాడు. దానికితోడు పేషంట్లనగలు కూడా కాజేసి వ్యభిచారం, జూదం, లాంటి పాడు అలవాట్లకు డబ్బువెచ్చించేవాడు. పోలీసులకు దొరికాడు. కేసుబుజువయింది. జైలుకెళ్ళాడు. అక్కడే మీ తండ్రి, మీ అమ్మను హత్యచేసి చంపిన నేరానికి శిక్ష అను

భవిస్తుండేవాడు. ఇద్దరుసన్నిహితులైనారు. అక్కడ్నుంచి విడుదలయ్యాక తిన్నగా ఇక్కడికొచ్చారు.'' చెప్పాడు రాయుడు.

''అవునండీ! అనాథశరణాలయానికి వచ్చారిద్దరూ. మా నాన్న వ్యాపారంలో పంజాబులో వున్నానని అబద్ధం చెప్పాడు నాకు. డాక్టరును కూడా అప్పుడే పరిచయంచేశాడు. నా నర్సు ట్రైనింగ్ కాగానే బలవంతంమీద తెచ్చి ఇక్కడ పెట్టాడు.'' అంది విమల.

''మీ నాన్న దొంగిలించిన నోట్లను మారుస్తుంటే చూసిన బార్ ప్రొప్రైయిటర్ మూలంగా మీ నాన్నను తెలుసుకున్నాము. అప్పట్నుంచి మేము అతని వెంటపడ్డాం. డాక్టరు వెళ్ళి అతన్ని రాత్రి రమ్మని చెప్పాడు దొంగతనంచేసేందుకు. జనార్ధనం ఆఖరి బస్సులో వచ్చి పాండవపురం నుంచి నడచి వెళ్ళాడు వీరాపురానికి. అతని వెంట వెళ్ళారు మా వాళ్ళు. కానీ నేనే జనార్ధనాన్ని ఆరెస్టు చెయ్యొద్దని చెప్పాను.'' అన్నాడు రాయుడు.

అంతలో లోపల్నుంచి జనార్ధనం, దయానిధి వెలుపలకొచ్చారు. రాయుణ్ణి చూసి విభ్రాంతులైనారు.

''తోడు దొంగలు అరుగో'' అన్నాడు రాయుడు.

''ఇన్స్పెక్టర్‌గారు!'' అరచాడు కోపంగా దయానిధి.

''నీ జాతకం, జనార్ధనం జాతకం రెండూ కలకత్తా నుండి రాత్రి వచ్చాయి. ఈ దెబ్బతో నీకు ఆజన్మ ఖైదు తప్పదు'' అన్నాడు. రాయుడు.

విమల వైపు చూడటానికి ఇద్దరికీ ముఖం చెల్లలేదు. తలొంచుకున్నారు. సుజాత కోపంగా వెళ్ళి దయానిధి చెంపలు వాయించింది. ఆమెవి పోయిందినగలుకాదు? పవిత్రమైన శీలం.

పరమనీచుడైన ఒక మోసగాడికి, పవిత్రంగావుంచు

కున్న శరీరం అప్పగించానన్న బాధకలిగింది. ఆ రాత్రి ఆమె శరీరం, వీరాపురం జమీందారు గారి ఇంటి ఆవరణలోని వేప చెట్టుకు వ్రేలాడింది.

—: ఐపోయింది :—

# మాయమైన మహల్!

సుజనశ్రీ

మాజీ లెఫ్టినెంట్ నిరంజనరావు చిరునవ్వు నవ్వాడు. అతడి కళ్ళుగూడా అతడి కెదురుగా కూర్చున్న లాయర్ కృష్ణ మూర్తిని హేళనగా చూస్తున్నాయ్.

''ఒరేయ్! నీకు ప్రతీదీ నవ్వులాటగానే ఉంటుందిరా! ఇంతకీ నీ నవ్వుకు కారణమన్నా చెప్పిఏడువు!'' అన్నాడు కృష్ణమూర్తి ఉడుక్కుంటూ.

''కాకపోతే ఏమిటిరా? వయసుమళ్ళినా నీకు డబ్బుమీద కాంక్ష తగ్గలేదు. నీ కొడుకు ఛార్టర్డ్ అకౌంటెంట్‌గా బోలె డంత సంపాదిస్తున్నాడు. నీ కుమార్తెను ఆటమిక్ ఎనర్జీలో పనిచేసే పెద్ద ఇంజనీర్‌కిచ్చి పెళ్ళిచేశావ్! హాయిగా కృష్ణా,

రావమా అంటూ కూర్చోక, ఇంకా కేసులూ, కోర్టులూ ఎందుకు నీకు?''

''కృష్ణమూర్తి నవ్వాడు. ''నీ ఇల్లు బంగారం కానూ! అదా నీ సందేహం! నిజానికి నేను కొత్త కేసుల్ని తీసుకోలేదు. అయిదారు నెలలనుంచి. కాకపోతే నాచేతిలో అయిదారుగురు లక్షాధికార్లున్నారు. కేవలం వాళ్ళ కేసులకే నా ప్రాక్టీసుని పరిమితం చేసుకున్నాను.''

''ఏదో ఏడువు! ఇంతకీ నన్ను ఉన్నఫళాన రమ్మని ఫోన్ చేశావు. ఎందుకట?'' నిరంజనరావు అడిగాడు.

''అదే చెప్పబోతున్నాను. ఇంతలో నీవు అడ్డుతగిలావు. ఈమధ్యన నా క్లయింట్ ఒకాయన చనిపోయాడు. అతడు రాసిన వీలునామా నాదగ్గరేవుంది. ఆ విల్లు ప్రకారం అతడికున్న స్థిరాస్థి చరాస్థులన్నీ అతడి రెండవభార్యకు జన్మించిన కుమార్తె, సుగుణకు చెందాలని వ్రాశాడు.'' కృష్ణమూర్తి ఆగాడు. ''మొదటి భార్యవలన అతడికి సంతానం లేదన్నాడు.''

''అంతవరకూ బాగానేవుంది, దీనికోసం నన్నురప్పించాల్సిన అవసరం ఏమొచ్చింది?''

''చెప్పేది పూర్తిగా విను. అతడు. సహజ మరణం పాలబటలేదనీ, హత్యచేయబడి ఉండొచ్చనీ నా అనుమానం.మనం ఇంకా కొద్దిసేపట్లో నా కంయింట్ ఎస్టేట్‌కి వెళ్ళబో తున్నాం. నీవు మిలిటరీలో పనిచేసి డిస్చార్జ్ అయినట్లూ, క్లిష్టమైన కేసుల్ని పరిశోధించి పోలీసులకు సాయం చేస్తుంటా వనీ! అక్కడ ఎవ్వరికీ తెలియనివ్వకుండా, కేవలం నా మిత్రు డిలా అక్కడకు రావాలి. వచ్చి ఏదైన ఆధారాలు, నా అనుమా నాన్ని బుజువుపరిచే సాక్ష్యాలు దొరుకుతాయేమో చూడాలి.''

''చంపావ్‌పో! పెద్దపనే పెట్టావ్ మొత్తానికి. అయితే

ఇంకా ఆలస్యం ఎందుకు? బయలుదేరుదాం పద! నిరంజన రావుకి ఏదైనా కేసు దొరికిందంటే చాలు, అన్నం, నీళ్ళుగూడా మరచిపోతాడు. అతగాడు తెలుగు డిటెక్టివ్ నవలలూ పత్రికలూ తెగ చదువుతాడు. అతడికి భార్య చనిపోయింది. ఉన్న ఒక్క కుమార్తెకు వివాహంచేసి హాయిగా ప్రశాంతి జీవితాన్ని గడుపు తున్నాడు.

"లేడికి లేచిందంటే ఎలా? మనను ఎస్టేటుకి తీసుకు వెళ్ళటానికి డాక్టర్ రాజారావు వస్తాడు."

"అలాగా! సరే! అతను వచ్చేలోపల కేసు వివరాలు చెప్పరాదూ ఇంకా వివరంగా!" నిరంజనరావు కుతూహలాన్ని ఆపుకోలేక అడిగాడు.

"ఇప్పుడింకేం చెప్పను. అదీగాక డాక్టర్ రాజారావు వచ్చే వేళగూడా అయింది. అందుకని నీవు ఇక్కడ డిటెక్టివ్ పోజు పెట్టి ప్రశ్నలు అడుగకు. ఎంత మౌనం అవలంబించితే అంత మంచిది."

"అదీనిజమే!" అంటూ నిరంజనరావు సిగరెట్ తీసి నోట్లో పెట్టుకున్నాడు. అగ్గిపుల్లగీసి సిగరెట్ వెలిగించాడు.

వకీలు గుమస్తా లోపలకు వచ్చాడు. "సార్! మీకోసం డాక్టర్‌గారు వచ్చారు. లోపలకు పంపమంటారా?" అని అడిగాడు.

"రమ్మను! రమ్మను! ఆయనకోసమే మేం చూస్తున్నాం" లాయర్ కృష్ణమూర్తి ఆతృత కనబరిచాడు.

డాక్టర్ రాజారావు లోపలకు వచ్చాడు. "నమస్కారం కృష్ణమూర్తిగారూ!"

"రండి! రండి! మీకోసమే ఎదురుచూస్తున్నాను. కూర్చోండి డాక్టర్! ఇతను నా ప్రాణమిత్రుడు నిరంజనరావు

ను. డాక్టర్ రాజారావు." ఒకరినొకరికి పరిచయం చేశాడు
ష్ణమూర్తి.

"హల్లో డాక్టర్! మిమ్మల్ని కలుసుకున్నందుకు నాకు
నందంగావుంది!" నిరంజనరావు చేయిజాపి డాక్టర్‌తో కర
ాలనం చేశాడు.

"నాకూ అలానే ఉంది!" డాక్టర్ అన్నాడు.

నిరంజనరావు డాక్టర్‌ని నఖశిఖ పర్యంతం చూశాడు.
ావుగా ఐదున్నర అడుగులఎత్తు, లావైనముఖం, గుడ్లగూబ
ాంటికళ్ళు, భూతద్దాలాంటి అద్దాల కళ్ళజోడు, అతన్ని
ూస్తూనే అనుమానంగా ఫీలయ్యాడు.

"ఇకమనం బయలుదేరుగావూ!" కృష్ణమూర్తి ఆమాట
ానంగానే ముగ్గురూ లేచారు. "నా ఫ్రెండ్‌కూడా మనతో
స్తున్నాడు." రాజారావుకేసిచూస్తూ అతి నిర్లక్ష్యంగా చెప్పాడు,

"అలాగా?" అంటూ ఆశ్చర్యపడినవాడిలా రాజారావు,
నిరంజనరావుకేసి చూశాడు ఎగాదిగా.

"అతడు అప్పుడప్పుడు ఏవైనా కేసులగురించి చెప్పమని
వేధిస్తూవుంటాడు. అందుకే అతడు మనవెంటరావడానికి
ఒప్పుకున్నాను. అతడికి కథలురాసే పిచ్చి ఉందిలెండి"!

"కేసా? ఇందులో కేసేముంది?" రాజారావు తొట్రుపాటుతో అడిగాడు.

"అదేనండి! నాక్లయింట్ కేసే గదా ఇది! సుగుణకు
చట్టరీత్యా చెందవలసిన ఆస్తిని జాగ్రత్తగా ఆమెకు అప్ప
జెప్పాలి గదా?"

"ఓహో అదా? అలాగే రమ్మనండి!" రాజారావు నిమ్మ
ళించాడు.

ఆతడి ఆదురా నిరంజనరావులో ఉత్సుకతనురేపింది.

ఏదో మిస్టరీని తను భేదించబోతున్నాడనే ఉద్ధృతి చేసుకున్నాడు.

ముగ్గురూ బయటకు వచ్చారు. డాక్టర్ రాజారావు బ్యూక్ కారు రోడ్డు మీద ఉంది. డాక్టర్ స్టీరింగ్ ముందు కూర్చున్నాడు. వెనక సీట్లో నిరంజనరావూ, కృష్ణమూర్తి కూర్చున్నారు.

## 2

కారు బయలుదేరింది.

నిరంజనరావు ఆలోచనలో పడ్డాడు. తన స్నేహితుడి క్లయింట్ లక్షాధి కారి, శివరాంప్రసాద్. అతడు మాజీ జమీం దారీ కుటుంబానికి చెందిన వాడు. అతడికీమధ్య సుస్తీ చేసింది. రెండు నెలల్లు మంచంలో తీసుకుని చనిపోయాడు. ఈ డాక్టరు రాజారావు కేవలం యల్. యం. పి. డిప్లొమాతో రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్! చనిపోయిన శివరాం ప్రసాద్ ఊఁ అంటే పేరు మోసిన యం: బి. బి. యస్, లేదా యం. ఎస్. డాక్టర్లు అతడికి వైద్యం చేయటానికి ముందుకు దూకుతారు. అటు వంటిది, ఈ డిప్లొమా డాక్టరు, పల్లెటూరి వైద్యుడు శివరాం ప్రసాద్‌కి ఎలా దొరికాడు.

కాదు, కాదు! ఈ వైద్యుడికే శివరాం ప్రసాద్ దొరికాడు. అంటే లక్షాధికారి క్లయింటుని పట్టేశాడు రాజారావు. పైగా అతడితో తనకు బాంధవ్యాన్నిగూడ సృష్టించుతున్నాడు, శివరాం, తనూ, పెద్ద తాత, చిన్న తాత మనుమలని చుట్టరికం కలుపుకున్నాడు. అంటే శివరాం ప్రసాద్ రాజారావు వరుసకు అన్న అవుతాడున్న మాట.

ఇంకా ఈ శివరాం ప్రసాద్ కుటుంబంలో రాజారావు మతిలేని అక్క, రాజారావు భార్య ఉన్నారు. వీళ్ళందరూ కలసి శివరాంని అతడి ఆస్తికోసం హత్య చేశారా!

రైల్వేస్టేషన్ ముందు కారు ఆగింది. ముగ్గురూ కారు దిగి ఎంక్వయిరీలోకి వెళ్ళారు. న్యూఢిల్లీ—మద్రాసు ఎక్స్‌ప్రెస్ కోసం వాకబు చేయగా అరగంట లేటుగా వస్తుందని తెలిసింది.

రైల్వే అడ్మినిస్ట్రేషన్ పై రాజారావు చిన్న లెక్చరిచ్చాడు, ఫ్లాట్ ఫారం మీద వెయిట్‌చేస్తూ. రాజారావు చేసేది డాక్టరు వృత్తే అయినా, అతడు అన్ని టాపిక్‌ల గురించీ మాట్లాడ గలడు. బహుశా అతడికి తెలియని సంగతే ఉండదేమో అనుకున్నాడు నిరంజనరావు.

రైలు వచ్చి ఆగింది. ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంటులోంచి దిగిన సుగుణను లాయర్ కృష్ణమూర్తి ముందుగా పలక రించాడు.

"ఈ రైలు చూస్తే లేటయింది. మీరు స్టేషనుకు వస్తారో రారో అని మథన పడుతున్నాను." అంది సుగుణ కృతజ్ఞతా పూర్వకంగా.

సుగుణ విజయవాడ లయోలా కాలేజీలో చదువుతున్నది. శివరాం ప్రసాద్ అస్వస్థతగా ఉన్నప్పుడు ఆమె వారం రోజుల పాటు వచ్చి ఉండి, తిరిగి వెళ్ళిపోయింది. కాలేజీ తరువున సాంస్కృతిక బృందంతో ఆమె గూడా కాశ్మీర్ పర్యటనకు వెళ్ళింది.

ఆమె పర్యటన పూర్తికాకుండానే శివరాం చనిపోయాడు. కాశ్మీర్‌లో ఉన్న సుగుణకు టెలిగ్రామ్ ఇచ్చారు, తండ్రికి సీరి యస్‌గా ఉందనీ, వెంటనే తిరిగి రావలసినదనీ! తండ్రి మరణం సంగతి అప్పటికప్పుడే తెలియజేస్తే, ఆమెకు మతి పోవడం గానీ స్పృహ తప్పిపోవడం కానీ జరుగుతుందేమో అనే భయంతో ఆ విషయం తెలియజేయలేదు.

సుస్తీయే కదా అని సుగుణ వెంటనే తిరిగి రాలేదు. ఆమె

కోసం ఒక రోజల్లా చూసి, ఆ తరువాత శవాన్ని సంస్కారం చేశాడు రాజారావే!

పరిచయాలయాక సుగుణ అడిగింది. "మానాన్నగారి కెలా ఉన్నదండీ!"

"ఆ విషయం పోతూ పోతూ మాట్లాడుకోవచ్చు! మనం బయలుదేరాలి! అడవుల దీవికి పోవాలి గదా!"

"అడవుల దీవి! ఏం పేరు అది?" నిరంజనరావు అడిగాడు.

కృష్ణమూర్తి నవ్వాడు. "తూర్పు కోస్తాలోని ఒక ఎస్టేట్‌కి పేరు అది!" అని చెప్పాడు.

కారు దూర ప్రయాణం చేస్తోంది. డాక్టర్ రాజారావే నడుపుతున్నాడు కారుని.

వెనుక సీట్లో తన ప్రక్కనే కూర్చున్న సుగుణ కేసి చూసి, గొంతు సవరించుకున్నాడు కృష్ణమూర్తి, మరణ శిక్ష విధించ బోయే ముందు జడ్జి గొంతు సవరించుకున్నట్టుగా.

"సుగుణా! నీకీ విచారకరమైన విషయం చెప్పాలంటేనే మాకు నోరు రావడం లేదు!"

సుగుణ అనుమానంగా చూసింది. "విషాద వార్తా? ఏమిటండీ అది?"

"మీ నాన్నగారు చనిపోయారు."

"ఆఁ!" అంటూ శోకించింది ఆమె, కొద్ది సేపటికి వ్యానిటీ బ్యాగ్‌లోంచి జేబు గుడ్డ తీసి కళ్ళూ, ముక్కూ తుడుచుకుంది.

"అమ్మ పోయి చాలకాలం అయింది. ఉన్న నాన్న గూడ నన్ను ఈ ప్రపంచంలో ఒంటరి దాన్ని చేసిపోయారు." అంది మళ్ళీ.

"అలా అనకమ్మా! మేం అందరం ఉండగా నీవు ఒంటరి

దానివి ఎలా అవుతావ్! నీ పెదనాన్నను నేను, మీ పిన్ని, మా అత్తయ్య, ఇంత మందిమి లేమూ నిన్ను కంటికి రెప్పలా కాపాడుకోవటానికి.'' డాక్టర్ రాజారావు గూడా ఆమెను ఓదార్చాడు.

''అయితే నాన్నగారు కన్నుమూసిన మహల్ లో ఎవరూ నివసించటం లేదా?'' సుగుణ అడిగింది.

''కళ్యాణరావు అనే పనివాడ్ని ఆ ''మహల్'' కి కాపలా ఉంచాము, ముందు ఆ అడవి ప్రాంతంలో, భయం గొలిపే మహల్‌లో పనిచేయుటానికి ఎవరూ ముందుకు రాలేదు. చివరకు ఎలాగో వెతికి వెతికి ఈ మొండిఘటాన్ని పట్టుకొచ్చాం''

''ఇంతకీ నాన్నకు సుస్తీ ఏమిటి డాక్టర్?''

''సెరిబ్రల్ హెమరేజి! సామాన్యంగా ఆ జబ్బు వచ్చిన వారు నాలుగైదు రోజుల్లోనే 'హరీ' అంటారు. కాని నా వైద్యం వల్లనే అతడు అన్నాళ్ళు బెడ్‌లో ఉండగలిగాడు.''

''అతడు చనిపోయి వారం రోజులయింది. నీకోసం కబురు పెట్టి రెండురోజులు శవాన్ని అలాగే ఉంచాం. ఆ తర్వాత దుర్గంధం రావటంతో శవాన్ని సంస్కారం చేయించక తప్ప లేదు.''

''ఇక చెప్పకండి! నాకు దు:ఖం ఆగటం లేదు!'' అంటూ సుగుణ మౌనంగా దు:ఖించసాగింది.

అందరూ నిస్సహాయంగా ఆమెను చూస్తుండిపోయారు.

# 3

కారు వేగంగా పోతున్నది. ఆకాశంలో నల్లని మేఘాలు కమ్ముకుంటున్నయ్. దోవకు రెండు ప్రక్కలా చెట్లు, జుట్టు విరగ బోసుకుని చిందులు త్రొక్కే దయ్యాలకు మల్లే, గాలికి ఊగిపోతున్నయ్.

"ఏమిటో! ఈయన ఈ అడవి ప్రదేశంలో ఎస్టేట్ కట్టాడు, బూడిదలో పోసిన పన్నీరు లాగ." రాజారావు రోడ్డు కిరు ప్రక్కలా ఉన్న ఖాళీ మైదానాల వంక చూస్తూ, విచారంగా అన్నాడు.

"ఇరవయ్ సంవత్సరాల క్రితం ఇక్కడ నౌకాస్థావరం స్థాపించటానికి ప్రభుత్వం నిశ్చయించింది. అప్పుడే శివరాం ప్రసాద్ ఇక్కడ బీళ్ళన్నిటినీ కొనేశాడు చవకగా. తర్వాత ప్రభుత్వ నిర్ణయం మారిపోయి, ఆ స్థావరాన్ని మరో రాష్ట్రానికి తరలించారు. మీ నాన్నా కొన్న భూముల్ని ఊరికే ఇస్తానన్నా తీసుకునే నాథుడు లేకపోయాడు." కృష్ణమూర్తి ఆ ఎస్టేట్ గురించి వివరించాడు.

"నౌకా స్థావరంగనుక ఇక్కడ నిర్మించి ఉంటే ఈ ప్రదేశం అంతా జనంతో కిటకిటలాడిపోతూ, సిటీ అయిపోయి బాగా అభివృద్ధి అయి ఉండేది! అవునా?" నిరంజనరావు అడిగాడు.

"కరెక్ట్" అన్నాడు లాయర్ కృష్ణమూర్తి.

"జీవితంలో ప్రతి వ్యక్తి ఎన్నో గొప్ప కార్యాలు చేయాలనుకుంటాడు. కాని దైవనిర్ణయం మానవ సంకల్పానికి వ్యతిరేకంగా ఉన్నప్పుడు ఎటువంటి వాడైనా తలవంచక తప్పదు." డాక్టర్ రాజారావు నింపాదిగా చెప్పాడు.

"మీరు వేదాంతిగా రాణించేవారు బాగా, ఈ వైద్యవృత్తిలో కన్నా!" నిరంజనరావు ఛలోక్తి విసిరాడు.

కారు ట్రంక్ రోడ్డు వదలి మట్టి రోడ్డు మీదకు మలుపు తిరిగింది. సూర్యుడు పశ్చిమానికి దిగుతున్నాడు, కారు మబ్బుల్లోంచి బయటపడి.

మట్టిరోడ్డు మీద గతుకుల్లో కారు పోతున్నది కుదుపు

లతో. కారులోని వ్యక్తులు, బొమ్మలమ్మేవాడి తోపుడు చక్రాల బండిలో బొమ్మలు ఊగులాడినట్టుగా, కారులో క్రిందా మీదా పడుతున్నారు.

మరో రెండు గంటలు ప్రయాణించిన తర్వాత చెట్ల గుంపు మధ్యలోని మైదానంలోకి కారు మరో మలుపు తిరిగి, పెద్ద భవంతి ముందు ఆగింది.

నిరంజనరావు కారులోంచి దిగుతూనే పరిసరాల్ని చూశాడు. అక్కడ రెండు భవంతులున్నయ్ ఎదురెదురుగా. ఒకటి తెల్లరంగులో ఉంటే మరో భవనం, గోధుమరంగు వెల్లవేయబడి ఉంది. రెంటి మధ్యా వంద గజాలదూరం, మాత్రమే ఉంటుంది. గోధుమ రంగు భవంతి ప్రొద్దు వాలుతున్న సూర్యుని కిరణాలు వెలుగులో వింతగా కనుపించింది.

సుగుణ కారు దిగి గోధుమరంగు భవంతి వేపు చూస్తూ ఒక క్షణం నిలబడిపోయింది.

"అదేనమ్మా మహల్!. మీనాన్న అంతిమ క్షణాలు గడిపిన భవనం." డాక్టర్ రాజారావు చిన్నగా అన్నాడు. అతడి మాటల్లో ఏదో అపహాస్యం గోచరించింది.

'మహల్' రెండంతస్తుల భవంతి. పురాతన వాస్తు శాస్త్రప్రకారం కట్టబడినది. ఈ నవీనయుగంలో దాని మోడల్ చూస్తేనే అది అనేక సంవత్సరాల క్రితం కట్టబడిం దని తెలుస్తోంది.

"ఇంట్లో అందరూ చచ్చారా ఏం? ఎవరూ కనబడ రేమర్రా ?" అంటూ రాజారావు పొలికేక పెట్టాడు.

తెల్లరంగు భవంతిలోంచి ఒక నడివయసు స్త్రీ తొంగి చూసింది కిటికీ గుండా. మరుక్షణంలోనే మాయమయింది.

కృష్ణమూర్తి కారుని రివర్స్ చేసి షెడ్‌లో పెట్టాడు.

అప్పటివరకూ అందరూ వరండాలోనే నిలబడి ఉన్నారు. భవంతి తలుపులు తెరుచుకోనే లేదు.

సుగుణకు మరోసారి దుఃఖం పొర్లుకు వచ్చింది. దగ్గరకు వచ్చిన లాయర్ కృష్ణమూర్తి భుజాన్ని ఆనుకుని నిలబడింది, పడిపోతానేమో అనిపించి.

"ఆ ఇల్లంతా దయ్యాల కొంపలా, భయంకర నిశ్శబ్దంతో ఉంది. ఈ రాత్రికి నీవూ మాతోబాటే ఈ ఇంట్లోనే ఉండమ్మా!" రాజారావు సానుభూతిగా అన్నాడు.

"చాల్లేవయ్యా! ఆ అమ్మాయి అసలే విచారంలో ఉంటే ఆమెను ఒంటరిగా, ఆమె చనిపోయిన తండ్రి భవంతిలో ఉండమంటావా?" కృష్ణమూర్తి కసురుకున్నాడు.

"నా గురించి మీరు వాదులాడుకోకండి!" అంది సుగుణ కళ్ళుతుడుచుకుంటూ. "అన్నట్టు లాయరుగారూ, మీరు నాన్నగారి మరణం తర్వాత వారం రోజులు ఒంటరిగా ఆ మహల్ లో బస చేశారని విన్నాను. ఎలా ఉండగలిగారబ్బా!"

"అదంతా తర్వాత తీరిగ్గా మాట్లాడుకోవచ్చు!" కృష్ణమూర్తి చిన్నగా నవ్వాడు.

"లోపలకు పోదాం రండి! రాత్రంతా ఇక్కడే నిలబడి మహల్ గురించే చర్చించేలా ఉన్నారే!" రాజారావు పెద్దగా అరిచాడు.

"లాయరుగారూ! ఒకసారి 'మహల్' లోపలకు వెళ్ళి వద్దామా? సుగుణ అడిగింది.

"ఇప్పుడా! వద్దు! తర్వాత చూడవచ్చులే!" కృష్ణమూర్తి అభ్యంతరం తెలిపాడు.

"దానిదేముంది! చూడదలుచుకుంటే ఇప్పుడే చూడవచ్చు! కాని లోపల లైట్లు లేవు. ఇక్కడికి వచ్చే లైన్లు తెగిపోయాయట.

రెండు రోజుల క్రితం గాలి వానకు. ఇంకా స్థంభాలు నిలబెట్టి వైర్లు సరిచెయ్యలేదు. అయినా ఏం? లోపల లాంతర్లున్నాయి. చూద్దాం పదండి. తర్వాత మన 'భవంతి,లోకి వేళ్ళి వెడి నీళ్ళ స్నానం చేసి, బోజనం చేయెుచ్చు." డాక్టర్ రాజారావు మహల్ వేపుగా నడిచాడు.

# 4

ఒక బిల్డింగ్ పేరు మహల్ వేరొక దాని పేరు 'భవంతి' పేర్లు బాగా కుదిరినయ్ అనుకున్నాడు. నిరంజనరావు.

సింహద్వారం దగ్గర రాజారావు ఆగిపోయాడు. ద్వారానికి వేసి ఉన్న పెద్ద తాళం వంక చూస్తూ. "దీని తాళం చెవులు మీ దగ్గరే ఉన్నయ్ కదండీ!" అన్నాడు కృష్ణమూర్తి వంక చూస్తూ.

సుగుణ ముగ్గురి ముఖాల వంకా చూస్తూ నిలబడిఉంది. కృష్ణమూర్తి కోపంతో పెదవి కొరుక్కుని, తప్పదనుకు జేబు లోంచి తాళం చెవి తీసి, తాళం తీశాడు.

రాజారావు గడియతీసి, తలుపు నెట్టుకుని లోపలకు ప్రవే శించాడు. మిగతా వ్యక్తులు గూడ అతడ్ని అనుసరించారు.

నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా ఉన్న ఆ భవంతిని చూస్తూంటే అది మనుష్యులు నివసించిన భవంతిలాగా అని పించలేదు సుగుణకు. అదొక పెద్ద సమాధిలాగా, ఫారోస్ నిర్మించుకొనే 'పిరమిడ్'లా తోచింది.

భవంతిలోని ఫర్నిచర్ మీదా, పటాల మీదా దుమ్ము పేరుకుని ఉంది. గోడల మూలల్లో బూజు బాగా అల్లుకుని ఉంది.

"డాక్టర్ గారూ! ఇల్లంతా ఇలా పాడుపడిపోయిందేమిటి? దీన్ని శుభ్రంచేసినవాలే లేరా? నౌకర్లంతా ఏమయ్యారు ?"

సుగుణ దగ్గుతూ అంది.

"మానాన్నగార్కి చివరి రోజుల్లో వింత వింత కోర్కెలు కలిగినాయ్!" రాజారావు భుజాలు ఎగరేశాడు." అయినా అదంతా ఇక్కడెందుకు? లోపలకు పోయాక మాట్లాడు కుందాం!"

నిరంజనరావు, రాజారావు వంకే చూస్తూ ఉండిపోయాడు. క్షణక్షణానికి అతడిలో కలిగే మార్పుల్ని గమనిస్తున్నాడు.

గది గదికీ తిరుగుతూ సుగుణ, తన తండ్రి మరణించిన బెడ్‌రూమ్‌దగ్గర ఆగిపోయింది.

దుమ్ముపేరుకుని కారురావడంవలన ఆమెకు తెరలు తెరలుగా దగ్గు వచ్చింది. గదిలోపల కొయ్య బీరువాపై ఉన్న ఆమె తల్లి ఫోటో కనుపించింది. ఆమె గబగబ అడుగులు వేసుకుంటూవెళ్ళి ఆ ఫోటోని అందుకుంది.

ఈ పటం లోపల గదుల్లో ఉండేది. ఆఖరి రోజుల్లో దీన్ని అడిగి తెప్పించుకుని ఇక్కడ ఎదురుగా తనకు కనపడేలా ఉంచమన్నాడు. మానాన్న!" రాజారావు వివరించి చెప్పాడు.

ఫోటో చుట్టూ నగిషీ చెక్కబడిన ఖరీదైన ఫ్రేమ్ ఉంది. ఫోటో చాలా పాతబడిపోయి, మూలల్లో తెల్లటి మరకలు పేరుకుంటున్నాయ్. అందులో ప్రాయంలో ఉన్న అమ్మాయి ఫోటో ఇంకా అందంగానే కనిపిస్తోంది.

సుగుణ ఆఫోటోని గుండెలకదుముకుంది. "ఈ ఫోటో ఇంకా ఇక్కడెందుకు? నా గదిలోనే ఉంచుతాను!" అంటూ దాన్ని చంకలో పెట్టుకుని వెనక్కు తిరిగింది.

అందరూ బయటకు వచ్చేశాక కృష్ణమూర్తి సింహద్వారం మూసివేసి గడియపెట్టి తాళం వేశాడు మళ్ళీ.

'భవంతి' ద్వారం తెరుచుకొని ఉంది. కిటికీలోంచి

పెట్రొమాక్స్ లైట్ల వెలుగు బయటకు చిమ్ముతోంది.

డాక్టర్ రాజారావు సుగుణచేతిని తనచేతులోనికితీసుకొని ఆమెప్రక్కనే నడుస్తున్నాడు.

నిరంజనరావు, కృష్ణమూర్తి ప్రక్కకు వచ్చాడు. "ఈ ఇంట్లో నీవు అనుమానించేదేమిటో నాకు బోధపడ్డంలేదు. అంతా సవ్యంగానే తోస్తున్నదే!"

"ఇప్పుడేం మాటాడకు!" అని ఒక్కనిమిషం ఆగి "ఈ ఇంట్లో ప్రతి కదలికనూ, ప్రతి వస్తువునూ నేను అనుమానిస్తున్నాను. రాత్రికి అందరూ నిద్రపోయాక మాటాడు కుందాం వీలుంటే! రాత్రికి చాలా జాగ్రత్తగా మసులుకో, ఎందుకయినామంచిది!"

"జాగ్రత్తగా మసలాలా?"

"నిన్నెవరన్నా హత్య చేస్తారేమో అన్నంత జాగ్రత్తగా మసలుకో. రేపటిలోగా ఒక హత్యతప్పక జరగొచ్చునని నా అంచెనా!"

# 5

అందరూస్నానాలు ముగించి, భోజనాల ముందు కూర్చున్న ప్పుడు వర్షం ప్రారంభమైంది. హోరుగాలి, కుండపోతగా వాన, అక్కడి వాతావరణాన్ని మరింత గగుర్పాటు కలిగించేదిలా మార్చివేసింది.

నిరంజనరావు భోజనంచేస్తూ అక్కడున్న ఫర్నిచర్‌ని పరిశీలించాడు. ఆ బంగళాకు మల్లేనే ఫర్నిచర్ అంతా పురాతన కాలంనాటిది. ఆ ఇంట్లోని ఫర్నిచర్ అంతా మ్యూజియంలో ఉంచదగినదిలా కనుపించింది.

డైనింగ్‌హాలు చాలా పెద్దది. రోజ్‌వుడ్‌తో చేసిన డైనింగ్ టేబుల్‌మీద ఇరవయిమంది తేలికగా విందు

భోంచేయువచ్చు. లతలూ, పుష్పాలు నగిషీ చెక్కబడిన కుర్చీలు బరువుగా, అందంగా ఉన్నయ్.

సుగుణ లోపలకురాంగానే ఆమెను లోపలకు ఆహ్వానించి, ఆమెను కౌగలించుకొని ఆదరించినవ్యక్తి డాక్టర్ రాజారావు భార్య కాంతం. రాజారావు ఎంతలావుగా ఉన్నాడో, కాంతం అంత సన్నగా ఉంది.

సుగుణ విజయవాడలోని కాలేజీ హాస్టల్‌లోనే ఉండి పోవటం మూలాన్న, ఆమెకు వీరందరితోనూ ఆట్టే పరిచయంలేదు. ఎవరో కొత్త కుటుంబంలోనికి వచ్చినట్టుగా చుట్టాలమధ్య మసలుకొనే విధంగా బాధపడటం గమనించాడు నిరంజనరావు.

"అప్పుడే ఏమంత తొందరని. ఆ ఇంట్లోకి వెళ్ళమ్మా రేపుదయం తీరిగ్గా చూడొచ్చుగదా? అసలే ఈ దుర్వార్త విని నీవు తల్లడిల్లి పోతున్నావ్!" అన్నాడు కృష్ణమూర్తి.

"కళ్యాణీ! ఎక్కడున్నావ్! కారులో అమ్మాయి పెట్టె బెడ్డింగ్ అవీ ఉన్నయ్. తెచ్చి లోపలపెట్టు!" అని అరిచాడు రాజారావు.

పొడుగ్గా, ఎర్రగాఉన్న ఆరడుగుల వ్యక్తి అక్కడకు వచ్చాడు. అతడు నిర్లక్ష్యసంగా రాజారావు వంక చూశాడు. తరువాత సుగుణవంక ఒకసారి చూసి, కారు షెడ్‌వైపుగా వెళ్ళి పోయాడు.

"ఎవరితడు?" సుగుణ అడిగింది.

"శివరాం మరణంతో ఇంట్లోని నౌకర్లంతా పని మానుకున్నారు. ఈ భవంతిలో దయ్యాలున్నాయనే వదంతి బయలు దేరి, వారు అంతాఎక్కడి వాళ్ళక్కడ సర్దుకున్నారు. వీడు కొత్త వాడు. జీతం ఎక్కువిస్తానని ఆశపెడితే వచ్చాడు." రాజారావు

ఏదో ఘనకార్యం చేసినవాడిలా పోజుపెట్టి వివరించాడు.

రెండు చేతుల్లో పెట్టె బెడ్డింగ్ మోసుకుంటూ కళ్యాణ రావు వచ్చాడు. "వీటినెక్కడ పెట్టమంటారు?" అని అడిగాడు కర్కశంగా. అతడి మాటల్లో అహంభావం చూస్తుంటే, తనే ఆ ఇంటి యజమాని అనుకుంటున్నట్లుగా ఉంది.

"పైన అమ్మాయి గదిలో పెట్టు! రా అమ్మా! నీ గది చూపిస్తాను." అంటూ కళ్యాణరావు వెనుకనే రాజారావు, సుగుణను నడిపించుకు వెళ్ళాడు మేడమీదికి.

కొద్దిసేపట్లో డాక్టర్ రాజారావు క్రిందికి వచ్చాడు. "కళ్యాణరావుని చూస్తుంటే కొత్తవాళ్ళు కొద్దిగా భయపడడం కద్దు. మనిషి పైకి దురుసు స్వభావం కలవాడిలా కనుపిస్తాడు. కాని మనసు బహు దొడ్డది. పైకి రండి సార్! మీ గదులు చూపుతాను. డ్రెస్‌మార్చుకొని భోజనాలకు రడీ అవండి!"

వంపుగా, మెలిదిరిగి ఉన్నమెట్లమీదుగా ముగ్గురూ పైకి వెళ్ళారు. ఇత్తడి గొట్టంతో చేయబడిన రెయిలింగ్ మెట్లకు ఒక ప్రక్కగా ఉంది.

"ముందు అర్జెంటుగా స్నానంచేయాలి! కారుప్రయాణం గదా! ఒళ్ళంతా దుమ్ముపేరుకుని ఉంది."

టార్చిలైట్ పట్టుకొని డాక్టర్ రాజారావు వారిద్దరికీ బాత్‌రూమ్‌చూపించాడు. చలిగాలిలో వేడినీళ్ళ స్నానం చేసేసరికి ప్రాణానికి హాయి అనిపించింది నిరంజనరావుకి కృష్ణమూర్తికి, స్నానం చేసేక వారు క్రిందికి దిగుతుండగా "ఇదే సుగుణ గది" అన్నాడు కృష్ణమూర్తి. నిరంజనరావు తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళాడు. గదిలో సుగుణలేదు. బహుశా స్నానానికి వెళ్ళిందేమో అనుకున్నారు. సుగుణ గది కిటికీలోంచి పడమటి దిక్కున దిగజారుతున్న సూర్యుడు ఎర్రబారుతూ మనోహరంగా కను

పించాడు.

వారిద్దరికి వేరు వేరుగా ప్రక్కగదులు కేటాయించబడి నయ్. వారి గదులకు ఎదురు వరుసలోనే ఒక గది సుగుణ కివ్వ బడింది.

"లాయర్ కృష్ణమూర్తిగారికీ సుగుణకూ ఈ ఇద్దరి అతిథులకోసమే ఈ గదులు ఏర్పాటు చేశాం. మీారు వస్తారని తెలీదుగదా ! అయినా ఫర్వాలేదు. ఇంత పెద్ద బంగళాలో అదనంగా మరో అతిథికి బస ఏర్పాటు చేయడం ఎంతసేపు? రాజారావు చిన్న లెక్చరిచ్చాడు." నిరంజనరావు వంక చూస్తూ. "లాయరుగారికి స్నేహితుడనే గదూ చెప్పింది?"

"అవును! ఒక్కసారికాదు! రెండుసార్లు చెప్పారు లాయరు గారు. మీాకు జ్ఞాపకం లేదేమో!" నిరంజనరావు ఆక్కసుగా అన్నాడు.

"మీారు భలేవారే! ఎన్నిసార్లు చెప్పారో నేను లెక్కవేస్తూ కూర్చోవటంతప్ప నాకు మరేం పని లేదనుకున్నారా?', నవ్వాడు రాజారావు.

స్నానం చేసి వచ్చిన నిరంజనరావు తన బాండ్‌సూట్‌కేసు తెరిచి, చారల పైజమా, ఓపెన్‌షర్టు తీసి తొడుక్కున్నాడు.

సూట్‌కేస్‌లో నైట్‌డ్రెస్ క్రిందుగా ఉన్న రివాల్వర్, గుడ్డలుతీయడంతో పైకి కనుపిస్తోంది. అత్భుతంగా, విచిత్రంగా రాజారావు రివాల్వరు వంక చూశాడు.

"మీారు రివాలవర్‌ని ఎప్పుడూ వెంటతెచ్చుకుంటారా?"

"ఎప్పుడూ వెంట ఉండాల్సిందే!" ప్రతిమాటా ఒత్తి పలికాడు నిరంజనరావు.

"మీా స్నేహితుడి స్నానం పూర్తయిందేమో! క్రిందకు పోదాంరండి! కృష్ణమూర్తి ఎలాగయినా మొండిఘటం! వారం

రోజులపాటు 'మహల్'లో తలుపువేసుకొని లోపలే ఉండిపో యాడు. మమ్మెల్నెవరూ రానివ్వలేదుగూడా.'' ఏదో రహస్యం చెప్పేవాడిలా అన్నాడు రాజారావ్.

"ఎందుకని?'' కుతూహలంగా అడిగాడు నిరంజనరావు.

"శ్యామాకాంతం మహా రుచికరంగా చేసింది వంటలు. వెళ్ళి భోజనంచేస్తూ కబుర్లు చెప్పుకుందాం!'' అంటూ కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు రాజారావు.

భారంగా అడుగులు వేసుకుంటూ రాజారావు గబగబ మెట్లుదిగి వెళ్ళిపోయాడు. నిరంజనరావు నింపాదిగా నడుస్తూ ఆగది తలుపుల్ని పరీక్షించాడు.

ఆ తలుపులకు లోపలగానీ బయటివేపుగానీ గడియలు లేకపోవటాన్ని ఆశ్చర్యంగా పరికించాడు. అంతకు మునుపున్న గడియల్ని ఊడబెరికినట్లుగా, మర మేకులు ఊడబీకిన కంతలు కనబడుతున్నాయ్.

రాజారావు పూర్తిగా మెట్లుదిగినట్టు రూఢిచేసుకుని, తనుపులు మూసేశాడు, నిరంజనరావు. తలుపులకు అడ్డంగా కుర్చీని అడ్డంపెట్టాడు.
ఆతర్వాత బెడ్ క్రిందా, డ్రాయర్లలోనూ, ఫర్నీచర్ అడుగు భాగంలోనూ, నేలమీద పరిచిఉన్న తివాసీ క్రిందా, వెదికాడు. దేనికోసమో.

అతడికి ఏమీ కనబడకపోవటంతో నిరుత్సాహం కలిగింది. విసుగ్గా కిటికీవద్దకు నడిచాడు. కారుమబ్బులా దట్టంగావున్న చెట్లగుంపులూ మినహా మరేం కనిపించలేదు. తను నిలబడి వున్న భవంతికి ఎదురుగా భూత్ బంగళాను జ్ఞప్తికితెస్తూ 'మహల్' కనుపిస్తున్నది.

తలుపులకున్న గడియలు తన రాకను గ్రహించి, అప్పటి

కప్పుడే ఊడబెరికినట్లున్నారు. తాము కారులోంచి దిగంగానే రాజారావు కేకవిని కిటికీలోంచి తల బయటకుపెట్టి కాంతం వచ్చిన అతిదులు ఇద్దరు కాదు ముగ్గురు అని గ్రహించి, తలుపు తెరిచేలోపల ఈ గది గడియ ఊడబెరికించి ఉంటుంది. తన గదివలెనే. కృష్ణమూర్తి గదికీ సుగుణ గదికీగూడ తలుపుల గడియలు ఊడబీకారా?

కుర్చీని యధాస్థానంలోకి మార్చి తలుపు తెరుచుకొని క్రిందకు వెళ్ళాడు నిరంజనరావు. అప్పటికే డైనింగ్ టేబుల్ ముందు రాజారావు, కృష్ణమూర్తి కూర్చుని ఉన్నారు.

"రా అమ్మా రా! ఏమే కాంతం! మా అత్తమ్మకు గూడా చెప్పావా, మన సుగుణ వచ్చిందని! పాపం! ఆపిచ్చిదానికి గూడా సుగుణఅంటే ఎంతప్రేమో చెప్పలేం!"

సుగుణవచ్చి కూర్చున్నాక, కాంతం వంటకాలన్నీ టేబుల్ మీదసర్ది తను గూడ ఆమెప్రక్కన కూర్చుంది.

"ఏం? పాపం, మీ అక్కగారికి పిచ్చా?" నిరంజనరావు జోక్యం కలుగజేసుకొంటూ అడిగాడు.

"జరిగిందేమిటంటే, ఆమెగూడా సుగుణ ఈడుదే కుమార్తె ఉండేది. ఆమెపేరు సుజాత, ఏడాదిక్రితం కారు ప్రమాదంలో మరణించింది. అప్పట్నుంచి మాఅక్క సుందరమ్మకు మతి చలించింది. తన కుమార్తె చనిపోలేదనీ, హాస్టల్లో ఉంటోందనీ కనబడిన వారికల్లా చెబుతుంది. మతి భ్రమించింది. అంతేగానీ పిచ్చిగా కనబడ్డవాళ్ళని కొరకటం రక్కటం చేయదు."

"పాపం! మంచివాళ్ళకే కష్టాలన్నీ వస్తాయి." సానుభూతిగా అంది సుగుణ. ఆమె గొంతులో కొదిగా మార్పు విన వచ్చింది. అయినా ఎవరూ గమనించలేదు మార్పుని.

"కళ్యాణ రావుని చూస్తుంటే అతడికిగూడా అదోరకం ఉన్మాదం ఉన్నదన్పిస్తుంది గదూ?" కృష్ణమూర్తి అడిగాడు.

"అతడా? అలాగే కనిపిస్తాడు. వయసులో వేడిపాలు ఎక్కువ. అయితేనేం, పనిలోమటుకు పదిమందిపెట్టు."

నిరంజనరావు సుగుణ ముఖంలోకి చూశాడు. ఆమె నీలిరంగు రూబీ వాయిల్ చీర, నల్లరంగు వెల్వెట్ జాకెట్ తొడుక్కుంది. మెడలో లాకెట్ గొలుసు రొమ్ములమీద పడుకునిఉంది, ఆ ప్రయాణపు బడలికనుంచీ, తండ్రిమరణం దుర్వార్తనుంచీ కొద్దిగా తేరుకుంది గాబోలు, ఆమెముఖం అందంగా, కళ్ళు కాంతివంతంగా ఉన్నాయ్.

కేవలం డ్రెస్ మార్చినంతమాత్రానే, ఆడవాళ్ళ సోయగాలుగూడా మారిపోతయ్ అనుకున్నాడు. సాయంత్రం చూసిన సుగుణకూ ఈ సుగుణకూ ఎంతభేదం! ఏడ్చినందువల్ల ఆమె కళ్ళలో ఎర్రజీరలు మాత్రం ఇంకా కనుపిస్తూనే ఉన్నయ్. ఆ ఒక్కపోలిక మినహా, ఈమె మరో కొత్త సుగుణగా, వేడినీటి స్నానంచేసి, శ్రమనుంచి రిలీఫ్ పొందిన, నిత్యనూతన యువతిగా కనుపించింది.

"వానవచ్చిందంటేసరి నాకు జలుబుచేసి గొంతు పట్టేస్తుంది." అన్నది సుగుణ, ముక్కు ఎగబీలుస్తూ.

"మిరియాల చారుత్రాగి, తేలిగ్గా తిని పడుకో! తెల్లారేసరికి జలుబు అదే సర్దుకుంటుంది." రాజారావు సలహా ఇచ్చాడు. ఇంగ్లీషు వైద్యంచేసే డాక్టరు కషాయం గురించి మాట్లాడడం వింతగా తోచింది, మిత్రులిద్దరికీ.

"తేలిగ్గా తినటమా? రైలు ప్రమాదంలో రెండురోజుల నుంచి సరైన తిండిలేదు. మనుష్యుల్నే తినేసేటంత ఆకలిగా ఉంది." సుగుణ నవ్వుతూ అంది.

"అయితే కడుపునిండా తినేసేయ్. రేపుదయం నీకు ఫస్టుక్లాసయిన మందిస్తాను జలుబుకు."

# 6

భోజనంలోని వంటకాలు అంత రుచికరంగా లేవు. రాజారావు మాటలే కడుపునిండేలా ఉన్నాయి. కూరలో ఉప్పు ఎక్కువయింది. సాంబారులో కారం ఎక్కువ. చారు కషాయం లాగుంది.

భోజనాలు పూర్తయి పైకి వెళ్ళేటప్పుడు. కృష్ణమూర్తి సుగుణను చాటుగా అడిగాడు, "ఏమ్మా! అంతా సవ్యంగానే ఉందికదా? నీకేం ఇబ్బంది కలగలేదుకదూ?"

"అలాంటిదేమీ లేదండీ! కానీ నాకే మనసంతా గందరగోళంగా ఉంది. దేన్నిచూసినా బెరుకుగా ఉంటోంది. అసలు నేను రాకున్నా బాగుండేది. అనిపిస్తున్నది."

"కానీ ఇది తప్పనిసరైపోయింది. ఈ భవంతిని కాదని 'మహల్'లో బస చేయలేం. ఈ చుట్టుపట్ల పదిమైళ్ళ వరకూ హోటల్ అనేది లేదు. బస చేయటానికి."

"అది నిజమేలేండి! గుడ్‌నైట్!" అంటూ సుగుణ తన గదిలోకి వెళ్ళిపోయింది. తలుపులు దగ్గరగావేసి బెడ్‌మీద వాలిపోయింది.

ముందు ప్రక్కహాల్లో కృష్ణమూర్తి నిరంజనరావు, రాజారావు సోఫాలో కూర్చున్నారు ఏదో విషయాలు మాటాడుకుంటూ.

వరండాలో ఎవరివో అడుగులు, దడాబడా నడుస్తున్న వ్యక్తి అడుగుల చప్పుడు వినిపించింది.

స్నేహితులిద్దరూ తల ప్రక్కకి త్రిప్పి చూసేసరికి తలుపు నెట్టుకుని ఆజాను బాహువులయిన కళ్యాణరావు లోపలకు

వచ్చాడు.

"ఇంత ప్రొద్దుపోయేదాక ఎక్కడ తిరుగుతున్నావ్! వెళ్ళి అన్నంతిను!" రాజారావు కోప్పడ్డాడు.

"మీకంటే ముందరే తినేశాను ఎప్పుడో!" అతి నిర్లక్ష్యంగా, దూకుడుగా జవాబిచ్చాడు కళ్యాణరావ్.

"అయితే ఇంతసేపు ఎక్కడ అఘోరిస్తున్నావ్?"

"వాన వస్తోందికదా! కట్టెలు తడిసిపోతాయని, వాటిని లోపలకు జేరవేస్తున్నాను ఇంతసేపు!"

"ఏడవలేక పోయావ్! అన్నట్టు మీరెవరన్నా మందేసు కుంటారా? నాకు అదిలేందే నిద్రరాదు." రాజారావు ఇద్దరి ముఖాల వంకా చూశాడు.

కళ్యాణరావు బీరువా తెరిచి అందులోంచి బ్రాంది సీసా, గ్లాసులూ బల్ల మీద వాళ్ళమధ్యగా ఉంచాడు.

రాజారావు గ్లాసుల్లోకి బ్రాందీని వంచి, తలా ఒకగ్లాసు అందించాడు.

కళ్యాణరావుగూడ, తనో గ్లాసు అందుకుని, దాని నిండా బ్రాందీ వంచుకుని గడగడ త్రాగేశాడు.

పనిచేసే నౌకరు అంత స్వతంత్రతంగా యజమాని ముందు నుంచి డ్రింక్ లాక్కుని త్రాగడం, నిరంజనరావుకి ఆశ్చర్యాన్ని కలిగించింది.

"ఒక గ్లాసుతోనే ఆపేశారేం? ఇంకో పెగ్ తగిలించండి! వానలో వెచ్చగా ఉంటుంది. ఛాన్స్ పోతే మళ్ళారాదు!" అంటూ రాజారావు హుషారుగా పలికాడు.

నిరంజనరావు కళ్ళతోనే సైగ చేశాడు కృష్ణమూర్తికి. వాళ్ళిద్దరూ మరో డోస్‌ని నిరాకరించారు.

"ఆడవాళ్ళంతా పడుకున్నట్టున్నారు! డాక్టర్ రాజారావ్

గారూ! మనం అసలు విషయాన్ని కొంతవరకైనా చర్చింటం మంచిది. నేను ఇక్కడకు వచ్చింది దివంగతులైన శివరాం ప్రసాద్ గారి ఆస్తిపాస్తుల్ని వారి వారసురాలికి, ఆయన గారి ఏకైక పుత్రిక సుగుణకు అప్పగించటానికి! అవునా?'' లాయర్ కృష్ణమూర్తి కోర్టులో వాదించే తీరులో అడిగాడు.

''అక్షరాలా అంతే!'' రాజారావు తలూపాడు.

''అతడికి అంతిమ ఘడియల వరకూ మీరే గదా అతడికి వైద్యం చేసింది. అతడి రోగం ఏమిటో చెప్పగలరా?''

''ఒకటి కాదు. పది ఉన్నాయి. హార్ట్ ఎటాక్, బ్లడ్ ప్రెషర్, ఇలాంటివే ఇంకెన్నో. చివరకు మాత్రం సెరిబ్రల్ హెమరేజ్, మెదడులో సంభవించే అతి ప్రమాదకరమయిన జబ్బుతో చనిపోయాడు.''

''కాని అతగాడిది సహజ మరణమే నని నాకు ఈ నాటికీ నమ్మ బుద్ధవటం లేదు. అతను హత్య చేయబడ్డాడని నా అనుమానం!''

''భలే! భలే! ఇది మరీ విడ్డూరంగా ఉంది. మీరు లాయర్లు కదూ! సాక్ష్యం లేనిదే నిజాన్ని గూడా నమ్మలేరు.'' రాజారావు, నిరంజనరావు కేసి చూశాడు.

''చూశారా! మీ స్నేహితుడు చివరకు నా మీదే హత్యానేరాన్ని మోపుతున్నాడు. ఇది విచిత్రంగా లేదూ? ఒరేయ్ కళ్యాణ్! మీ యజమానిని ఖూనీ కోరుగా తేలుస్తున్నారు.'' ఉన్మాదంగా పలికాడు రాజారావు.

''అది చాలా పొరబాటు సార్! మీరు చూస్తూ చూస్తూ ఈగను కూడా చంపలేరు. అంతేకాదు. మీరు హత్యచేశారంటే ఎవరూ నమ్మరు గూడాను.'' కళ్యాణరావు తన యజమానికి వంతపాడాడు.

"ఎవరన్నా నమ్మినా, నమ్మక పోయినా, శివరాం ప్రసాద్‌ని త్యం చేసేందుకు ఆస్కారం ఉందనే నేను గట్టిగా విశ్వసిస్తు న్నాను. సరే ఆ విషయం అలా ఉంచండి. శివరాం ప్రసాద్ మరణించాడు, దైవ నిర్ణయం వల్ల గానీండి, మానవ సంకల్పం నుంచి అవనీండి! అయితే అతని వారసురాలు సుగుణ బ్రతికే ఉంది కదా?"

"సలక్షణంగా ఉంది. అందుకు సందేహమా?"

"ఆమెకు తన తండ్రి ఆస్తిపాస్తుల వివరాలేమైనా తెలుసునా? తెలియవనే నా అభిప్రాయం!" కృష్ణమూర్తి సాను భూతిగా అన్నాడు.

"అసలు మీరు గనుక శివరాం ప్రసాద్ ఆఖరి రోజుల్లో అతడి వద్దే ఉండి ఉంటే అతడెంత పిసినారిగా ప్రవర్తించాడో మీకందరికీ బాగా తెలిసివచ్చేది. అతగాడికి సాధ్యపడితే, తను సంపాదించిన బంగారాన్నంతా మోసుకపోయి ఉండేవాడే తన వెంట!" రాజారావు మరోగ్లాసు నింపుకొని త్రాగాడు.

"బంగారమా?" నిరంజనరావు నోరు తెరిచాడు.

"ఒట్టి బంగారం కాదు. అపరంజి బంగారం. కొన్ని లక్షలరూపాయల విలువజేసే బంగారం. చనిపోతూగూడా దాన్నేం చేసిందీ' ఎక్కడ దాచిందీ గూడా చెప్పనేలేదు. బహుశా ఆ రహస్యం చెప్పాలనే కుమార్తె కోసం తహ తహ లాడి ఉంటాడు."

"ఇప్పుడీ సోదిఅంతా మా స్నేహితుడి కెందుకు చెప్పడం! మనం వాదనలో పడి అసలు విషయానికి దూరమవుతున్నాం!" కృష్ణమూర్తి అభ్యంతరం చెప్పాడు.

"సోదికాదండీ బాబూ! జరిగిన వాస్తవాన్ని ఆయనకు చెప్పనివ్వండి! చూశారా నిరంజనరావు గారూ! ప్రాణాలు పోయే

సమయంలోగూడా ఆయన, నాకూతురు వచ్చిందా?'' అనే అడిగాడు కానీ, బంగారం ఎక్కడ దాచిందీ చెప్పనేలేదు. అంటే దానర్థం ఏమిటి? కుటుంబ సభ్యులమైన మాపైననే ఆయనకు నమ్మకం లేదన్నమాట!''

''ఒట్టి అనుమానం మనిషి అన్నమాట!''

''బాగా చెప్పారు. అతడు లాయర్ కృష్ణమూర్తిగారి సమక్షంలోనే నాతో అన్నాడు. ఏమని? తన దగ్గరున్న కాష్ నంతా బంగారంలోకి మార్చాననీ, దాన్ని ఎక్కడ దాచిందీ, తన ఆఖరి క్షణాల్లో తన కుమార్తెకు చెబుతాననీ చెప్పాడు.''

''అలాగా?''

''కానీ దురదృష్టవశాత్తు అతడికుమార్తెను కలుసుకోలేకుండానే కన్నుమూశాడు. ఇందులో మేం చట్టవిరుద్ధంగా ప్రవర్తించేందుకు ఎక్కడైనా అవకాశం ఉందా మీరే చెప్పండి?', ప్రాధేయపూర్వకంగా అడిగాడు రాజారావు.

''లేదనుకోండి!,, నిరంజనరావు ఇంకేదో చెప్పబోయాడు.

''అందుకే నేను వారం రోజులు లోపల తలుపులు బిగించుకుని మరీ మహల్ అంతటా వెదికాను.,,

''మీకు లోపల బంగారం ఆచూకీ దొరికిందా?,,

''లేదు!,,

''దొరకలేదుకదా? ఇప్పుడు మిమ్మల్నెవరన్నా ఆరోపిస్తారు, లోపల మీకు బంగారం ఆచూకీ దొరకిందని! దానికి మీరేమంటారు?,,

''పచ్చి అబద్ధం అంటాను. అర్థం పర్థం లేని అనుమానం అంటాను.'' కృష్ణమూర్తి ఆవేశంగా అన్నాడు.

''మీరు వారం రోజులు తలుపులు మూసుకొని లోపల కూర్చున్నా బంగారం దొరకలేదు. అలాగే నేను మూడునెలలుగ

ట్రీట్‌మెంటు ఇచ్చినా పేషెంట్ మనకు దక్కలేదు. ఒప్పు కుంటారా? లేక, నేను కాకపోతే నా నౌకరు కళ్యాణ్ అయినా ఆయన్ను హత్య చేసే ఉంటాడంటారా? ఏరాకళ్యాన్ నీవేమైనా శివరాం ప్రసాద్‌ని చంపలేదు కదా?,, రాజారావు, కళ్యాణ్ కేసి చూసి అదోలా నవ్వాడు.

కళ్యాణరావు అప్పటిదాకా ఒకస్టూలు మీద అమాయ కంగా చూస్తూ కూర్చున్నవాడల్లా లేచినిలబడ్డాడు. అతడి ముఖం కందగడ్డలా ఎర్రగా అయింది. ఆవేశంతో రొప్పు తున్నాడు. ముందుకు వంగి టేబుల్ మీద బ్రాందీ సీసాను అందుకుని దాన్ని తలక్రిందులుగా పట్టుకుని డాక్టర్ రాజారావు కేసి విసిరాడు బలంగా.

రాజారావు సోఫాలోంచి క్రిందకు జారి నేలకు కరుచు కున్నాడు. తలతప్పిపోయి, గోడను కొట్టుకుని పగిలి పోయింది. సీసా పెంకులన్నీ హాల్లో చిందరవందరగా పడిపోయాయి.

నిరంజనరావు, కళ్యాన్‌ని అడ్డుకుందామని లేచాడుగాని అప్పటికే ఆలస్యమయి పోయింది.

"పందివెధవా? ఏమిటిరా నీవు చేసిన పని!,, అనికోపంగా అరిచాడు రాజారావు.

కళ్యాన్ మాట్లాడలేదు. కిటికీ దగ్గరకువెళ్ళి గోడకు ఆను కుని నిలబడి గుడ్లప్పగించి చూస్తున్నాడు

నిరంజనరావు, ప్రమాదం వెంట్రుక వాసిలో తప్పిపోయి నందుకు నిట్టూర్చాడు. అతడికి కళ్ళు మూతలు పడుతున్నయ్ క్షణం క్రితం జరిగిన సంఘటన ఏదో పీడకలలో ఘట్టంలా అని పించింది. నాటకంలో ఒక అంకంలా తోచింది. వీళ్ళు అసలు విషయాన్ని మభ్యపరచటానికి ఏదైనా నాటకం ఆడుతున్నా ఈ సంఘటన గూడా ముందుగా వేసుకున్న ప్రకారం జరిగిందేనా?

ఏలక్ష్యం కోసం వీళ్ళిలా నాటకమాడుతున్నారు.

కాకపోతే నౌకరు వెధవ యజమాని తలకు గురి చూసి బ్రాందీ సీసా విసరితే ఎవరైనా సహించి ఊరుకుంటారా?

"డాక్టర్‌గారూ! నాకు నిద్రవస్తోంది. ఇవాళిక పడుకుందాం కాకపోయినా ఇంకా మాట్లాడుకున్నకొద్దీ ఆవేశాలు పెరిగి మనుష్యుల్ని మనుష్యులు చంపుకునేలా గున్నారు. రేపు ఉదయం ప్రశాంతంగా చర్చిద్దాంలెండి, దాచిపెట్టబడిన ధనం గురించి." నిరంజనరావు సోఫాలోంచిలేచాడు.

"సీసా పెంకులు తొక్కకుండా జాగ్రత్తగా వెళ్ళండి. రేపుదయానికి వాటిని శుభ్రం చేయిస్తాను." అన్నాడు రాజారావు.

తడబడే అడుగులతో మెట్లెక్కి పైఅంతస్తు చేరుకున్నారు కృష్ణమూర్తి, నిరంజనరావు! గుడ్‌నైట్. చెప్పుకుని ఎవరి రూంలోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

'అందరూ పడుకున్న తర్వాత మాట్లాడు కుందాం!, అనుకున్న మిత్రులిద్దరు, ఆ విషయమే మరచిపోయి, బెడ్‌మీద వాలిపోయి ఒళ్ళెరక్కుండా నిద్రలో మునిగిపోయారు.

# 7

సూర్యరశ్మి మీదపడడంతో నిరంజనరావు మేలుకున్నాడు. ఒళ్ళు మరిచి అతిగా నిద్రపోయాడేమో, తల నొప్పిగాకూడా ఉంది. కళ్ళు నులుముకుంటూ తనుఎక్కడుండేది గుర్తుకు తెచ్చుకున్నాడు, గది అంతా కలియజూసి.

తను క్రితం రాత్రి విడిచిన ప్యాంటూ, కోటూ, షర్టు, హ్యాంగర్ మీద వ్రేలాడుతున్నాయ్, వేసినవి వేసినట్లుగా. చేతి నుంచి తీయడం మర్చిపోయిన వాచీవంక చూసుకున్నాడు. ఏడున్నర అవుతున్నది. లేచి కిటికీదగ్గరకు వెళ్ళి ఉదయించే

సూర్యుడికి నమస్కరించి సూర్యకాంతిని కళ్ళ కద్దుకున్నాడు.

వాన వెలిసినా ఇంకా వాతావరణం చల్లగానే ఉంది. తనకు గూడ ముక్కు దిబ్బడ వేసినట్టుగా ఉంది. రాత్రి వాన బాగా కురిసి ఉండాలి అనుకున్నాడు.

ఒళ్ళంతా బద్ధకంగా ఉంది. తిరిగివచ్చి బెడ్‌మీద పడుకుని దుప్పటి కొంతవరకూ కప్పుకున్నాడు. కళ్ళు మూసుకుని నిద్రపోవటానికి ప్రయత్నించాడు.

క్రిందనుంచి ఎవరివో అరుపులు వినబడినాయి. అందులో ఒక కంఠం కృష్ణమూర్తిదని గుర్తు పట్టాడు. ఆరుబయట నుంచి మాటలు వినబడుతున్నాయని గుర్తించి, ఒక్క వుదుటున బెడ్‌మీదనుంచి లేచాడు. నిరంజనరావు. కిటికీ దగ్గరకు వెళ్ళి, తలుపు తెరిచి క్రిందకు చూశాడు. అక్కడ ఎవరూ కనుపించలేదు అతడికి. స్లిప్పర్స్ తొడుక్కుని గబగబా క్రిందకు దిగి వెళ్ళాడు.

హాల్లో డాక్టర్ రాజారావు, కాంతం చేత క్రితం రాత్రి పగిలిపోయిన సీసా పెంకుల్ని జాగ్రత్తగా ఊడిపించుతున్నాడు.

"ఏమిటండీ ఆగలాటా?" నిరంజనరావు అడిగాడు.

"తెలీదండీ! ఆరుబయట లాయరుగారు మా కళ్యాణ్ తో ఏదో మాట్లాడు తున్నట్టున్నాడు! నేను ఈ పెంకుల్ని ఏరి వేయించటంలో అదేమిటో గమనించలేదు."

నిరంజనరావు సింహద్వారం తెరచుకుని బయటికి వరుగెత్తాడు.

ఆరుబయట కృష్ణమూర్తి నిలబడి ఉన్నాడు. తలపైకెత్తి చెట్ల చిటారు కొమ్మల వంకా, ఆకాశం వంకా చూస్తున్నాడు. ఆకాశం విరిగి మీదపడుతుందా అన్నంత అదుర్దాగా చూస్తున్నాడు. అతడికి చేరువలోనే కళ్యాణరావు నిక్కరూ,

బనీనుతో నిలబడి అయోమయంగా నోరు తెరచుని నిల బడ్డాడు.

నిరంజనరావు వెనుకనే డాక్టర్ రాజారావు కూడ వచ్చాడు

"ఏమిటిరా కళ్యాణ్? ఏం జరిగింది!" అడిగాడు రాజారావు.

రాత్రివానవల్ల నేలమీద ఇంకా అక్కడక్కడా నీరు నిల బడి ఉండి నీళ్ళలో అడుగులు తపతప వేసుకుంటూ ముందుకు రాబోయాడు రాజారావు.

"ఇటుగా రాకండి! అక్కడే ఉండండి!" కృష్ణమూర్తి వెర్రిగా అరిచాడు. రాజారావు వంక, నిరంజనరావు చూస్తూ,, మీరే చెప్పండి! నేను మతిలేని వాడిలా అవుపిస్తున్నానా! పిచ్చెత్తిన వానిలా ఉన్నానా?"

"ఏమిటీ అర్థంలేని ప్రశ్నలు కృష్ణమూర్తీ! నీవు మామూలు మనిషిలాగే కనుపిస్తున్నావ్!" నిరంజనరావు అన్నాడు.

"నీవైనా జరిగిందేమిటో చెప్పవేమిరా కల్యాణ్!" రాజా రావు అసహనంగా కళ్యాణరావుని అడిగాడు.

కళ్యాణరావు తన రెండుచేతుల్లోనూ ముఖాన్ని దాచు కున్నాడు. మరుక్షణంలోనే చేతులు తీసేశాడు. "మేం చెబితే మీకర్థం కాదు! మీకళ్ళతో మీరేచూడండి!"అన్నాడు చివరకు.

"ఏమిటో! ప్రొద్దునే రచ్చ చేస్తున్నారు! ఏం జరిగిందం టే ఒక్కరు చెప్పరు?" విసుక్కుంటూ రాజారావు కృష్ణమూర్తి నిలుచున్నచోటికి నడచాడు.

కాని అక్కడ జరిగిందేమిటో చూడడానికి రాజారావు కృష్ణమూర్తి నిలుచున్నచోటికే పోనక్కరలేదు. నిరంజనరావు తెల్లారేలోగా ఇక్కడ ఏదో అద్భుతం, హత్య, ముఖ్యమయిన

మనుషులు మాయమవటమో జరిగి తీరుతుందని అనుమాన పడుతూనే ఉన్నాడు.

అయితే ప్రస్తుతం జరిగిన విషయాన్ని చూస్తూ చూస్తూ నమ్మలేకపోతున్నారు, అక్కడున్న వ్యక్తులంతా.

డాక్టర్ రాజారావు కళ్ళజోడు తీసి, కళ్ళు నులుముకుని మరీ చూశాడు. కళ్ళజోడుని యథాస్థానంలో పెట్టుకుని మళ్ళీ చూశాడు.

భవంతికి ఎదురుగా వందగజాల ఎడంలో క్రితం సాయంకాలం తామందరూ గది గదికీ తిరిగి చూసిన 'మహల్' కృష్ణమూర్తి తన స్వహస్తాలతో తలుపులు మూసి తాళం వేసి వచ్చిన 'మహల్' పాత ఫర్నిచర్‌తో, శివరాం ప్రసాద్‌ని పొట్టన బెట్టుకున్న గదీ, అతడు నిగూఢంగా దాచిన బంగారం ఉండాల్సిన 'మహల్' వారం రోజులు కృష్ణమూర్తి ఆ దయ్యాల మేడలో తలుపులు బిగించుకుని, లోపల గడిపిన 'మహల్' ఉండవలసిన స్థానంలో, ఉండవలసిన చోట లేదు. గోడలు కాదు గదా ఇటుకరాయి ముక్కకూడ లేదు.

ఖాళీస్థలం రాత్రివానకు తడిసిన చిత్తడినేల ఉంది. రాత్రికి రాత్రే అంత పెద్ద భవనం 'మహల్' ఎలా మాయమయి పోయింది?

# 8

కృష్ణమూర్తి నడుమువిూద చేతులుంచుకుని ఆశ్చర్యంతో చూశాడు. అతడు ఒక్కడే తన కళ్ళునులుముకోలేదు. తన కంటి చూపు ఇంకా మందగించలేదని ఆతడికి ఎనలేని విశ్వాసం!

అయితే పాతిక సంవత్సరాల క్రితం నిర్మింపబడిన అంత పెద్ద భవనం 'మహల్' మాయమయిపోయిందంటే ఎలా నమ్మబుద్ధి కలుగుతుంది.?

ఈ లోగా సుగుణ గూడ మేడ దిగి వచ్చింది. "ఏమిటిది? నేను కలగంటున్నానా? లేక చూపు మందగించిందా? మనం రాత్రి చూసిన 'మహల్' ఏమయిపోయింది." సుగుణ ఆశ్చర్యంగా అడిగింది.

"అంతే మీా కెవరికీ 'మహల్' కనిపించటంలేదన్నమాట? అయితే నాకు మతి భ్రమించలేదని రూఢి చేసుకున్నాను!" "మహల్‌ని పాతాళ భైరవిలోని మాంత్రికుడు ఎత్తుకు పోయాడా? లేక అల్లాఉద్దీన్, అద్భుత దీపం తాలూకు భూతం తన చేతిలో మోసుకుపోయిందా?" సుగుణ పెద్దగానే అనే సింది.

"ఇప్పటికే నమ్మశక్యం కాకుండా ఉంది!" కృష్ణమూర్తి తల నిమురుకుంటూ అన్నాడు.

"అవును! నాకూ నమ్మశక్యం కాకుండా ఉంది!" రాజా రావు గూడ వంతపాడాడు.

"విజ్ఞాన శాస్త్రానికి అతీతంగా జరిగిందే! ఎలా నమ్మను నవీన విజ్ఞానాన్ని పూర్తిగా నమ్మే వ్యక్తిని. చస్తే నమ్మ లేకుండా ఉన్నాను." నిరంజనరావు గడ్డం నిమురుకుంటూ ఉన్నాడు.

కృష్ణమూర్తి ఒక కర్రను తీసుకుని తనున్నచోట నేలను గీకి చూశాడు నేలను గట్టిగా పొడిచాడు.

"అదేం? 'మహల్' నేలలోకి కృంగిపోయిందని నీ అను మానమా?" నిరంజనరావు సందేహించాడు.

"అదెలా సంభవమా అని ఆలోచిస్తున్నాను."

"దీనికంతటికీ కారణం నాకు తెలుసు. ఆ బోండాం డాక్టరు మనల్ని హిప్నొటైజ్ చేశాడు. ఆ కనికట్టు వలన మనం మన ముందున్న 'మహల్'ని చూడలేకపోతున్నామనే నా

సంశయం!'' అంత వరకూ మౌనంగా ఉన్న కళ్యాణరావు నోరు విప్పాడు.

"పొద్దున్నే తాగొచ్చావా ఏం? ఏమిటిరా పందివెధవా నీవు మాట్లాడేది?'' డాక్టర్ రాజారావు, కళ్యాణ్ వంక గుడ్లురిమి చూశాడు.

"అంత పెద్ద భవంతే మాయమయిపోతే మనంగూడ ఏ క్షణంలోనైనా గాలిలోకి ఎగిరిపోతామేమో!'' కృష్ణమూర్తి వేదాంతిలా నవ్వాడు పెద్దగా.

"క్రితం రాత్రి అద్భుత విషయం జరిగిందన్నమాట అయితే!'' నమ్మలేనిదానిలా చూసింది సుగుణ.
మీదంతా మరీ చాదస్తమండీ! ఇదేదో కనికట్టు అయిఉండాలి. మనల్ని ఫూల్స్ చేయటానికి ఎవరో ప్రయోగం చేసి ఉంటారు.'' కళ్యాణ్ మళ్ళీ అరిచాడు.

"అంత పెద్ద భవనం మాయం కావటమూ, పునాదుల ఆనవాలు గూడా లేకుండా?అదెలా సంభవం?'' రాజారావు బుగ్గలు నొక్కుకుంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తపరిచాడు.

"కనికట్టు! హిప్నాటిజమ్! అవన్నీ ట్రాష్! నేను ఛసే నమ్మను!'' నిరంజనరావు తన వ్యతిరిక్తతను వెడలగక్కాడు.

"ఆ భవనం అక్కడే ఉండి ఉండాలి. కాకపోతే దాన్ని మన కళ్ళకు కనబడకుండా చేశారేమో ఎవరన్నా?'' రాజారావు నిదానంగా అన్నాడు.

"లేదు! కళ్యాణరావు దాన్ని తన జేబులో దాచుకున్నాడు.'' వెటకరించాడు కృష్ణమూర్తి.

నిరంజనరావు గ్యారేజీ దాకా వెళ్ళి, దాని తలుపులు తెరిచి చూశాడు లోపల 'మహల్' దాక్కుందేమోనని. కారూ పెట్రోలు వాసనా తప్పించి లోపల ఇంకేం లేదు.

"మనందరం పీడకలగంటున్నామేమో! లేదా ప్రపంచానికి ఏదో మూడినట్టుంది.!" నిరంజనరావు పెద్దగానే గొణిగాడు.

మెయిన్‌గేటు దాకావెళ్ళి రోడ్డుమీదకు చూశాడు. సందేహం లేదు. అది క్రితంరోజు తాము వచ్చిన రోడ్డే. వాన వలన గండ్లు పడిఉంది రోడ్డంతా. చింతచెట్లూ, మామిడి చెట్లూ రోడ్డుకు రెండువైపులా రక్షక భటుల్లా నిలబడి ఉన్నాయ్.

"ఏమిటి చూస్తున్నారు?" కళ్యాణరావు కంఠం విని నిరంజనరావు వెనక్కి తిరిగి చూశాడు.

"ఏం నా వెంటబడ్డావ్? డాక్టర్ నిన్ను నాకు కాపలాగా పంపాడా?" కర్కశంగా అడిగాడు నిరంజనరావు.

"మీ వెంటబడాల్సిన ఖర్మ నాకేమిటి"? అంతకన్నమొండిగా జవాబిచ్చాడు

"ఏమో! బంగారం ఆచూకీ దొరకబుచ్చుకున్నానన్న అనుమానంతో నా వెంటబడుతున్నావేమో!"

కళ్యాణరావు నవ్వాడు. "మీరు భలే వారండీ,, "రాత్రికి రాత్రే అంతపెద్ద భవనం మాయమయింది. అందులో ఎవరికీ తెలియకుండా," నిక్షేపం చేయబడిన సువర్ణంగూడ మాయమయినట్టేగా?

# 9

"నిన్న సాయంకాలం మనందరమూ గది గదికీ తిరిగిన మహల్ ఈ రోజున మాయమయిందంటే నమ్మాలో, నమ్మలేక ఏడవాలో తెలియటం లేదు." సుగుణ దు:ఖంతో అంది.

"సంస్కృతంలో ఒక నానుడి ఉంది. నిన్న అనేది ఒక పీడకల అయితే రేపనేది ఉజ్వలంగా ఉంటుందట. దయ్యాలూ. భూతాల కథలు నమ్మే ఓపిక ఉంటే, మనం రేపటి దాకా వేచి ఉంటే, మాయమై పోయిన మహల్ తిరిగి ప్రత్యక్ష

మవచ్చేమో!'' కృష్ణమూర్తి విచారంగా అన్నాడు.

అతడు తన ప్యాంటు జేబులో చేయిపెట్టి తాళాం చెవుల గుత్తిని తీశాడు. ''తాళం చెవి ఉంది. తాళమే మాయమయింది. విడ్డూరంగా లేదూ?''అంటూ ఉన్మాదంగా నవ్వాడు అంతలోనే.

హాల్లో సోఫాల్లో కూర్చుని జరిగిన దాని గురించి విచారిస్తున్నారు అందరూ. ఎవరికీ ఏం చేయటానికీ పాలు పోవటం లేదు.

నిరంజనరావు నేల మీాద పరీక్షగా చూశాడు. క్రితం రాత్రి బ్రాందీ సీసా పగిలిపోగా చెల్లా చెదరైన పెంకులు ఇంకా ఒకటీ అరా అక్కడ కూడా కనుపిస్తున్నయి.

''మహల్‌లోంచి తెచ్చిన మీా అమ్మగారి ఫోటో ఎక్కడుంది''? సుగుణ వంక చూస్తూ అడిగాడు నిరంజనరావు.

''ఇప్పుడది ఎందుకండీ! దాన్ని నారూంలో పెట్టాను.'' సుగుణ ముఖంలో విసుగు దల కనుపించింది.

''మీానాన్న మిగిల్చిపోయిన ఆస్తి అదే నీకు. లేకపోతే దాన్నీ ఆ 'మహల్'లోనే ఉంచినట్టయితే, అదీ మాయమయి ఉండేది.''

''ఇప్పుడది ఉన్నా ఒరిగే దేముంది?''

సుగుణ ముఖం వంక చూసి ఊరకుండి పోయాడు నిరంజనరావు.

''ఇక ఇప్పుడు ఏం చేయటం?'' రాజారావుని దానంగా అడిగాడు.

''ఎవరికైనా సహాయం కోసం కబురు పెడితే!'' కృష్ణమూర్తి అన్నాడు రాజారావు ముఖంలోకి చూస్తూ.

''రెక్కలు కట్టుకుని ఎగిరితే కాని అది సాధ్యపడదు. నా కార్లు రెండూ చెడిపోయాయి. పైగా రోడ్ల మీాద గండ్లు పడినయ్ రాత్రి వానకు. ఈ చుట్టు పట్ల ఎక్కడా టెలిఫోన్ గూడా లేదు.'' రాజారావు నిస్పృహతో అన్నాడు.

"మరయితే గ్యారేజీలోని రెండు కార్లూ నిరుపయోగ మేనా? అవి ప్రయాణానికి పనికి రావా ఈ పాడైపోయిన రోడ్ల మీద!" కృష్ణమూర్తి అనుమానంగా అడిగాడు.

"రోడ్లు పాడైపోయినట్టే మన కార్లు రెండూ గూడ పాడైపోయినై. టౌన్‌కి కబురు చేసి మెకానిక్‌ని పిలిపిస్తే గాని లాభంలేదు."

"అసలు మనం ఉండే ఎస్టేట్ నుంచి, టౌన్ ఎంత దూరం ఉంటుంది?" నిరంజనరావు అడిగాడు.

"పదిహేను మైళ్ళు! ఏమిటో! నాకు అంతా అయోమయంగా ఉంది. ఇంతకీ ఆ భవంతి ఏమైపోయినట్టో అని!" రాజారావు విచారంగా అరచేతి మీద తల వాల్చుకుని కూర్చున్నాడు.

"కృష్ణమూర్తీ! ఇక్కడ నుంచి మనం ఎంత త్వరగా బయటపడితే అంత మంచిది. ఇక్కడ ఉన్న కొద్దీ ఇంకా ఎన్ని ఘోరాలు జరుగుతాయో!" నిరంజనరావు అనుమానంగా అన్నాడు.

డాక్టర్ రాజారావు కళ్ళు పెద్దవి అయినయ్. అతడిలో మార్పు తెచ్చిందేమిటా అని డాక్టర్ చూస్తున్న వేపే చూశాడు నిరంజనరావు.

మేడ మెట్ల మీదుగా యాభై ఏళ్ళ స్త్రీ దిగుతోంది నెమ్మదిగా. ఆమె ఎటో శూన్యంలోకి చూస్తున్నది వెర్రిగా. ఆమె తల నెరిసిపోయింది. చర్మం ముడతలు పడింది. ఆమె చేతులు వణుకుతున్నయ్. మెట్ల ప్రక్కనున్న రెయిలింగ్‌ని పట్టుకుని దిగుతోంది. ఆమె శరీరం తెల్లగా పాలిపోయింది.

"ఏమర్రా! సుజాత వచ్చిందట గదా! నాకు చెప్పనే లేదే!" అన్నది ఆమె.

ఆమె రాజారావు అక్క సుందరమ్మ అయి ఉండాలని ఊహించాడు నిరంజనరావు.

ఆమె నేరుగా సుగుణ కూర్చున్న చోటికి వచ్చి ఆమె ప్రక్కనే కూర్చుంది.

"ఏమ్మా సుజాతా? మా అమ్మను వదలి ఇన్నాళ్ళు ఎక్కడకు పోయావే? నీకోసం ఎదురు చూసి నా కళ్ళు కాయలు కాచి పోయాయనుకో!" అంది సుందరమ్మ, సుగుణ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ. రెండో చేత్తో సుగుణ చెక్కిళ్ళను నిమిరింది.

"ఆమె సుజాత కాదు అక్కా! శివరాం ప్రసాద్ కుమార్తె సుగుణ. పోయి పడుకో పో! ఎవరు కనుపించినా ఆమె సుజాతే అంటుంటావ్!" అని విసుక్కున్నాడు రాజారావు. "కాంతం! ఈమెని ఎందుకు రానిచ్చావ్ క్రిందకు. తీసుకు పో! "అని భార్యను కసురుకున్నాడు.

కాంతం గడగడలాడుతూ వచ్చింది. "రావమ్మా! పైకి పోదాం!" అంటూ సుందరమ్మను చేయి పట్టుకొని నడిపించుకు వెళ్ళింది.

ఆమె వెళ్ళిపోయాక రాజారావు నిట్టూర్పు విడిచాడు."

"ఆమె కుమార్తె క్రితం సంవత్సరం కారు ఏక్సిడెంట్‌లో చనిపోయింది. అప్పట్నుంచి సుందరమ్మకు మతి స్తిమితం తప్పింది. ప్రాయంలో ఉన్న ఏ అమ్మాయి కనుపించినా ఆమె సుగుణ అనే అనుకుంటుంది."

"పాపం! ఈ వయసులో ఎంతటి దుఃఖం వచ్చింది?" అక్కడున్న వారంతా సానుభూతి చూపారు.

"ఏమండీ కృష్ణమూర్తిగారూ, నిరంజనరావు గారూ! మనం ఇక్కడ నుంచి వెళ్ళిపోతే మంచిదేమో! మా నాన్న గారి వీలునామా, ఆస్తి లెక్కలూ మా ఆఫీసులో కూర్చుని లెక్క

చూసుకోవచ్చుగదా?"

"శివరాం మిగిల్చిపోయిన బంగారం అంతా మాకొదిలేసి వెళ్ళిపోతారా ఏం?" రాజారావు వెకిలిగా నవ్వాడు.

"బతికుంటే చాలు, బంగారం లేకున్నా ఫరవాలేదు! ప్రాణాలు దక్కితే స్థిరాస్థి చాలదా ఏం, నేను హాయిగా, జీవించటానికి. లాయర్ గారూ! రాజారావు గారి మాటలు పట్టించుకోవద్దు. ఈ ప్రదేశం నుంచి, అంటే పెద్ద పెద్ద భవనాలు సైతం రాత్రికి రాత్రే మాయమయిపోయే ఈ ప్రదేశం నుంచి దూరంగా వెళ్ళిపోవటానికి వీలుంటుందేమో చూడండి!" సుగుణ ఆవేశంగా అంది.

"నీకంటే గూడ ఎక్కువ ఆతృతగా ఉన్నాం తల్లీ, ఇక్కడ నుంచి పారిపోవటానికి! కొంచెం ఓపిక పట్టావంటే ఏదో ఒక మార్గం దొరక్కపోదు. కృష్ణమూర్తి ఆమెకు భరోసా ఇచ్చాడు.

"ఇంతకీ బంగారం సంగతేమిటి?" రాజారావు మళ్ళీ గుర్తు చేశాడు, అందరూ మరిచిపోయిన దాన్ని.

"భవనం మాయమయింది. దానితో బాటు అందులో నిక్షేపించబడిన కాంచనం కూడా మాయమైంది. ఆ విలువైన ఆస్థి అంతా సుగుణకు చెందాలి మరి!"

"ఆ విషయం తర్వాత! ముందు భవనాన్ని దొరక బుచ్చుకోవాలి గదా?" రాజారావు చటుక్కున అన్నాడు.

# 10

"మాయమైన భవనాన్ని దొరక పుచ్చుకోవాలంటే, శివరాం ప్రసాద్ జీవిత చరిత్ర కొంత తెలుసుకోవటం అవసరం?" నిరంజనరావు అన్నాడు నింపాదిగా.

"అడగండి, మీకు ఏ విషయం గురించి సమాచారం

కావాలో!'' రాజారావు సోఫాలోంచి ముందుకు జరిగి కూర్చున్నాడు.

''మీరు శివరాం ప్రసాద్ దగ్గర చేరి ఎన్నాళ్ళవుతుంది?''

''ఒక ఏడాది! అంతకు పూర్వం రామాపురంలో ప్రాక్టీస్ చేస్తుండేవాడ్ని. శివరాంని చూడడానికి వచ్చాను ఒకసారి. లక్షలకు అధిపతి అయిన శివరాం తగిన వైద్య సదుపాయం గూడా లేకుండా మగ్గిపోతున్నాడు.''

''అప్పుడు మీరతడికి వైద్యం మొదలెట్టారు?''

''అది అంత తేలిక విషయమా? ఆయనకు ఊరికే వైద్యం చేస్తానంటే, నన్నూ, నాకుటుంబాన్నీ ఇక్కడకు వచ్చి ఉండమన్నాడు. అప్పుడే భవంతి ఖాళీగా, తాళం వేయబడి ఉంది.''

''ఈ ఒక్క వ్యక్తికి వైద్యం చేయటానికి మీరు మీ ఊళ్ళోని ప్రాక్టీసు వదులుకుని వచ్చేశారా?''

రాజారావు చిరునవ్వు నవ్వాడు. ''మా ఊళ్ళో నలుగు రయిదుగురు వైద్యులున్నారు. నాప్రాక్టీసు అంతగా ఉండేది కాదు. అందుకే శివరాం రమ్మనగానే, మాకుటుంబం నిశ్చింతగా నివసించవచ్చని. వెంటనే వచ్చేశాం!''

''అలాగే చుట్టం చూపుగా వచ్చి, మీకు ఆతిధ్యాన్నిచ్చిన వ్యక్తినే పొట్టన బెట్టుకున్నారు. అలాగే భవనాన్నిగూడా మాయంచేశారు.'' కృష్ణమూర్తి, రాజారావుని ఆరోపించాడు.

''అవునూ! శివరాం చనిపోయాక వారం రోజులు మీరా మహల్ లోపల తలుపులు బిగించుకుని కూర్చున్నారు కదా? లోపల మీకు బంగారం కనుపించ లేదా?'' రాజారావు కృష్ణమూర్తిని అడిగాడు.

''లేదు. బంగారం అంతా ఎవరో ఎత్తుకు పోయారు

అప్పటికే!'' కోపంగా అన్నాడు కృష్ణమూర్తి.

''ఆ ఇంట్లో బంగారాన్ని ముందే కాజేస్తే, ఇక ఆభవంతిని మాయం చేయాల్సిన అవసరం ఎవరికుంటుంది?'' రాజారావు ఎదురు ప్రశ్నవేశాడు.

''ఇతగాడి సంగతేమిటో! కళ్యాణరావు ఎవరు? అతడు ఎక్కడ నుంచి వచ్చాడు. అతడి వాలకం చూస్తుంటే కేడీ లాగా కనబడుతున్నాడే!'' కృష్ణమూర్తి, కళ్యాణరావు వంక చూశాడు.

''నీవు ఈ ఇంట్లో ఉన్న అందర్నీ అనుమానిస్తున్నావే!'' నిరంజనరావు నవ్వుతూ అన్నాడు.

''అనుమానించనివ్వండి! ఆయన సందేహాలు గూడా తీర్చుకో నివ్వండి!'' రాజారావు అడ్డం తగిలాడు.

''లేదండీ! కళ్యాణరావుని అనుమానించక్కర్లేదు. అతడు పైకి అలానే కనుపించినా, స్వభావం మంచిది.'' సుగుణ వత్తాసు పలికింది.

''పోతే ఈ ఇంటి నిర్మాణం చేసిన మేస్త్రీ ఎవరో తెలుసా?''

''తెలుసు కానీ అతడు పరమ పదించి నాలుగేళ్ళయింది.''

''శివరాం ప్రసాద్ భార్య గురించి చెప్పండి!'' నిరంజన రావు ప్రశ్నించాడు.

''భార్య కాదు, భార్యలు అనండి!'' రాజారావు కరెక్ట్ చేశాడు.

''పోనీ భార్యలే అనుకుందాం!''

''మొదటి భార్య పరమ సాత్వికురాలు. ఆమెను నానా హింసలు పెట్టాడు శివరాం. సరిగా తిండికూడా పెట్టేవాడు కాదట. ఆమె కొన్నాళ్ళు కాపురం చేసి ఇతగాడి బాధలు పడలేక

భర్తను వదలి పెట్టి వెళ్ళిపోయింది.''

''తర్వాత?''

''తరువాత శివరాం మరో స్త్రీని వివాహమాడాడు. ఆమెకు సుగుణ జన్మించింది. నాలుగేళ్ళు కాపురం చేసి రెండో భార్య చనిపోయింది.''

''ఏంజబ్బో?''

''జబ్బేం లేదు. మాబంధు వర్గం అంతా శివరాం పెట్టే బాధలకు తట్టుకోలేక చనిపోయిందనే అంటారు.''

''నా చిన్నప్పుడే కదూ? నేను ఎప్పుడూ బస్తీలో కాన్వెంట్ హాస్టల్లోనే వుండేదాన్ని. అప్పుడప్పుడు మా అమ్మ, నాన్నా వచ్చి చూసెళ్ళుతుండే వాళ్ళు. అందువలన వాళ్ళ దాంపత్యం గురించి నాకు ఆట్టే తెలియదు ,'' సిగ్గు పడుతూ అంది సుగుణ.

''అసలునేనిక్కడకు వచ్చింది మొదలు, చివరిదాకా నీవు నా నీడలా అంటిపెట్టుకునే ఉన్నావ్ రాజారావ్! కనీసం పది నిముషాలు నన్నూ, శివరాంని ఒంటరిగా వదలి పోలేదు. ఎందుకంటే అసలు రహస్యాన్ని నేను కనుక్కుంటే, ఆ బంగారం అంతా అతడి కమార్తెకు అప్పజెబుతాననే నీభయం. అది పడగొట్టేందుకే నీవు తంటాలు పడ్డావ్! కనుకనే నిన్ను అనుమానించ వలసి వస్తోంది.'' లాయర్ కృష్ణమూర్తి మరోసారి రాజారావుపై ఆరోపణ చేశాడు.

''మీా అనుమానాల్ని ఆ బ్రహ్మదేవుడుగూడా నివారించ లేడు'' రాజారావు విసురుగా అన్నాడు.

కాంతం లోపలనుంచి హాల్లోకి వచ్చింది.

''మీారు భోజనాలు కానిచ్చినతర్వాత తీరికగా మాట్లాడుకోవచ్చు!'' అంది బెరుకు బెరుకుగా.

బయట మళ్ళీ వర్షం ప్రారంభమయింది.

# 11

రాత్రి పదకొండు గంటలవుతోంది. మధ్యాహ్నం అనగా ప్రారంభమైనవర్షం ఇంకా కుండపోతగా కురుస్తూనే ఉంది.

నిరంజనరావు బెడ్‌మీద అసహనంగా కదిలాడు. తనోసారి కృష్ణమూర్తి గదిలోకి వెళ్ళితే, అతనితో ఏకాంతంగా చర్చించవచ్చు. డాక్టర్ రాజారావు ఎప్పుడూ తమ వెంటే ఉండటం వలన, ఇద్దరూ ఏకాంతంగా కలవటమే కుదరటంలేదు!

బెడ్‌మీదనుంచి లేచి పిస్టల్ పైజమా బెల్ట్‌లో దోపుకున్నాడు. పెన్‌టార్చి తీసునుని మెల్లిగా బయటకువచ్చాడు.

తన గదికిగానీ, కృష్ణమూర్తిగదికిగానీ, సుగుణ గదికిగానీ వేటికీ గొళ్ళేలుకానీ, గడియలుగానీ, లేవు గనుక, కృష్ణమూర్తి గాఢనిద్రలో ఉన్నా తను అతడి దగ్గరకు నిరాటంకంగా వెళ్ళి అతడ్ని నిద్రలేపవచ్చు.

చీకట్లో ఎవరో వరండాలో నడుస్తున్నట్టుగా తోచింది. అతడొక ఒక స్తంభంచాటున నక్కాడు.

ఆగంతకుడు రబ్బర్‌సోల్ పాదరక్షలు తొడుక్కుని, శబ్దంకాకుండా జాగ్రత్తగా నడుస్తున్నాడు.

అతడు డాక్టర్ రాజారావేనని ఇట్టే పోల్చుకున్నాడు నిరంజనరావు, అతడి స్థూలకాయాన్ని బట్టి. ఆ భవంతిలో రాజారావులాంటి లావాటివ్యక్తి మరోడులేడు.

రాజారావు, సుగుణ గదితలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళాడు. అతడి వెనుకగా తలుపులు మూసుకున్నాయ్.

నిరంజనరావు ఒక్క నిముషం తటపటాయించాడు. సుగుణ గదిలోంచి ఆర్తనాదం వచ్చేదాకా తను వేచి ఉండాలా? లేక రాజారావు లోపల తను తలపెట్టిన ఘాతకం పూర్తిచేసుకుని వచ్చాక అతడ్ని పట్టుకోవాలా?

సుగుణ ప్రాణాలకు అపాయం వాటిల్లేలోగానే, తను లోపలకు జొరబడి, ఆమెను రక్షించుకోవడమే తక్షణ కర్తవ్యం గా తోచింది నిరంజనరావుకు.

అనుకున్నదే తడవుగా గబగబ అడుగుల శబ్దము చేసుకుంటూ సుగుణగదిలోకి వెళ్ళి టార్చి స్విచ్చివేశాడు అంతవరకూ చీకటిగా ఉన్నగది వెలుగుతో నిండిపోయింది.

"కదలకుండా అలాగే నిలబడు మిష్టర్ రాజారావు! నా చేతిలో రివాల్వరు అపరాధుల్ని జాలి తలచదు!" కర్కశంగా అన్నాడు.

"నేను అపరాధిని అయితేనేగదా భయపడాల్సింది!" రాజారావు వెనుతిరిగిచూశాడు. అతడి ముఖం ప్రశాంతంగా ఉంది.

లైటువెలుగు భరించలేనిదానిలా సుగుణ కళ్ళునులుముకుని కళ్ళు తెరిచి చూసింది.

ఎదురుగా రాజారావు, రివాల్వర్ చేతులో పట్టుకున్న నిరంజనరావు కనబడ్డాడు.

"ఏమిటండీ? ఏంజరిగింది?"

రాజారావు టేబుల్ మీదున్న క్యాండిల్ వెలిగించాడు. అగ్గిపుల్లగీసి.

"ఇక మీటార్చి ఆర్పెయ్యండి బ్యాటరీలు అయిపోగలవు!" అన్నాడు నింపాదిగా రాజారావు.

"సుగుణా! నీవు బాగానే ఉన్నావుకదా? "

"బాగానే ఉన్నానండీ! అసలేం జరిగింది?"

"చెప్పండి డాక్టర్! మీరెందుకువచ్చారో!

"సుగుణ ఏదోకలవరించినట్టుగా తోచింది. అందుకే పైకి వచ్చాను. ఆమె కేమన్నా అపద వాటిల్లిందేమో అని.

ఆమె ఆస్తిని ఆమెకు అప్పగించేదాకా ఆమెను కంటికి రెప్పలా కాపాడేబాధ్యత నామీద ఉంది కదా?'' రాజా రావు భుజాలు ఎగురవేశాడు.

''కలవరించానా నేను! నాకు జ్ఞప్తిలేదు. కాని నాకు నిద్రలో ఏదో పీడకలవచ్చింది. మీ రాకతో నిద్ర మెలకువ వచ్చింది! అంతే!''

''పోనీ ఆమె కలవరించిందే అనుకుందాం? ఆమె ప్రక్క గదిలో ఉన్నమాకు వినబడకుండానే క్రింది అంతస్తులోని మీకు ఎలా వినబడినయ్ డాక్టర్! ఇతగాడు నీ ఒంటిమీదేవన్నా చెయ్యి వేశాడా సుగుణా!''

''లేదండీ! నన్ను ముట్టలేదు. అతడు నన్ను స్పృశించి ఉంటే నేనీపాటికి చనిపోయి ఉండే దాన్నేమో!''

''అబ్బ! ఎంత భయంకరంగా చిత్రించావ్ నన్ను!'' రాజా రావు నవ్వాడు.

''సుగుణ క్షేమం గురించి నేను అతిగా జాగ్రత్త తీసు కుంటున్నానేమో! అందుకే ఆమె కలవరించినట్టు నాకు తోచి ఉండవచ్చు! వస్తాను సుగుణా! తీయటి స్వప్నాలు కను మిగిలిన రాత్రంతా!'' డాక్టర్ రాజారావు బయటకు వెళ్ళిపోయాడు.

''వెళ్ళొస్తాను సుగుణా! తలుపు వేసుకుని, తలుపుకు టేబుల్‌ని అడ్డంగా జరుపుకో!'' అనిసలహా ఇచ్చాడు నిరంజన రావు.

''అలాగేనండీ! రేపన్నా మనం ఈ దయ్యాల కొంపలోంచి బయటపడే మార్గం ఆలోచించండీ సార్! ఇక్కడ ఉంటే నాకు ఉన్న మతిగూడ పోయేలా ఉంది.'' సుగుణ ప్రార్థయు పూర్వ కంగా అంది.

''చూడమ్మా! నీకు నిజంగానే ఇక్కడనుంచి పారిపోవాలని

పిస్తున్నదా?''

''అయ్యో! నూటికి నూరుపాళ్ళూ నుమండి! ఈ పాడు వానేగనుక లేకపోయినట్లయితే, కారేసుకుని వెళ్ళిపోయి, మీాకు తర్వాత కబురు పంపేదాన్ని, నేను వెళ్ళిపోయినట్టు.''

''మనం వెళ్ళాలనుకున్నా. ఈ డాక్టర్ మనల్ని పోనిస్తాడం టావా?''

''అతడి తల్లో జేజి అడ్డం వచ్చినా. నన్ను రేపు విజయ వాడ చేర్చవలసిన భారం మీాది!''

''రాజారావు నీ గదిలోకి దొంగచాటుగా రావల్సిన అవసరం ఏముంటుంది? నీ దగ్గరవిలువైన వేమన్నా వస్తువులున్నాయా?,,

''విలువైన వస్తువులా? ఈ వాచీ తప్ప నా ఒంటిమీాద ఇంకేమీాలేవే?'' సుగుణ ఆశ్చర్య పోతూఅంది.

''అవి కాదమ్మా! పాతఉత్తరాలు, డైరీలు ఇలాంటివి!.,

''అబ్బే ఏం లేవండీ!''

''రైట్! తలుపేసుకుని పడుకోమ్మా! టేబుల్ తలుపు కడ్డంగా లాగడం మరిచిపోకు!'' నిరంజనరావు, బయటకు నడిచాడు.

# 12

సుగుణ గదిలోంచి బయటకువచ్చి వరండాలో నిల్చుని సిగరెట్ వెలిగించాడు నిరంజనరావు.

సుగుణ టేబుల్ జరుపుతున్న చప్పుడు బయటకు విని పించింది. ''గుడ్‌గర్ల్'' అనుకుని సిగరెట్ దమ్ము గబ గబ నాలుగుసార్లు లాగి అవతల పారేశాడు.

నేరుగా లాయర్ కృష్ణమూర్తి గదితలుపు తోసుకుని లోపల ప్రవేశించాడు.

బెడ్‌మీాద పొర్లుతున్న కృష్ణమూర్తి కళ్ళు తెరిచాడు

చీకట్లో ఎవరో వ్యక్తి తనగదిలోకి ప్రవేశిస్తున్నాడు. కృష్ణమూర్తి చెయ్యి అప్రయత్నంగా దిండు క్రిందకు పోయింది.

"ఎవరా వచ్చేది? అక్కడే ఆగండి! నా చేతిలో రివాల్వర్ ఉంది." అన్నాడు కృష్ణమూర్తి, కూర్చుని.

"నీ దగ్గరే కాదు, నా దగ్గరా ఉంది రివాల్వర్!" అంటూ నవ్వాడు నిరంజనరావు.

"ఓ! నువ్వా! రా! రా! ఇలా కూర్చో!" అంటూ ప్రక్కకు జరిగాడు కృష్ణమూర్తి.

"నీ గది గడియకూడ, నా గది గడియలాగ సుగుణ గది గడియలాగా, అదృశ్యమైన 'మహల్' లాగ మాయమయిందా ఏం?" నిరంజనరావు హాస్యంగా అన్నాడు.

"అదిసరే నిరంజనా! ఇంతకీ నీ అభిప్రాయం ఏమిటి?"

"ఇప్పుడే అందరి గదులూ చూసి వస్తున్నాను. కళ్యాణరావు బెడ్ బోసిగా ఉంది. గడచిన రెండు మూడు రోజాలనుంచీ దాని మీద ఎవరూ శయనించలేదు!" నిరంజనరావు సీరియస్‌గా అన్నాడు.

"మై గాడ్! నిజంగా? వాడ్ని చూడంగానే, నేను ముందే అనుమానించాను, వాడు ఎంతకైనా తెగించినవాడని!"

"రాజారావు గూడ తనగదిలో లేడు! వీళ్ళిద్దరూ ఎక్కడికి పోతున్నట్టు రాత్రిళ్ళు? ఎం చేస్తున్నట్టు? ఇద్దరూ విడి విడిగా వెళ్తున్నారా? లేక కలిసే పోతున్నారా?"

"నా బుర్ర పనిచేయటం మానేసింది, ఆ 'మహల్' మాయమయినప్పట్నుంచీ!" కృష్ణమూర్తి నిస్సహాయంగా చూశాడు.

"నా ప్రశ్నలకు సమాధానం దొరికితే ఈ కేసులోని మిస్టరీ మంచు విడిపోయినట్టుగా విడిపోతుంది."

"ఏమోనబ్బా! ఆ తిప్పలేవో నీవే పడు! కోర్టులో అయితే జల్లగుర్తి పైకప్పు ఎగిరిపోయేలా వాదించగలను, కానీ ఇలాంటి వాటిల్లో నాకు అనుభవం తక్కువనే గదా నిన్ను తెచ్చుకుంది."

"సరేలే! వాటికి సమాధానాలు నేనే ఆరా తీసి దొరకబుచ్చుకుంటాను! కాని నీవు మాత్రం నన్ను కనిపెట్టి ఉండు. తర్వాత అంశం, నేను మాయమయిపోవచ్చేమో!" నిరంజనరావు రానున్న ప్రమాదాన్ని ముందే హెచ్చరించాడు.

నిరంజనరావు తిరిగి తన గదిలోకి వచ్చి పడుకున్నాడు.

తెల్లవారుజామున అతడికి మెలుకువ వచ్చింది. నైట్ గౌన్ తొడుక్కుని నెత్తికి మఫ్లర్ చుట్టుకుని పిల్లిలా జారుకుని భవంతి వెనుక వేపుగా క్రిందికి దిగాడు నిరంజనరావు.

తెల్లవారుతున్నదేమో చెట్లమీద పక్షులు కిలకిల రావాలు చేస్తున్నయ్.

భవంతి వెనుకగా అడవిలాగ చెట్లతోపులున్నయ్. చెట్ల సముదాయంలోకి అడుగు వెడల్పున కాలిబాట పోతున్నది.

నిరంజనరావు ఆ బాట వెంటే ముందుకు సాగాడు. వాన జల్లు పడుతూనే ఉంది. వానకు తోడుగా చెట్ల ఆకుల మీద నుంచి క్రిందకు జాలువారే నీటి బిందువులు మీదపడి అతడికి చిరాకుని కలుగజేస్తున్నాయ్.

పదిగజాలు నడిచాడు నిరంజనరావు. అతడి కళ్ళకు ఏమీ అనుమానించదగ్గ విషయం కనుపించలేదు.

వెనుకనుంచి ఎవరో అతడి తలపై బలంగా కొట్టారు. అతడి కళ్ళముందు బైర్లు కమ్మినయ్. నిరంజనరావు స్పృహ తప్పి పడిపోయాడు.

# 13

నిరంజనరావు కళ్ళు తెరిచాడు. ఎదురుగా కృష్ణమూర్తి

ఉన్నాడు. తన ఒడిలో నిరంజనరావు తలను ఉంచుకొని స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూపిస్తున్నాడు.

"నిరంజనా? ఎలా ఉంది?" ఆత్రంగా అడిగాడు కృష్ణ మూర్తి.

నిరంజనరావు లేచి కూర్చున్నాడు. "నాకేమయింది. ఆకాశంలోంచి పిడుగు పడిందా నా నెత్తిన? 'మహల్'ని మటు మాయంచేసిన దేవుడే ఈ పిడుగు పాటుని కల్పించి ఉంటాడు. మనం కొంచెం ఆధారాలకు చేరువలోకి వస్తున్నాం!" అన్నాడు.గా మబ్బుల్లోకి చూస్తూ.

"ఏమిటా పలవరింతలు?" కృష్ణమూర్తి అయోమ యంగా అడిగాడు.

"ఈ అడవికి చివరగా మంత్రాల మర్రి ఉంటుంది. మనుషుల్ని అదృశ్యం చేసే విధానాలూ, రాత్రికి రాత్రే భవంతు లను మటు మాయంచేసే రహస్యాలు అన్నీ అక్కడ దొరుకు తయ్. కానీ మనం అందాకా వెళ్ళలేం! వెళ్ళనివ్వరుగూడా. నన్ను రక్షించింది నీవేనా కృష్ణమూర్తీ?"

"అవరా నీడ్లైలాగులు! నీవు ప్రాణాలతో ఉన్నావో లేవో అని ఇంతదాక భయపడ్డాను. ఇప్పుడేమో నీకు మతి ఉన్నదా లేదా అని ఝుడుసుకుంటున్నాను. తెల్లవారు జామున నీవు గదిలో లేవు చూస్తే! నాకనుమానంవేసి మెట్లుదిగి వచ్చాను. నీ పాదరక్షల అడుగున ప్రత్యేక డిజైను ఉంది కదూ! ఆ అడుగుల ముద్రలు బురద నేల మీాద స్పష్టంగా కనబడుతున్నయ్. వాటిననుసరించే నిన్ను కనుక్కున్నాను."

"మంచి పని చేశావ్! కానీ భగవంతుడు నాతోనే చెలగాట మాడుతున్నాడు. కానీ ఆ దేవుడుగూడ ఈ మానవుడి చేతిలో ఓడిపోక తప్పదు."

"నీ మాటలు ఒక్కటీ నాకర్థం కావటంలేదు.'' కృష్ణమూర్తి నెత్తి నోరు బాదుకున్నాడు.

"అయితే దొంగచాటుగా నా వెనుకనుంచి నాపై దెబ్బ తీసి నన్ను చంపకుండా ఎందుకు వదిలిపెట్టాడు? అతడు తల్చుకుంటే స్పృహలో లేని నన్ను సునాయాసంగా చంపివేయవచ్చునే?'' నిరంజనరావు తన ధోరణి వదల లేదు.

అంతలోనే మరో విచిత్రం జరిగింది.

'భవంతిలో రివాల్వర్ ప్రేలుడు వినిపించింది. మిత్రులిద్దరూ ఉలిక్కిపడి అటుగా చూశారు.

"త్వరగా పరిగెత్తు'' అంటూ నిరంజనరావు తీచి భవంతి వేపుగా పరుగు తీశాడు.

కృష్ణమూర్తి కూడా అతడ్ని అనుసరించాడు.

వారిద్దరూ మహల్ దగ్గరకు చేరేసరికి రాజారావూ, కాంతం ఇద్దరూ హడావిడిగా ఆతృతగా అటూ ఇటూ పరుగెత్తుతున్నారు. ఎందుకో తెలీకుండానే.

"మీరుకూడా విన్నారా? ఎక్కడో పిస్టల్ ప్రేలుడు వినిపించింది. ఎక్కడో ఏమిటో అంతు పట్టటం లేదు!'' అన్నాడు రాజారావు కృష్ణమూర్తి, అతడి మిత్రుడివంకాచూస్తూ.

"ఎక్కడా ప్రేలింది?'' కృష్ణమూర్తి అడిగాడు.

"అదే తెలియడంలేదు. ఏమైనా ఆ హంతకుడెవరో ధైర్యంగా పట్టపగలే ప్రత్యక్ష మవుతున్నట్టున్నాడే!''

"ఎవరు హంతకుడు?''

"నా కంటబడేదాకా ఆగండి, వాడ్ని పట్టిస్తాను. అన్నాడు రాజారావు,

నిరంజనరావు పకపకా నవ్వాడు రాజారావు మాటలకు.

"అన్నట్టు కళ్యాణరావు ఎక్కడ?'' కృష్ణమూర్తి సీరియస్

గా అడిగాడు.

"అదేమో నాకూ తెలియదు."

నిరంజనరావు మేడమీదకు పరిగెత్తాడు. సుగుణ గదిలో కాంతంగూడా ఉంది. సుగుణ భయంతో కాంతంని కౌగిలించుకొని కూర్చున్నది.

"అయ్యా! మీరేమో గజంగజం భూతద్దాలతో పరీక్షిస్తూ కాలం గడిపేయండి. ఇక్కడ నాకేమో ప్రాణభయం అంతకంతకూ ఎక్కువైపోతున్నది. నేను బ్రతికుండగా నన్ను బయటకు జేరుస్తారా, లేదా?" సుగుణ విష్ఫారంగా అంది.

"ఇవాళ మన ప్రయాణం ఖాయం! సరేనా?" అంటూనే నిరంజనరావు తన స్నేహితుడి గదిలోకి వెళ్ళాడు. తలగడను మూలగా పారేశాడు.

తలగడక్రింద రివాల్వర్ ఉంది. దాన్ని జేబుగుడ్డతో అందుకొని ముక్కుదగ్గర పెట్టుకొని వాసన చూశాడు.

రివాల్వర్ కొద్ది క్షణాల క్రితమే పేలినట్లుగా తెలుస్తోంది. అయితే దానిమీద ఏవిధమైన వేలిముద్రలు లేవు.

కృష్ణమూర్తి గూడా గదిలోకి వచ్చాడు.

"నీ రివాల్వర్ పేలింది. బారల్ ఇంకా వెచ్చగా ఉంది. మజిల్‌లో చలనం తెలుస్తూనేఉంది."

"ఏమిటి దీనర్థం! ఎవరిని హత్య చేయాలని ప్రయత్నం జరిగింది." కృష్ణమూర్తి కలవరపడ్డాడు.

నిరంజనరావు అతడి చెవిలో నోరుపెట్టి అన్నాడు. "ఇది హత్యా ప్రయత్నంకాదు. చెట్లల్లోనుంచి మనల్ని ఇక్కడకు రప్పించటానికి తతంగం, అంతేకాదూ.! ఈ షాట్ మనం ప్రమాదకరమైన విషయాలు. కనుక్కుంటున్నామని ఒక రకమైన హెచ్చరిక."

"అంటే వాళ్ళ రహస్యాలకు చేరువవుతున్నామని వాళ్ళు బాధపడుతున్నారన్నమాట!" కృష్ణమూర్తి ఆచూకీ దొరికిన వానిలా అన్నాడు.

"కరెక్ట్!" నిరంజనరావు గర్వంగా కనుబొమలు ఎగరేశాడు.

# 14

ఆరోజంతా మరేలాటి చెప్పుకోదగిన సంఘటనలు జరగకుండానే ప్రొద్దుకూకింది, కరెంటు లేదు. ఆ భవంతిలో డైనింగ్ హాల్లోనూ, డ్రాయింగ్‌రూం లోనూ పెట్రోమాక్స్ లైట్లు వెలుగుతున్నాయి. మిగతా ప్రదేశాల్లో అవసరమైన చోట్ల కొవ్వొత్తులు మాత్రమే మసకవెలుగునిస్తున్నాయి.

రాత్రి పదయినా నిరంజనరావుకు నిద్ర రావటంలేదు. లేచి వరండాలో రెయిల్స్ మీదుగా వంగి నిశీధిలోకి చూస్తూ సిగరెట్‌మీద సిగరెట్ కాల్చి పారేశాడు చాలాసేపు.

తలుపులు నెట్టుకొని కృష్ణమూర్తి గదిలోకి వెళ్ళాడు, లోపల బెడ్‌మీద కృష్ణమూర్తి అటూఇటూ పొర్లుతున్నాడు.

"ఏం నిద్ర రావటంలేదా?" నవ్వుతూ అడిగాడు నిరంజనరావు.

"నిద్రా? ఈ భూత్ బంగళాలో నిద్ర ఎలా పడుతుంది. నీ వాలకంచూస్తే, మనిషి మంచి హుషారులో ఉన్నట్లుగాఉందే.

"ఉషారుసంగతి దేవుడెరుగు! బ్రతికిఉన్నాం! అంతే!"

నిరంజనరావు క్రితంరాత్రి సుగుణ గదిలోకి రాజారావు ప్రవేశించటం గురించి చెప్పాడు.

ఈ రాజారావు పైకి కనిపించేటంతటి అమాయకుడు కాదు వీడితత్వం పూర్తిగా బోధపడిందినాకు. ఇక నీడి ఆటలు ఆట్టేకాలం సాగనివ్వను. పాపం! ఆ అమ్మాయి! ఆఁ! అన్నట్టు నీకు చెప్పటం మరిచాను. రేపుమనం కారులో ప్రయాణమవు

తున్నాం. వానరానీ, వరదరానీ, మన ప్రయాణం ఆగదు!''

వెళ్ళే దోవలో రోడ్డు మీాది గండిలో కారు పడిందంటే మనం అక్కడికక్కడే గుటుక్కుమంటాం! ఏమయినా ఇక్కడ చేతులు ముడుచుకుని చూడడం కన్న, అలా వీరోచితంగా చావడమే మేలు! పద! నీతో బాటు నరకానికి రమ్మన్నా వస్తాను.'' తెగించిన వాడిలా పలికాడు కృష్ణమూర్తి.

''మరీ అలాకేసు ఓడిపోయిన లాయర్లా పోజు పెట్టకు!''

కాకపోతే మరేమిటి? నా జీవితంలో ఎన్నో విచిత్రమైన కేసులు చూశాను. కాని ఇలాంటి కేసు తగల్లేదు. రాత్రికి రాత్రే లంకంత మేడ మాయం అవుతుందా?''

''కేసు ఇంతదాకా నడిచాక ఇప్పుడు నీవు అలాబెంబేలు పడక్కర్లేదు. 'మహల్' మాయమైనదన్న ఆతృతలో మనం ఇది ఇంద్రజాలమా, భూతప్రేత పిశాచ మాంత్రికుల పనా అనే అయోమయంలోపడి అసలు విషయానికి దూరమైపోతున్నాం.'' నిరంజనరావు పెదాల మధ్య సిగరెట్ తీయకుండానే చెప్పాడు.

''కృష్ణమూర్తి అతడ్ని రెండుచేతులతో కుదిపేశాడు. ఏమిటీ? నీకు ఈ కేసుఆచూకీ చిక్కిందా? నీకు గూడా మంత్ర తంత్రాలు ఏమైనా తెలుసునా?''

''మంత్రాలు రావు! తంత్రాలు తెలుసు. కుతంత్రాలుచేసే వాళ్ళ గుట్టుమట్టులన్నీ ఎలా దొరకపుచ్చుకోవాలో తెలుసును. లక్షల విలువచేసే బంగారునిధి 'మహల్' లో నిక్షిప్తమై ఉంది. 'మహల్' మాయమయింది. నిధి దొరకాలంటే మహల్‌ని దొరకబుచ్చుకోవాలి.''

''నీవు ఊరికే తిని కూర్చుని సిగరెట్లు త్రాగిపారేస్తూ, కాలాన్ని వృధాగా గడిపేస్తున్నావనే అనుకుంటున్నాను. కానీ నీ బుర్ర ఇంత చురుకుగా పని చేస్తున్నదని ఊహించనేలేదు సుమా!

ఆ రహస్యమేమిటో చెబుదూ?'' కృష్ణమూర్తి ప్రాధేయపడ్డాడు.

''నీకు చెప్పినా ఇప్పుడు నీవు దాన్ని నమ్మలేవు. అదీగాక ఈ చీకట్లో దాన్ని ఎవరైనా 'తసమదీయులు, విన్నారంటే మన పరిశోధన అంతా వృథా అయిపోతుంది. కనుక, మిత్రమా, హాయిగా నిద్రపో! రేపే ప్రయాణానికి సిద్ధంకా!'' అంటూ నిరంజనరావు లేచాడు.

''ఆగు! రేపటిదాకా నన్ను సస్పెన్సులో ఉంచి చంపకు. అదేదో నా చెవులో ఊదిపో, ఎవరూ వినకుండా.'' కృష్ణమూర్తి ఆతృతను కనబరిచాడు.

''హాయిగా పడుకో అన్నాను! పడుకో!'' భుజం తడుతూ చెప్పాడు నిరంజనరావు.

''కాదు. నీవు ఇప్పుడే' ఇక్కడే చెప్పాలి!''

''ఇప్పుడు వద్దు. నా ఆలోచనకు నీవు నవ్వుతావు.''

''నేనిప్పుడు నవ్వే స్థితిలోలేను. ఈ కేసు తేలకపోతే ఆరున్నొక్క రాగం ఆలాపించవలసి వస్తుంది గూడా!

''ఎలా మాయమయిన మహల్, అలానే వస్తుంది. తెలిసిందా ఇక వివరాలు అడగకు. బెడ్ మీద వాలిపోయి పడుకో!'' నిరంజనరావు చరచరా బయటకు నడిచాడు.

అతడు వెళ్ళిన వేపే గుడ్లప్పగించి చూస్తూ కూర్చుండి పోయాడు లాయర్ కృష్ణమూర్తి.

# 15

మర్నాడు గూడా రోజూలాగే తెల్లవారింది. వాన అయితే తగ్గిందికాని ఇంకా మబ్బులు విడిపోలేదు.

ఉదయం టిఫిన్, కాఫీ సేవించిన తర్వాత నిరంజనరావు గ్యారేజీలోకి వెళ్ళాడు. డాక్టర్ రాజారావు కారు, శివరాం ప్రసాద్ కొత్తకారు రెండూ అందులోనే ఉన్నయ్. రాజారావు రెండు

కార్లో చెడిపోయాయని చెప్పాడు.

శివరాంప్రసాద్ కొత్తకారు బానెట్ ఎత్తాడు. నిరంజన రావుకి నిజానికి కారు మెకానిజం అంతగా తెలీదు. అయినా ప్రయత్నించక చేసేదిలేదు.

గ్యారేజీ తలుపులు బార్లా తీసి ఉంచాడు, తను చాటుగా ఏదన్నా వ్యవహారం చేస్తున్నాడని ఎవరూ అనుమానించకుండా.

ఒక గంటసేపువెతికినా అతడికి కారులో లోపం చిక్కలేదు. విసుగెత్తి, ఇక చాలిద్దాం అనుకుంటూ ఉండగా, ఒకచోట చిన్నవైరు ఖాళీగా ఊగులాడుతుండడం అతడి కంటబడింది.

వైర్‌ఉంటే గానికి ఏక్కడో కనక్షన్ ఉండాలి. మరి ఈ వైర్ ఖాళీగా ఎందుకున్నట్టు? ఆపరిసరాలు వెతికి దాన్నొక చోట కనెక్ట్ చేశాడు.

ఇంజెన్ స్టార్ట్ అయింది. అతడి సంతోషానికి అవధిలేదు.

అంతలోనే ఎవరో వచ్చినట్టుగా అతడిమీద నీడ పడింది. తను ప్రక్కకు తిరిగి చూసేసరికి గేటుదగ్గర కళ్యాణ్ నిలబడి ఉన్నాడు. అతడి చేతిలో రెండు డబ్బాలున్నయి.

"నా వెనుకనే రాలేదేమా అనుకుంటున్నాను. వచ్చావా మిత్రమా?" నవ్వుతూ అడిగాడు కళ్యాణరావును.

అతడి మాటలు పట్టించుకోకుండా అన్నాడు కళ్యాణరావు "ఎక్కడికో ప్రయాణ మవుతున్నారల్లేఉందే?"

మరో సమయంలో అయితే తనపనిలో వాడు జోక్యం కలిగించుకొన్నందుకు వాడ్ని తన్నేవాడే నిరంజనరావు. కానీ ఇప్పుడు అతడితో చర్చ పెట్టుకుంటే ప్రయాణం ఆగిపోతుంది.

"అవును! ప్రయాణమవుతున్నాం?"

"ఎక్కడికి?"

"నీకు చెప్పాలా?"

"నా అనుమతి లేనిదే మీరు ఈ ఆవరణదాటి బయటికి పోలేరు."

నిరంజనరావుకు కోపం వచ్చింది. అయినా తమాయించు కున్నాడు. "నేనూ, లాయర్‌గారూ, సుగుణ ముగ్గురం విజయవాడ తిరిగి వెళ్ళిపోతున్నాం!"

"ఓహో! అలాగా! అయితేమీరు వెళ్లవచ్చు ఈ డబ్బాల్లో పెట్రోలుకూడాఉంది. కావాలంటే వాడుకోండి."

"పెట్రోలా? ఎక్కడిది?"

"అరబ్బీవాడి సమాధి త్రవ్వి తెచ్చాను! ఎక్కడిదయితే మాత్రమేం! మీకు అవసరానికి సమకూర్చాను. వాడుకోండి!"

"అలా అయితే నీ సహాయానికి కృతజ్ఞుడ్ని!" నిరంజన రావు లోలోపల వాడ్ని తిట్టుకుంటూనే అన్నాడు పైకి

"మీరు అనవసరంగా శ్రమపడ్డారు. కారు రిపేర్‌గురించి నేను బాగా చేసేవాడ్నికదా?"

"మరి ఇన్నిరోజులనుంచి ఎందుకు బాగు చేయలేదు."

"నన్నెవరడిగారు?" టాంకులో పెట్రోలుపోసి మాయ మైపోయాడు లోపలి గదుల్లోకి కళ్యాణరావు.

సుగుణ మెట్లమీదనే ఎదురయింది నిరంజనరావుకి.

"కారు బాగయిందా సార్!" అని అడిగింది.

"బాగయింది! మన ప్రయాణానికి సరిపడా పెట్రోలు కూడా సప్లయ్ చేశాడు కళ్యాణరావు!"

"నేను ముందే చెప్పలేదండీ! అతడు పైకి దుడుకు స్వభావం కనబరిచినా, మనిషి మంచివాడే స్వతహాగా." సుగుణ కళ్ళల్లో ఆనందం తొంగి చూచింది. బహుశా ఈ మంత్రాల మహల్ నుంచి వెళ్తున్నందుకేమో! ఆమె గొంతు కూడా తీయగా ధ్వనించింది. ఆమెజలుబు తగ్గిపోయినందువల్ల అయి

ఉండవచ్చు, అనుకున్నాడు నిరంజనరావు.

అంతలో అతడి చూపు నేలమీది తివాసీ మీద పడింది. సుగుణ కూడ ఆశ్చర్యపోతూ ఆతడు చూస్తున్న వేపు చూసింది.

"ఏమిటండి?" అని అడిగింది.

"ఏమీలేదు. భగవంతుడు స్వర్గంలో హాయిగా సుఖాల నుభవిస్తున్నాడు. ఈ భూలోకంలో అన్ని సవ్యంగానే జరిగిపోతు న్నయ్"

సుగుణకు ఏమీ అర్థం కాలేదు. ఆమె మళ్ళీ నేలమీదకు చూసింది.

ఆమె ముఖాన చిరునవ్వు వెలిసింది. మళ్ళీ." ఓ! ఎండ వచ్చిం దనా చూస్తుంట అవును మరి! మూడు నాలుగు రోజాల ముసురు తర్వాత సూర్యభగవానుడి దర్శనం కోసం తహతహ లాడటం సహజమే కదా?" అంది.

నిరంజనరావు కిటికి దగ్గరకు వెళ్ళాడు. కిటికీ లోంచి మేఘంలోంచి బయటకు వచ్చిన సూర్యుడికి నమస్కరించాడు నవ్వుతూ.

"త్వరగా బయలుదేరాలి! మన ప్రయాణానికి సూర్యుడు గూడా కలిసొచ్చాడు. ఇక వాన తగ్గుముఖం పట్టవచ్చు!" సుగుణ ను హెచ్చరించి, కృష్ణమూర్తి కోసం ముందుకు కదిలాడు నిరంజనరావు.

ప్రశాంతంగానూ' భయం కలిగించేలా ఉన్న ఆ భవనంలో సంతోషం వెల్లివిరిసింది. ప్రయాణపు హడావిడీ, వీడ్కోలు చెప్పుకోవటం ఇత్యాది వాటితో కోలాహలంగా ఉంది.

సుగుణ ముస్తాబై ప్రయాణానికి రెడీ అయింది. అందరూ ఆమె గదిలోకే వచ్చారు. కళ్యాణరావు పెట్టె, బెడింగులూ కారులోకి జేరవేశాడు.

సుగుణ తన చేతిలోని పర్సును టేబుల్ మీదున్న తన తల్లి ఫోటో ముందు ఉంచింది. డాక్టర్ రాజారావుకూ, అతడి భార్య కాంతంకూ నమస్కరించింది. తరువాత తన తల్లి ఫోటో ముందు విడిచిన పర్సు చేతబుచ్చుకుని హడావిడిగా బయటకు పరుగెత్తింది.

'వ.హల్'లోంచి తన తల్లి ఫోటోను అంత ఆప్యాయంగా తెచ్చుకుని, తన గదిలోనే పెట్టుకున్న సుగుణ, తను ప్రయాణమై వచ్చేటప్పుడు. ఆ ఫోటోని తెచ్చుకోక పోగా, దాని వంక కన్నెత్తిఆయినా చూడక పోవటం ఒక్క నిరంజనరావు మాత్రమే గమనించి, తనలో తను నవ్వుకున్నాడు.

కారు వెనుక సీట్లో కృష్ణమూర్తి కూర్చుని ఉన్నాడు అప్పటికే. సుగ్గుణ ఆతడి ప్రక్కనే జేరగిలబడింది.

నిరంజనరావు డ్రైవింగ్ సీట్లో కూర్చుని. కారుస్టార్ట్ చేశాడు.

దొర్లుకుంటూ, దొర్లుకుంటూ డాక్టర్ రాజారావు వచ్చాడు కారు దగ్గరికి. "మీరు ఈ రోడ్డమ్మంటే వెళ్ళండి ముక్కుకు సూటిగా. ఎక్కడా మలుపులు గూడా తగలకుండా సరాసరి ట్రంక్ రోడ్డు ఎక్కుతారు. అక్కడ్నుంచి దోవ మీకే తెలుసుగదా!"

నిరంజనరావు మరో సారి తృప్తిగా నవ్వుకున్నాడు. కారు మెయిన్ గేటు దాటి వేగం పుంజుకుంది.

గతుకులోనూ, వాన వలన ఏర్పడిన గుంతల్లోనూ కారు ఆట్టే వేగం పోలేక పోయింది. ఒక గంట ప్రయాణం చేసిన తర్వాత ట్రంక్ రోడ్డెక్కింది కారు. నల్లని తారు రోడ్డు మీద జెర్రిపోతులా కారు దొర్లి పోతూవున్నది.

"అమ్మయ్య! ఆ పరిసరాలు వదలి నాగరిక ప్రపంచంలోకి

అడుగు పెడుతున్నాం!'' అని తృప్తిగా నిట్టూర్చింది సుగుణ.

''మనం ఈ రాత్రికి గెస్ట్ హౌస్‌లో రెస్ట్ తీసుకుని రేపుదయం విజయవాడకు బయలుదేరుదాం! అక్కడ నీవు మా ఇంట్లోనే ఉండచ్చు ఎన్నాళ్ళయినా! మా అవిడకు ఆడపిల్లలంటే అలివిమాలిన ప్రేమ.'' కృష్ణమూర్తి సుగుణనుద్దేశించి అన్నాడు.

''చాలా కృతజ్ఞురాల్ని. మీ మేలు ఈ జన్మలో మరువ లేనండీ!'' అంది సుగుణ అభిమానం ఉట్టిపడేలా.

ట్రాఫిక్ కానిస్టేబిల్ నిలబడ్డ చోట కారు ఆగింది.

సుగుణ ఆ విషయం పసిగట్టి అడిగివది. ''ఏం జరిగిందండీ?''

నిరంజనరావు కారులోంచి తల బయటకు పెట్టి కానిస్టేబిల్‌ని ఏదో అడిగాడు చిన్నగా.

కానిస్టేబుల్ బిత్తరపోయిన వాడిలా చూసాడు అతడి వంక మరుక్షణంలో చేత్తో ఏవో సంజ్ఞలు చేస్తూ ఏదో చెప్పాడు.

కారు బయలుదేరింది.

''ఏమిటండీ? ఏం జరిగింది?'' సుగుణ మళ్ళీ అడిగింది.

ఈ దఫా కృష్ణమూర్తి గూడా సీటుచివరకు జరిగి ''ఏమిటి నిరంజనా?'' మనం దారి తప్పలేదు గదా?'' అని అడిగాడు.

''అదేమీలేదు! సరిగా కూర్చోండి!''అన్నాడు నిరంజనరావ్.

కారు మరో బంగళాముందు ఆగింది. నిరంజనరావు కారు దిగి బంగళాలోకి వెళ్ళాడు, మరో పది నిముషాలతర్వాత హుషారుగా ఈల వేసుకుంటూ బయటకువచ్చి కార్లో కూర్చు న్నాడు.

“ఏమిటిదంతా నిరంజన్?” కృష్ణమూర్తి గద్దించి అడిగాడు.

“చెబుతానుగదా! తొందరెందుకు?” నవ్వుతూ కారుని స్టార్ట్ చేశాడు. బీట్ కానిస్టేబుల్ చుట్టూ ఒక మలుపుతిరిగి వచ్చినదారినే పోనిస్తున్నాడు మళ్ళీ.

“ఈ నాటకం రక్తికట్టపోతున్నది కృష్ణమూర్తీ. ఆ ఆఖరి సీన్ ఎంతో రంజుగా ఉంటుంది.” అన్నాడు నిరంజనరావు.

“ఇదేమిటి? వచ్చినదోవనే వెనక్కు తిరిగి వెళ్తున్నాం! పొర బాటు పడలేదుకదా మీరు?” సుగుణ ఆదుర్దాగా అడిగింది.

“వెనక్కు పోతున్నామా?” కష్ణమూర్తి నమ్మలేనట్టుగా ఒత్తిపలికాడు.

“మళ్ళీ ఆ భూతగృహానికా? బాబోయ్ మళ్ళీనా?” సుగుణ సన్నగా మూలిగింది. వెనక్కుపోనటం సుతరామూ ఇష్టంలేనిదానిలా.

“నేను పొరపడలేదు! మీరు అనవసరంగా కంగారు పడకండి! అంతేకాదు. వెనక్కుతిరిగి చూడండి. మన కారు వెనకే పోలీస్ జీప్ వస్తున్నది. కనుక మీరేం భయపడాల్సినపని లేదు.” కుదురుగా స్టీరింగ్ వీల్‌ని పట్టుకుని చెప్పాడు విరంజన రావు.

“ఏమిటిదంతా? ఇంతదూరం వాన, వరదలో కష్టపడి వచ్చి, మళ్ళీ వెనక్కుపోవడం ఎందుకు?” నగుణ అయో మయంగా అడిగింది.

“ఎందుకంటే నన్నే ట్రిక్ చేయాలనుకున్నవారిని ఇంకా ట్రిక్ చేయడానికి. వాళ్ళపాఠం వారికే అప్పజెప్పటానికి.”

“పాఠం ఏమిటి, ట్రిక్ ఏమిటి?” సుగుణలో అంతకంత కూ భయం ఎక్కువౌతోంది.

ఆమె, కృష్ణమూర్తి ఇద్దరూ గుడ్లప్పగించి అతడి వంకే చూస్తుండిపోయారు.

"అంతేకాదు! ఈ మోసాన్ని క్షమించి వదిలేసినా, నేరపరిశోధకుడిగా ఆ నేరాన్ని, అదే హత్య జరగటాన్ని క్షమించలేను."

"ఏమిటీ? హత్యా?" కృష్ణమూర్తి నోరు తెరిచాడు.

"అవును! ఆ భూత్ బంగళాలో ఒక స్త్రీ దారుణంగా హత్యగావింపబడి ఉండాలి.

వెనుక సీట్లో కూర్చున్న ఇద్దరూ ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నారు. వారి నోటంట మాట పెగల్లేదు.

# 16

కారూ, జీపూ రెండూ గేటుదాటి లోపలకు ప్రవేశించినయ్.

కృష్ణమూర్తి ఆశ్చర్యానికి అంతులేదు. మాయమైపోయిన మహల్ యథాస్థానంలో ఉన్నది. ఒక్క రాయిగూడ చెక్కు చెదరకుండా.

వాహనాలు 'భవంతి'కీ మహల్‌కీ మధ్యన లాన్‌లో ఆగినయ్. రెండు భవనాల్లోంచి దీపాల వెలుగు ఉజ్వలంగా బయటకు వస్తోంది. మహల్‌కి తాళం వేయబడే ఉంది.

కారులోంచి దిగి నిరంజనరావు ఇన్స్‌పెక్టర్ దగ్గరకు వెళ్ళి ఏదో మెల్లగా చెప్పాడు.

జీప్‌లోంచి పోలీసులు దిగి భవంతిలోకి జొరపడ్డారు వేట కుక్కల్లాగ.

అయితే ఇంటి వెనుకగా దొడి గుమ్మం నుంచి కళ్యాణరావు ఎవరికీ తెలియకుండా పరారి అవటాన్ని ఎవరూ గమనించలేదు.

"హలో డాక్టర్! ఏమిటి అలా తెల్లబోయి చూస్తు

న్నారు. ఈ గడుసు పిండం తిరుగు టపాలోనే తిరిగి వచ్చాడేమా అని ఆశ్చర్యపోతున్నావా? ఈ దఫానేనొక్కడ్నే రాలేదు. పోలీసు ఇన్స్పెక్టర్ని గూడా వెంట బట్టుకు వచ్చాను.'' నిరంజనరావు చేతిలో రివాల్వరు నల్లగా మెరుస్తున్నది.

డాక్టర్ రాజారావు గ్లాసు గటకట త్రాగి, ఖాళీచేసి టీపాయ్ మీద ఉంచి, ఇంకా నమ్మలేనట్టుగా ఆగంతకుల వేపు చూశాడు.

పోలీసులు అన్ని గదులు తిరిగి ఇంట్లోని వ్యక్తుల్నందర్నీ హాల్లోకి తీసుకువచ్చి నిలబెట్టారు. రాజారాకు భార్య కాంతం. అక్క సుందరమ్మ మరో ఆడనౌకరు, పనివాడు రంగయ్య, వీళ్ళే ఆ ఇంటిలోని జనాభా.

సింహద్వారం మూసివేయబడింది. కృష్ణమూర్తి, ఇన్స్పెక్టర్, సుగుణ వీరంతా రాజారావు కెదురుగా కూర్చున్నారు సోఫాల్లో.

ఇన్స్పెక్టర్ అన్నాడు ''ఇక అసలు విషయం వివరించండి, నిరంజన్‌రావ్‌గారూ!''

నిరంజనరావు టూకీగా డాక్టర్ రాజారావు ఎలా ఆ ఇంట్లో స్థానం సంపాదించిందీ, అతడి చేతి చలవ వల్ల శివరాం ప్రసాద్ ఎలా స్వర్గం చేరుకున్నదీ టూకీగా చెప్పాడు." అందులో, జా రావు ప్రయత్నపూర్వకంగా, అతడి ఆస్తి ప్తై కోరికతో శివరాం ప్రసాద్‌ని 'స్లోపాయిజన్, చేత హత్యచేసినట్టు ఆరోపించాడు.

''నేనూ, కృష్ణమూర్తి, సుగుణ ఆ రోజు సాయింకాలం డాక్టర్ రాజారావు వెంటవచ్చాం. అప్పుడు డాక్టర్ చిన్న ట్రిక్ చేశాడు.

'లేట్ శివరాం ప్రసాద్ ఒకే మోడల్‌లో ఒకచోట రెండు భవనాలు కట్టించాడు. అవే మనం ఇప్పుడు చూస్తున్నది

ఒకటి తెల్లరంగుది, 'భవంతి' రెండోది గోధుమరంగుది 'మహల్' ఇదే మోడల్‌లో మూడో భవనం గూడా ఉంది. అది ఇక్కడ నుంచి, అడవిలో అడ్డం పడి పోతే ఒక మైలు దూరం ఉంటుంది. మనం చూసిన టీన్‌నుంచి ఈ భవంతులకు రెండు మార్గాలున్నాయ్. ఒక రోడ్డమ్మటే వస్తే ఈ రెండు భవంతుల దగ్గరకు చేరుకుంటాం. మరో త్రోవ వెంట వస్తే ఒంటరి మేడ చేరుకుంటాం.

"మనం విజయవాడమంచి 'అడవులదీవికి వచ్చేటప్పుడు డాక్టర్ రాజారావు డ్రైవింగ్ చేశాడు. ఎందుకో తెలుసా? కారు ప్రయాణంలో, లోపల కూర్చున్న వ్యక్తులకు తాము ఎంత దూరం ప్రయాణించిందీ ఖచ్చితంగా తెలుసుకోలేరు. కానీ డ్రైవరుకు బాగా తెలుస్తుంది. ఆ దూరం మనలో ఎవరం డ్రైవ్‌చేస్తే ఆ దూరంలోని వ్యత్యాసం తెలుస్తుందని రాజారావే కారు నడిపాడు.

"ఇక మనం వచ్చిన రోజు సాయంకాలం సుగుణ గదికి వెళ్ళినపుడు, ఆమె గది కిటికీలోంచి సూర్యుడు అస్తమిస్తూ కనిపించాడు. అంటే పడమరగా 'భవంతి' తూర్పుగా 'మహల్' ఉన్నాయన్నమాట. ఆ రాత్రి నాకూ, కృష్ణమూర్తికీ ఆహారం లోనో, డ్రింక్స్‌లోనో మత్తుమందు కలిపివ్వబడింది. ఎందుకు? మమ్మల్ని 'భవంతి' నుంచి అడవిదాటేసి ఒంటరిగాఉన్న భవనం లోకి చేరవేయాలనే ఉద్దేశ్యంతో.

"మమ్మల్ని భవనంలోంచి మార్చినట్టుగా అనుమానం రాకుండా ఉండటానికి మరో నాటకం ఆడారు గూడా. బ్రాంది సీసాను రాజారావు మీదకు విసిరాడు కళ్యాణరావు. అది గురి తప్పిపోయి గోడకు కొట్టుకుని పగిలిపోయింది. అవే పెంకుల్ని జాగ్రత్తగా తెచ్చి మూడో భవనంలో గూడా వాటిని మళ్ళీ వెద

జల్లారు. మేం లెల్లారి లేచాక, మేం చూస్తూండగా నేలమీది పెంకుల్ని శుభ్రం చేయించారు.''

నిరంజనరావు ఆగి ఊపిరి పీల్చుకున్నాడు.

''మరి మీ వెంట వచ్చిన సుగుణకు నిద్రమందు ఇవ్వ లేదా?'' ఇన్స్పెక్టర్ ప్రశ్నించాడు.

''ఆమెకు ఇవ్వవలసిన పనిలేదు. సుగుణ లగేజీని తీసుకుని కళ్యాణరావు మేడమీదకు వెళ్ళాడు. వెనుకనే సుగుణ, ఆమె వెనుకనే రాజారావూ పైకి వెళ్ళారు. మేమిద్దరం డ్రాయింగ్ హాలులోనే ఉండిపోయాం. అంతే! అదే సుగుణ శాశ్వతంగా నిష్క్రమించిది. వారిద్దరూ సుగుణను మాయంచేశారు. బహుశా ఆమె ఈ పాటికి హత్యచేయబడి ఉంటుంది.

''ఆమె స్థానే రాజారావు మేనగోడలు సుజాత—అచ్చం సుగుణలాగే మేకప్ చేసి తెచ్చారు. అదీగాక సుజాతగూడ అచ్చం సుగుణలాగే ఉంటుందిగూడ. సుజాత తన గొంతు గుర్తు పట్టకుండా ఉండటానికి, జలుబుచేసినట్టుగా నాటకమాడింది.

''తెల్లవారాక మేం మామూలుగానే నిద్రలేచాం. మమ్మల్ని ఒక భవంతిలోంచి రెండు మైళ్ళ దూరంలోని మరో భవంతి లోకి మార్చారని మాకు తెలియనేతెలీదు. ఆ పని చేసేందుకు వీలుగా, మాకివ్వబడిన గదుల తలుపులకు గడియలు ఊడబెరికి వేయబడినై.

''అన్ని భవంతులూ ఒకేరకంగా ఉన్నయ్. కిటికీలు, వాకిళ్ళూ అలమారులూ అన్నీ ఒకే మాదిరిగా ఉండటం మూలాన మేము తేడా కనుక్కోలేకపోయాం. అదీగాక ఎదురుగా ఉన్న రెండంతస్థుల మేడ రాత్రికి రాత్రే మటుమాయం అవడం తో మా ఆలోచనలు పెడమార్గం పట్టినయ్. పైగా గాలివాన ముసురు. సూర్యుడే కనిపించలేదు, కారుమేఘాలవల్ల, ఒకపూట

ఎండవచ్చింది. నేను సుగుణ గదిలో ఉన్నాను. ఆమె గది కిటికీ లోంచి చూస్తే సూర్యుడు ఉదయిస్తున్నాడు.

"క్రితంరోజున సుగుణ గది కిటికీలోంచే సూర్యాస్తమయాన్ని చూసిన రెండు రోజుల తర్వాత అదే గదిలోంచి సూర్యోదయాన్ని చూడడం నాలో ఆలోచననర్ని రేపింది.

"మనుష్యుల మతులు పోగొట్టవచ్చు, కానీ సూర్యచంద్రుల గతుల్ని ఎవరూ మార్చలేరు. ఆటంబాంబు ప్రేలినా సూర్యుడు తూర్పుదిక్కునే ఉదయిస్తాడు గాని, పడమటి దిశ ఉదయించడు గదా! ఆ సూర్యుని నడకే నాకు క్లూ ఇచ్చింది. ఆచూకీ కోసం అడవిలోకి పోవటానికి ప్రయత్నిస్తే ఎవరో నన్ను వెనుకనుంచి తలమీద కొట్టి స్పృహ పోగొట్టారు. కాని ఎందుకనో చంపలేదు? నన్నూ కృష్ణమూర్తినీ 'మహల్' నిజంగానే మాయమయిందని నమ్మితే వాళ్ళ పథకం పారినట్లే. మేం ఈ పరిణామానికి భయపడి వచ్చిన దోవనే వెళ్ళిపోతే వాళ్ళు తీరిగ్గా 'మహల్' అంతా శోధించి బంగారం నిధిని దొరకబుచ్చుకుని తమ దోవన తాము పరారీ కావచ్చు.

"బంగారం దొరకక పోయినాగాని, తమ చేతిలో కీలుబొమ్మగా ఆడే సుజాత, సుగుణగా చలామణి అవుతే ఉన్న ఆస్తిపాస్తులను కొద్ది కొద్దిగా అమ్మి డబ్బు చేసుకోవచ్చని వాళ్ళ ప్లాను."

"సుజాత విషయం ఎలా పసిగట్టావ్! నేనా మార్పుని గమనించనే లేదు సుమా?" కృష్ణమూర్తి ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆమె మేడ దిగి వచ్చి జలుబు చేసినందువల్ల గొంతు మారినట్టుగా నటించి నప్పుడే నాకు అనుమానం మొలకెత్తింది. తరువాత అసలు సుగుణ 'మహల్' లోంచి తన తల్లి ఫోటోని

ఆప్యాయంగా తెచ్చుకుని తన గదిలో పెట్టుకుంది. తరువాత ఆమె స్థానాన్ని ఆక్రమించిన సుజాత మనతో తిరుగు ప్రయ ణం అయేటప్పుడు తన పర్సుని ఫోటో ముందే ఉంచింది. రాజా రావుకి కాంతానికి నమస్కరించి, తిరిగి తన పర్సుని తీసుకొని వచ్చేసింది బయటకు, అదే నిజమైన సుగుణ అయితే ఆ ఫోటోకి గూడా నమస్కరించి ఉండేదే గదా? లేదా తన వెంట తెచ్చుకుని ఉండేది కదా? అలా చేయక కనీసం ఆ ఫోటోవంక కన్నెత్తి అయినా చూడలేదు. సుందరమ్మా హాల్లోకి వచ్చి సుగుణను తన చేత్తో పట్టుకుని స్పృశించి "సుజాత!" అని సంబో దించింది. అక్కడ మరి కొంత నిజం బయటపడింది. కాని రాజారావు ఏదో కట్టుకథ అల్లి, ఆవిడకు మతి లేదని మనల్ని నిమ్మించాడు,"

"డాక్టర్ రాజారావు గారూ! వారి అరోపణలకు మీ సంజాయిషి ఏమిటి?" ఇన్స్పెక్టర్ కోపంగా చూస్తూ అడిగాడు.

రాజారావు వ్యఖాన కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. ఇంకా ఏమిటి సంజాయిషి! నా బొంద! చేతిలోని రేఖలు చూసి జాత కం చెబుతున్న ఖచ్చితంగా చెబుతుంటే! నిజమే! శివరాం ప్రసా ద్ని స్లో పాయిజన్ ఇచ్చి చంపాను, అతడి ఆస్తిని కైవసం చేసు కోవాలనే దురాశతో సుగుణను మాయం చేసి ఒకటి రెండు రోజులు దాచిపెట్టి ఆ తర్వాత ఆమెను హత్య చేయమనే కళ్యాణరావుని ఆదేశించాను." రాజారావు నేరాన్ని ఒప్పుకున్నాడు.

సుజాత చేతుల్లో ముఖాన్ని దాచుకుని బోరున ఏడ్చింది.

"అన్నట్టు ఆ కళ్యాణరావు నిజంగా నౌకరేనా? లేక అతడు మీ బంధువర్గంలో వాడా?" నిరంజనరావు అడిగాడు.

"అతడు మా బంధువు కాదు. ఒకటి రెండుసార్లు పని

ఇప్పించండంటూ వచ్చాడు. వాడి రౌడీ వాలకాన్ని చూస్తుంటే మాకే భయం వేసేది, వాడ్ని నౌకరుగా ఎలా నియమించగలం? తరువాత మేం ఈ పథకం వేసుకున్నాక అతడ్ని పనిలో పెట్టుకున్నాం. మిగతా నౌకర్లందరికీ ఉద్వాసన చెప్పి."

"ఎందుకు? సుగుణను హత్య చేయటానికి! అవునా?" అంటూ అరిచాడు కృష్ణమూర్తి.

"ఇంతకీ బంగారం ఆచూకీ దొరికిందా?" ఇన్స్పెక్టర్ అడిగాడు.

"దాన్ని వాళ్ళు దొరక పుచ్చుకునే ఉంటారు. అంత తేలికగా నిజం చెబుతారా"? నిరంజనరావు కళ్ళు నిప్పులు కురిపిస్తూ అన్నాడు.

"లేదు! దొరకలేదు! నిజంగానే చెబుతున్నాను!', రాజారావు మొత్తుకున్నాడు.

"నాకళ్ళముందే ఒక భవనాన్ని మాయం చేయగల వాడివి మామధ్య తిరిగే అమ్మాయిని కిడ్నాప్ చేసి హత్య చేయించిన వాడివి, అదీ దొరక పుచ్చుకోలేక పోయావ్?" వెటకారంగా నవ్వాడు నిరంజనరావు. "ఒకరాత్రివేళ నీవు సుగుణ గదిలోకి ఎందుకు జొరబడినట్లూ? సుగుణ పోర్షన్ నిర్వహిస్తున్న సుజాతతో నీవు రహస్యంగా మాట్లాడ డానికే వచ్చావ్! అవునా?"

రాజారావు గుడ్లప్పగించి చూశాడు. "ఇన్స్పెక్టర్! ఇంకా ఈవాతావరణాన్ని భరించలేను. నన్ను త్వరగా తీసుక పోండి!" అని అరిచాడు.

డాక్టర్ రాజారావుకీ, సుజాతకూ సంకెళ్ళు వేసి జీప్‌లో ఎక్కించారు. జీప్ కదిలి పోయింది. కల్యాణరావు మాత్రం దొరకలేదు. నిరంజనరావు కోరిక పై ఇన్స్పెక్టర్ ఆ రాత్రి

అక్కడే ఉండిపోవటానికి ఒప్పుకున్నాడు.

# 17

గుమ్మములో కానిస్టేబుల్ కాసలా కాస్తున్నాడు. అతడికి ఆరాత్రి చీకట్లో ఎవరో ఇద్దరు వ్యక్తులు గేటుదాటి రావటం కనుపించింది.

"ఏయ్! ఎవరది? ఆగండి అక్కడే!" కానిస్టేబుల్ పెద్దగా అరిచాడు.

భోజనాలు పూర్తి చేసుకుని హాల్లో కబుర్లు చెప్పుకుంటున్న వాళ్ళంతా తలుపు తీసుకుని బయటకు పరుగెత్తారు లైట్లు వుచ్చుకుని.

ఆవచ్చింది ఎవరోగారు. కళ్యాణరావు, సుగుణ.

ఈ తడవ నిరంజనరావు నిజంగానే విస్తుపోయాడు. "ఏమిటీ? సుగుణ బ్రతికే ఉందా? ఆమెను నీవు హత్య చేయులేదా?"

"ముందు అతడ్ని లోపలకు రానివ్వండి"? అంటూ ఇన్స్పెక్టర్ లోపలకు దారి తీశాడు.

నేను చనిపోయిన శివరాం ప్రసాద్‌కి బంధువునే. అతడి మొదటి భార్యకు తమ్ముడ్నే నేను. నాచిన్నప్పుడు శివరాం తన భార్యను హింసించడాన్ని నేను అనేకసార్లు కళ్ళారా చూశాను. పెద్దయాక అయినా అతడిపై ప్రతీకారం చేసి కక్ష తీర్చుకోవాలను కున్నాను.

"అదే ఉద్దేశ్యంతో మాఅక్క చనిపోయాక, నేను ఈ ఇంట్లోనే నౌకరుగా చేరి నాపగ తీర్చుకోవాలని నిర్ణయించుకున్నాను. అయితే ఎన్నిసార్లు తిరిగినా నాకు పని దొరకలేదు. నేను తరుణం కోసం వేచి ఉన్నాను. ఈ లోపల శివరాం ప్రసాద్ చని పోవడం నాకు ఆశా భంగం కలిగించింది.

"అయితే మరో కొత్త విషయం తెలిసింది. ఆ మహల్.లో అంతులేని బంగారం దాచి ఉంచబడిందని తెలుసు కున్నాను. దాని ఆచూకీ కనిపెట్టి, అదైనా దొరకబుచ్చు కుందామని నౌకరుగా చేరాను. నావాలకంచూసి పనిలో చేర్చుకోవడానికి భయపడిన రాజారావు, ఒక హత్య చేయాల్సిన అవసరం కొద్దీ, నన్ను ఆపనికి వినియోగించు కున్నాడు.

"నేను సుగుణను అపహరించుకుపోయి రహస్యమైన చోట దాచాను. ఆమె శివరాం ప్రసాద్ కుమార్తె అని తెలుసుకుని. నన్ను నేనే పరిచయం చేసుకున్నాను. మా బంధుత్వాలు తెలుసు కున్నాక మేమిద్దరం ప్రేమించుకున్నాము. ఆమెకు అన్నం నీళ్ళూ సప్లయి చేసి, నామేన కోడల్ని నేను దక్కించు కున్నాను."

అందరి ముఖాల్లో సంతోషం విరిసింది. "అమ్మా సుగుణా! నీవు క్షేమంగానే ఉన్నావా?" అంటూ కృష్ణమూర్తి ఆమెను తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"లాయర్‌గారూ! వచ్చేవారంలో మా వివాహానికి ఏర్పాటు చేయించండి" కళ్యాణరావు నవ్వుతూ అన్నాడు.

"ఏమ్మా! చేయించమంటావా?" కృష్ణమూర్తి ఆమె వంక ఓరకంట చూశాడు.

"అవునండీ! మేమిద్దరం వివాహమాడటానికి నిశ్చయించుకున్నాం మీరే నా తరఫు పెద్దలు." అంది సుగుణ.

"మీ నూతన వధూవరలకు నేనో అపూర్వమైన కానుక ఇవ్వబోతున్నాను." నిరంజనరావు కంఠంవిని అందరూ ఆసక్తిగా అతడివంక తిరిగారు.

"సుగుణా మీ అమ్మగారి ఫోటో తీసుకురా!" అన్నాడు నిరంజనరావు.

సుగుణా, కళ్యాణరావు ఇద్దరూ మెట్లెక్కి మేడమీదకు వెళ్లారు. సుగుణ తల్లి ఫోటోతో తిరిగి వచ్చారు.

దాన్ని అందుకుంటూనే నిరంజనరావు ఆ పటానికున్న పందపాటి ఫ్రేమ్‌ని పెటపెట విరిచేశాడు

"అదేమిటి? బంగారంలాంటి ఫ్రేమ్, పాతకాలం నాటిది, పాడుచేస్తున్నావేమిటి?" కృష్ణమూర్తి అరిచాడు.

"అదే! అదే! ఆ బంగారం కోసమే నేనూ దీన్ని విరిచేది!" నిరంజనరావు ఫోటో క్రింద దాచిపెట్టబడిన వాటిని వెలికిలాగాడు.

అతడి చేతులో కాగితాలకట్ట ఉంది. "ఏమిటా కాగితాలు?" అందరూ ఒక్కసారే ప్రశ్నించారు.

"ఈ కాగితాలు చూడండి! బంగారం బాండ్స్! పాకిస్థాన్ తో యుద్ధసమయంలో మన ప్రభుత్వం బంగారు బాండ్లను గోల్డ్ సర్టిఫికెట్లను జారీచేసింది, ప్రభుత్వం వద్ద బంగారు నిల్వలను పూరించటానికి. ఆ సమయంలో శివరాంప్రసాద్ తన వద్దనున్న లక్షలు విలువ చేసే బంగారాన్ని ప్రభుత్వ బాండ్లరూపంలోకి మార్చివేశాడు.

"సుగుణ తల్లిపై అతడికిష్టం కాబట్టి వాటిని ఆ ఫ్రేమ్‌లో దాచాడు. బతికి ఉన్నన్నాళ్ళూ ఆ ఫ్రేమ్‌ని తన కళ్ళెదుటే ఉంచుకున్నాడు. అందరూ అతడు చివరిదినాల్లో తన భార్య ఫోటోని దగ్గరపెట్టుకున్నాడనే అనుకున్నారుగాని అతడి నిధి ఆ ఫ్రేమ్‌లోనే నిక్షేపించబడిందని ఎవరూ ఊహించలేకపోయారు"

మరుక్షణంలో అందరూ నిరంజనరావుని అభినందించటానికి అతడి చుట్టూ గుమిగూడారు.

—: ఐపోయింది :—

# ఖైదీ సీరియల్

## (పదునాల్గవ భాగము)

యుద్ధానికి సన్నద్ధులైన సైనికుల్లా మాగుంపంతా కత్తులు, కటారులు ధరించి సిద్ధంగా వున్నారు. నాయకుడు పూర్తిగా త్రాగి వున్నాడు.

ఆకాశంలో నక్షత్రం అంతకుముందు అతను నాకు చూపించిన ప్రదేశం చేరుకొంది. అందర్నీ కదలమన్నాడు.

గుంపు గూడెంనుండి బయలుదేరింది.

ప్రతి మనిషి చేతిలోనూ ఒక్కొక్క దివిటీ జ్వాజ్వల్యమానంగా వెలుగుతూంది. అందరికన్నాముందు నాయకుడు నడుస్తున్నాడు. అతనివెంట నేనున్నాను. నా వెనుక మిగిలిన వాళ్లంతా లైనుగా వస్తున్నారు.

సముద్ర తీరం చేరేందుకు గంట పట్టింది.

ఇసుకలో ఇరుక్కుపోయిన డింగీల్లాంటి చిన్న చిన్న పడవలు ఏడు వందలదాకా వున్నాయి. ఒక్కొక్క దాంట్లో ఇద్దరిద్దరు ఎక్కారు నీళ్లలోకితోసి, నేనూ నాయకుడూ ఒకదాంట్లో ఎక్కాం.

అక్కడ సముద్రం భయంకరమైన లోతున్నట్లుంది. అలల మాటంచి చిన్న కెరటం కూడా లేవడంలేదు. ప్రశాంతంగా వుంది. కనీసం హోరుకూడా వినిపించడం లేదు. జాగ్రఫీలో

చదివినప్పుడు అన్ని సముద్రాల్లోకి పసిఫిక్ మహా సముద్రం చాలా ప్రశాంతమైనదన్న విషయం తెలుసు కొన్నాను చిన్నప్పుడు. ప్రస్తుతపు ప్రశాంతత గమనించాక ఇది పసిఫిక్ మహా సముద్రమై వుండాలని పించింది.

అంటే నేనూ డెల్లా, పసిఫిక్ సముద్ర ప్రాంతంలో వున్న ఏదో ఒక దిక్కుమాలిన దీవిలో ఇరుక్కుపోయి వుండాలని తీర్మానించుకున్నాను.

బొంబాయి దగ్గర అరేబియా సముద్రంలో ప్రారంభమైన ప్రయాణం, పసిఫిక్ ప్రాంతాలదాకా జరిగిందని తెలిశాక విచిత్రం కలిగింది. నా మాతృదేశానికి దాదాపు ఆరు ఏడువేల మైళ్ల దూరంలో వున్నాను. ఈ దూరం తరిగి మళ్లీ బొంబాయి చూచే అవకాశం ఈ జన్మకింక కలుగుతుందో లేదోనన్న అనుమానం మొదలైంది.

నేనేం మాట్లాడకుండా, ఆలోచిస్తూ కూర్చోవడం గమనించిన నాయకుడు "నీ పెట్టె దుర్గ కొస్తుందా?" అడిగాడు.

"ఆఁ!" అన్నాను.

"ఆమె గురించి కంగారు పడకు. నిన్ను సుఖంగా ఆమె దగ్గరకు చేర్చేపూచీనాది." అన్నాడు.

నేనేం మాట్లాడ లేదు.

డింగీలన్నీ చకచక ముందుకు వెళ్తున్నాయి. అన్నీ గుంపుగానే కదుల్తున్నాయి. అంతా హాహాకారాలు పెడుతున్నారు. అల్లరి చేస్తున్నారు. వాళ్ళ అరుపులకూ, అల్లరికీ, సముద్రమే భయపడి పోతున్నట్లుగా తోచిందినాకు.

వాళ్లు చెప్పిన షిప్ కోసం చూశాను. నాకెక్కడా కనుపించ లేదు. అసలు నిజంగా వస్తూందో, లేదో! అనుకున్నాను.

"ఇంకా కనుపించడం లేదే నువ్వు చెప్పిన ఓడ?" అడిగాను

నాయకుణ్ణి.

"ఇంకొక మైలుదాకా పోతేగాని కనుపించదు." అంటూ మళ్ళీ సీసా తీశాడు. కార్కు ఓపెన్ చేసి పట్టించాడు. అతను తాగే విధానం చూసి సముద్రపు దొంగతనాల్లో ఎక్కువగా తెచ్చుకునేదీ, వాడుకునేదీ, విస్కీలాగే తోచిందినాకు.

సగం తాగి సీసా నాకందించాడు!

నేను మిగిలింది పట్టించాను. ఖాళీసీసాను సముద్రపు నీళ్ల లోకి బలంగా విసిరి కొట్టాను.

"ఈ మారు ఓడలో కొన్ని క్రొత్తవస్తువులు దొంగిలిద్దా మనుకుంటున్నాను." అన్నాడు నాయకుడు నాతో.

"మా గూడెంలో మాకు చాలినంత మందీ స్త్రీలు లేరు. వాళ్ళు గర్భంధరించేది జన్మకొక్కసారే. చాలా వరకు మగపిల్లలు పుడుతున్నారు. వంద సంవత్సరాల క్రితం వందమందుండే వారు. ఇప్పటికి ఇరవై మంది లేరు. ఇలాగైతే ఇంక కొన్ని సంవత్సరంల్లో అసలు ఆడవాళ్ళే లేకుండా పోయేటట్లుంది." అన్నాడు నాయకుడు.

"అందుకని......" ప్రశ్నార్థకంగా అతనికేసి చూశాడు.

"కొంతమంది ఆడవాళ్లను కూడా తీసుకొద్దామనుకుంటు న్నాను. వాళ్లను మా గుంపులో కలిపేస్తాను." అన్నాడు.

ఒక్క క్షణం ఆశ్చర్యంతోపాటు, వాళ్లపై అసహ్యం కూడా వేసింది.

అతనికీ ఐడియాలున్నాయి. ఆలోచనలున్నాయి. వాటిని కార్య రూపానికి తెగలిగే శక్తి యుక్తులు కూడా వున్నాయి. నేననుకున్నంత అమాయకులుగానీ, అవివేకులుగానీ, కాదీ అడవి మనుషులని అప్పుడర్థమయింది నాకు.

"దొంగిలించి తెచ్చాక వాళ్ళ యీగుంపులో కలిసి,

వాళ్లలో వుండుగలరన్న నమ్మకం నాకు లేదు!'' అన్నాను.

''ఎందుకని?''

''వాళ్లు నాగరీకులు. ఇక్కడి పరిస్థితులు. మా వాళ్ల రూపాలు, పద్ధతులు చూసి భయపడి ఆత్మహత్యన్నాచేసు కుంటారు తప్ప లొంగిపోరు.''

''నువ్వు మాతోవున్నావుగా, వాళ్లు మెచ్చుకొనే విధంగా మాకులం వాళ్ళను తయారు చేయిస్తాను నీతోనే మాకు నాగరికత నేర్పించు. తెలియ్ని విషయాల్ని తెలియ జెప్పు. మా వల్ల ఏ విధమైన ఇబ్బంది వుండదని మీ భాషలో వాళ్లకు నువ్వేనచ్చ చెప్పు. మనస్ఫూర్తిగా వాళ్లు ఇష్టపడేదాకా, మేం వాళ్లకు దూరంగా వుంటాం.'' అన్నాడు నాయకుడు.

ఇంక అతని వాదనను ఖండించడమెలాగో తెలేదునాకు. డింగలు ముందుకు పోతూనే వున్నాయి. దాదాపు రెండు గంట లకు పైనే ప్రయాణం చేశాం.

షిప్ మాత్రం కనుపించలేదు.

''మనం వచ్చేసరికి అది కాస్త దాటి పోయిందేమో?'' అన్నాడు మాట మారుస్తూ.

''అసాధ్యం. మాకు లెఖలున్నాయి. ఇంకా అరగంటకుగాని అది ఈ ప్రాంతానికి రాదు. మధ్యలో దాని కేదయినా ఇబ్బంది వస్తే ఇంకా ఆలస్యమవుతుంది తప్ప, ముందుగా ఏ పరిస్థి తుల్లోనూ రాదు!'' అన్నాడు.

కంప్యూటర్‌తో లెఖలు వేసే వాళ్లకన్నా, ఖచ్చితంగా చెప్పాడు.

మళ్లీ నా మెదడు అతను వాళ్ల గుంపులోని ఆడవాళ్ల గురించి చెప్పిన విషయాల పైకి వెళ్లింది.

జన్మ కొక్కసారికి మించి వాళ్లగుంపులోని స్త్రీలు గర్భం

ధరించరని అతను చెప్పిన మాటలు నాకు అర్థం కాలేదు. అదోరకం ఫామిలీప్లానింగు లాగుందను కున్నాను ముందు. అక్కడి వాతావరణంవల్ల అలా జరుగుతుందేమోననిపించింది. నా అనుమానం తీర్చుకుందామనిపించి అడిగాను నాయకుడ్ని.

"గర్భం వచ్చాక వాళ్ళు మాకు ఉపయోగించారు. అప్పుడు మరీ తక్కువవుతారు వాళ్ళు మాకు. మాకు అనుమానం రాగానే అడవిలో ఒకరకమైన ఆకులు దొరుకుతాయి. మేము చెప్పకుండానే వాళ్ళు నమిలి తింటారు. దాంతో గర్భం పోతుంది. మొదటి గర్భం మాత్రం నిలుపుకుంటారు. పిల్లల్ని కనేది తొలుచులులోనే." చెప్పాడు.

వినివిస్తుపోయాను.

అతను చెప్పింది సమంజసంగానేవుంది. ఆరువందల మందికి వున్నది. ఇరవై మంది స్త్రీలు. వాళ్లతో వీళ్ళు కలుసుకునేది నెలకొకసారి. గర్భం కారణంగా, అందులో ఇంకా కొంతమంది ఆగిపోతే......"

"అదుగో! అటు చూడు!!" నాభుజం పట్టుకుని కుదుపుతూ అరచాడు నాయకుడు.

అతను చెప్పిన వేపు చూశాను.

ఎర్ర పచ్చ లైట్లు డెక్‌మీద వెలుగుతున్న స్టీమరు కనిపించింది. డింగీలు స్పీడుగా దాని వైపు పరుగెత్తుతున్నాయి.

స్టీమరు కూడా వేగంగానే కదులు తూంది.

మళ్లీ ప్లాను ఏమిటో నాకు అర్ధంగాలేదు. దానివెంట డింగీల్లో ఎంతదూరం పరుగెత్తితే అది అందుతుందన్నది అంచనా వెయ్యలేక పోయాను. దగ్గరకు చేరాక దానిలోనికి ఎలా వెళ్తారో కూడా నా ఊహకందలేదు.

"ఆ స్టీమరువేగంగా పోతూంది. దాన్నెలా అందుకుంటాం

అడిగాను.

"చూస్తూ వుండు. మరో అరమైలు పోయాక అదే ఆగు తుంది." అన్నాడు. నాయకుడు.

"ఎందుకు."

"అక్కడ సముద్రం సన్నగా వుంటుంది. అటు ఇటు రెండు కొండలున్నాయి. నీళ్లల్లో క్రింద కూడా ఎత్తయిన కొండలున్నాయి. చాలా చిన్నగా పోతుంది మామూలుగా అక్కడ. మనం ముందే అక్కడ్నుంచి స్టీమరులోకి దూకుదాం. నీకు చెప్పి లాభంలేదు. చూస్తూ వుండు. ఎలా జరుగుతూందో. మనవాళ్ళు ఇందులో ఆరితేరి వున్నారు." అన్నాడు నాయకుడు.

డింగీలు స్టీమరువేపు వెళ్లకుండా, అడ్డదారి బడ్డాయి. అన్నీ గుంపుగా మాత్రం కదలడంలేదు.

పదిహేను నిముషాల్లో అంతకుముందు నాయకుడు చెప్పి నచోటికి వచ్చేశాం. సముద్రం అక్కడ వొంపు తిరిగి పోతుం డటం గమనించాను. సన్నటిపాయులాగుంది. అక్కడ. అతను చెప్పినట్లే ఎత్తు కొండలు కను పించాయి.

అటు సగంమంది వెళ్లిపోయారు. కొండ శిఖరాలకు చేరాం. దివిటీలు వెలుగుతున్నాయి.

స్టీమరులో వున్న వాళ్ళు ఈ దివిటీలను చూసి సగం భయంతో చచ్చివుంటారుకొన్నాను. కొరివిదయ్యాల్లా గున్నాం మేమంతా. స్టీమరు రాకకోసం ఎదురుచూస్తూ.

మరో అరగంట తర్వాత వచ్చింది స్టీమరు మేమున్న ప్రాంతానికి. దివిటీల వెలుగులో వెలుపలున్న అక్షరాలను చదివి అదికార్గో షిప్ అని తెలుసు కున్నాను.

"అందులో మనుషులెక్కడ వుంటారు. సరుకులు చేరవేసే స్టీమరది." అన్నాను.

"ఏదో ఒకటి. దూకండి." అంటూ ఆజ్ఞ ఇచ్చాడు.

కొండల మధ్య కొచ్చిన స్టీమరు ఆగిపోయింది. బహుశా నావిగేటర్ అడ్జస్టు చేసుకునేందుకు ఏమో అనుకున్నాను.

అందరితోపాటు నేనూనాయకుడు కూడాలోనికి దూకాం.

ఆ గుంపు చకచక నాలుగు వైపులా వున్న లంగర్లు క్రిందికి దించే పనిలో నిమగ్నులై వుండటం గమనించి ఆశ్చర్య పోయాను.

నేను గబగబ నడుచుకుంటూ ఇంజన్‌రూం కేసి దారి తీశాను. నాయకుడు కూడా నావెంట వచ్చాడు.

అప్పటికే మాజనంతో నిండిపోయింది ఓడ.

స్టీమరులో మొత్తం అరవైమంది దాకా వున్నారు వాళ్ళు. వాళ్ళు నోళ్ళు నొక్కుకుని గుడ్లప్పగించిచూస్తూ నిల్చున్నారు మౌనంగా. బహుశా సముద్రపు దొంగలగురించి వాళ్ళకు ముందే తెలిసి ఉండాలనిపించిందినాకు.

అడవి మనుష్యుల్లో నన్ను చూడగానే స్టీమర్ కెప్టెన్‌కు ఆశ్చర్యం వేసింది.

"మీ అనుచరులను అనవసరంగా అల్లరిచెయ్యకుండా వుండమని చెప్పు. మాకు కావలసిన వస్తువులు దోచుకుని వెళ్తాం. అనవసరమైన రక్తపాతం నాకు ఇష్టంవుండదు." అన్నాడు కెప్టెన్‌తో ఇంగ్లీషులో.

"ఈ గాంగుకు నాయకుడివి నువ్వేనా?" అడిగాడు కెప్టెన్.

(సశేషం)

# సప్లిమెంట్ పోటీ-10

73,74,75,76,77 అంకెలను తీసుకొని, మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళలో పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, దానితో 75 పైసల పోస్టలు స్టాంపులు జతపరచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేర్చాలి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలువేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఒక ఏడాది సప్లిమెంట్ ఉచితంగా పంపుతాం. ఈ పోటీలో అందరూ పాల్గొనవచ్చును.

ఒక్కొక్కరు 3 కూపన్లకు మించి పంపకూడదు. ప్రతి కూపనుకు 75 పైసల పోస్టలు స్టాంపులు పంపాలి. ఫలితాలు సెప్టెంబర్ 75 నెల మాస పత్రికలో చూడండి.

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖ చిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చు.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20/- లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్‌డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులు కానివారు తమ సభ్యత్వ రుసుము పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాస పత్రికలో ప్రచురించ బడతాయి.

—ఎడిటర్.

# మీరే ఎన్నుకోండి?

ఈ "సప్లిమెంట్" లో మొత్తం మూడు నవలలు ప్రచురించబడ్డాయి. వీటిలో మీకు బాగా నచ్చిన, అత్యుత్తమంగా తోచిన నవల పేరును, ఒక పోస్టుకార్డుపైగాని తెల్లకాగితంపై వ్రాసి, యీనెల 15 వ తేదీలోపల మాకు చేరేటట్లు పంపండి.

1. ఎడారిరేచులు.

2. నీతిలేని వాళ్ళు.

3. మాయమైన మహల్.

పై మూడు నవలల్లో ఉత్తమ నవలగా పాఠకులు ఎన్నుకున్న రచయితకు రు. 116/–లు బహుమతి అందజేయబడుతుంది. దీనిలో ద్వితీయ, తృతీయ స్థానాలంటూ వుండవు.

బ్యాలట్‌లో పాల్గొనే పాఠకులు ఉత్తమనవల పేరుతో పాటు, తమ పూర్తి చిరునామా, హో౦. డె. సభ్యత్వం నెంబరు విధిగా వ్రాయాలి. హో౦. డె. సభ్యులు కాని పాఠకులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపండి.

ఫలితాలు వచ్చేనెల మాసపత్రికలో ప్రచురించబడతాయి.

—ఎడిటర్

# మనవి

స్థలాభావంచేత, నవలలు పెద్దవికావడంవల్ల యీ సంచికలో శ్రీ కంచర్ల రమణగారి "హత్యా చేసి చూడు" నవల ప్రచురించలేక పోతున్నందుకు విచారిస్తున్నాము.

—ఎడిటర్

# చిరుహాసవినోదం

రాజా దంపతులకు తొలిచూలు కుమారుడు జన్మించాడు.

బాలసారె దినోత్సవం నాడు, అందరూ ఆనందోత్సవాల్లో మునిగి తేలుతుంటే, రాజు మాత్రం దిగాలుగా కూర్చున్నాడు.

"దాని కారణం చెప్పమని" అందరూ అతడ్ని నిలదీసి అడిగారు.

"ఆఁ...ఏం..లేదు. కల్తీ—కల్తీ—కల్తీ, అంతా కల్తీ అయిన ఈ కలియుగంలో, మాకు ఉద్భవించిన కుమార శేఖరుడిలో గూడా ఏమైన కల్తీ వుందేమోనని..."

⁂ ⁂ ⁂

"జై అపరాధ పరిశోధనా!!"

"నరుడా ఏమి నీ కోరిక!!"

నేను పంపిన జోక్సు ప్రచురింప బడేట్లు చూడు తల్లీ!!"

"ఏంటయ్యా! అంత హుషారుగా పరుగెత్తుకు వచ్చిన వాడివి, అలా నీరు కారి పోయావేం?"

"తోటలో కూర్చున్నపుడు ఏదో మాంఛి జోకు తలపుకు వచ్చింది. ఇంటికి వచ్చి రాయాలనుకుని, పరుగెత్తుకుంటూ వచ్చి, మన ఇంటి ముందు వున్న పెద్ద కాలువ మీంచి ఎగిరి గంతేసి ఉన్న జోకు కాస్తా మరచి పోయాను."

—కొండపల్లి వెంకటేశ్వరరావు, హైద్రాబాదు.

వ్యాకరణ పండితుడితో అతని భార్య—

"ఏమండీ! కర్త, కర్మ, క్రియ, అంటే ఏమిటండీ?"

"నిన్ను నాకు కట్టబెట్టాడు చూడు, అతడు కర్త! నిన్ను కట్టుకుని నేను పడుతున్నది కర్మ! ఇక నువు చేస్తున్నవన్నీ క్రియలే!!"

✲ ✲ ✲

భార్య:—నిన్న రాత్రి మీరు పట్టు చీర కొన్నట్టు నాకు కల వచ్చిందండీ!.

భర్త:—అయితే, ఈ రాత్రి కలలో దాన్ని కట్టుకో.

"ఏమిటోయ్! మీ వాడు ఈ రోజు అంత సంతోషంగా గంతులు వేస్తున్నాడు. రిజల్ట్సు తెల్సాయేమిటి? పరీక్ష పాస య్యాడా?"

"అబ్బే!. అదేంకాదు. వాడి జోక్సును ప్రచురణకు స్వీక రించామని సంపాదకుడు వ్రాసిన వుత్తరం వుదయమే అందింది"

—కె. ప్రసాద్, శ్రీకాకుళం.

ఆ యువకుడి చెంప ఛెళ్ళుమంది. "మళ్ళీ గీటుతావా! రాస్కెల్!" అంది కోపంగా విశాలాక్షి.

"క్షమించాలి. మీరు పొర బడ్డారు. నాకు కళ్ళు అంటుకొనే జబ్బు ఉంది. మిమ్మల్ని ఎగతాళి చేసే ఉద్దేశం నాకు లేదు" అన్నాడు ఆ యువకుడు.

❖ ❖ ❖

"ఇన్నాళ్ళు వాళ్ళ ఉప్పుతిని బ్రతికాను. అతనికి ద్రోహం ఎలాచేయను!" అన్నాడు రామలింగయ్య.

"ఫర్వాలేదు. ఎంత తిన్నావొచెప్పు. లెక్కకట్టి ఇచ్చేద్దాం!"

"ఆకలుండదు దాహముండదు నిన్ను చూస్తుంటే...." పాడుతున్నాడు భర్త, భార్యను సంతోషపరచడానికి.

"వీరలా గంటూరనితెల్సు. అందుకే ఈ రోజు వంట చేయలేదు," అంది భార్య ప్రేమగా భర్త జుట్టులోకి వేళ్ళు జొనుపుతూ.

—ముద్దా సురేష్, కాకినాడ.



